Patibanda Venkata Subba Rao.
VIth form.

B-37

# పీఠిక

Board High School
Gannavaram

దేశీయులయభివృద్ధికిఁ జరిత్రములె యాధారములు. పూర్వకాలమున నసమానఖ్యాతినొందినజాతి కాలవశమున నణఁగుటయు నాగరకప్రపంచముమొగ మెఱుఁగని యాటవికజాతి యమోఘవిజ్ఞానము నార్జించి ప్రపంచమునఁ బైచేయియగుటయుఁ జరిత్రములలోఁ మనము పఠించుచున్నారము. కాలమునకుఁ గలశక్తి యమోఘమైనది. ఉచ్చనీచదశలు ప్రపంచమునందున్న సర్వవస్తువులేగాక వస్తునిర్మాతయగు భగవంతుఁడు సైత మొందుచున్నటుల మనపురాణములు వాకొనుచున్నవి.

M. Satyanarayana Rao

చరిత్రవాఙ్మయమును సానురాగదృష్టితోఁ జూచితిమేని భరతఖండమునఁగల తక్కినజాతులతో నేదును దీసిపోవనిదిగా "నాంధ్రజాతి" కనుపట్టుచున్నది. ఆంధ్రులలోఁ గవీశ్వరులుకలరు; చక్రవర్తులు గలరు; జ్యోతిశ్శాస్త్ర గణితశాస్త్రమర్మములు గనిపెట్టిన మహామహులు గలరు. ఆంధ్రదేశమునంతయుఁ జక్రముత్రిప్పినటులఁ ద్రిప్పి బుద్ధిబలముచేఁ బోటుదనముచే నసమానఖ్యాతివహించిన మంత్రిసత్తములు కలరు. కోలాచల మల్లినాథునివంటి వ్యాఖ్యాతను, విద్యారణ్యులవంటి యాత్మజ్ఞుని, యేలేశ్వరోపాధ్యాయునివంటి శాస్త్రజ్ఞుని, కుమారిలభట్టునివంటి కర్మవాదిని గాంచిన రత్నగర్భయగు నీ యాంధ్రభూమి ప్రతిభ యెంతిగొనియాడిన నతిశయోక్తి కానేరదు. కేవల స్తోత్రపాఠముల వృద్ధిసూచకములుకావు. పూర్వుల విఖ్యాతు లన్నింటిని నొకతెగవారు చరిత్రగ్రంథములలోఁ జేర్పవలయును. కవులు వాని భావగీతములలోఁ బల్లెపాటలలోఁ బదములలోఁ జేర్చి మఱచిపోయిన యాంధ్రప్రతిభ మాతృభూమిలో నొక్కమాఱు ముక్తకంఠముతో సోదరులచే గానము చేయింపవలయును. వీరమాతలు శిశువులకుఁ బసినాఁటనుండియే యాంధ్రవీరుల విక్రమముల జోలపాటలుగఁ బాడవలయును. సర్వతోముఖముగ నాంధ్రసేవ యీవిధముగ జరిగెనేని ప్రతిభావంతమగు నాంధ్రజాతి యాధునికయుగమునఁ దొల్లింటి కీర్తితో నుల్లసిల్లు ననుటకు సందియము లేదు. అంతటి స్వాభిమానము మాతృభూమి పైఁ గలిగింపవలసినవారు కవులె. ఆభారము కవులదె.

Patibanda Venkata Subba Ra
VIth form.
Board High Sch

చరిత్రగ్రంథములు చాలినన్ని యాంధ్రదేశమున లేవు. వాఙ్మయచరిత్రము బహిరంగాకారము దాల్చినదేగాని దానికి హృదయకోశము, జీవకళ, అస్థిపంజరము, రక్తమాంసము లేర్పడలేదు. శాసన పరిశోధనము, చరిత్రపరిశోధనము సాగవలసి యున్నది. మానవజీవితమునకు, సాంఘికములకు, శాస్త్రీయ రహస్యములు గ్రహించుటకుం జాలినన్ని గ్రంథములు లేక నాంధ్రవాఙ్మయములోనికి: బరివర్తనము కాలేదు. ఆంధ్రకవుల చరిత్రము, ఆంధ్రవాఙ్మయ చరిత్రము, ఆంధ్రవిజ్ఞానసర్వస్వము, ఆంధ్రపత్రిక లోనగునవి యాంధ్రసారస్వతమునకు జీవకళల సమకూర్చుచున్నవి. ఈయదనున నాంధ్రులు తమ ప్రత్యేక వ్యక్తిత్వమును నిలువంబెట్టుకొనుటకు సహస్రహస్తములతోం బాటుపడి దేశచరిత్రమునకు వీరుల జీవితములకు రాజన్యులజీవితములకు వలయు సారస్వత పరిశోధనము తీవ్రకృషితోం గావించి విషయసంగ్రహము చేయవలసి యున్నది. ఇది మాతృభాషాసేవా పరాయణుల ప్రత్యేక [illegible] యున్నది.

ఆంధ్రవ్యాఖ్యాతలను, ఆంధ్రరాజులను, ఆంధ్రవీరులను గూర్చిన ప్రత్యేకచరిత్రములు మన ప్రతిభ గ్రహించుటకుం జాల ముఖ్యములైనవి. ఇతర సారస్వతములలో స్వదేశాభిమానము, స్వభాషాభిమానము, స్వజాత్యభిమానము కలిగించు గ్రంథములు పెక్కులు కలవు గాని మన సారస్వతమున కట్టియదృష్టము కలుగలేదు. ప్రాచీన కవులెల్లరు ప్రబంధనిర్మాణముతోం గాలము గడపిరి. ప్రబంధ సిద్ధాంత మొక చక్రము వంటిది. ఒకటే యాకారము. ఒకటే పరివర్తనము. ఒకటే యుపయోగము. ప్రతిబింబపటములు గూడం బెక్కులు బయలుదేరినవి. "గతానుగతికో లోకః" యనినట్లు నొకడుపోయిన ప్రాంతమే రెండవవారికి సుగమమైనది. స్వాతంత్ర్య భావములు, స్వతంత్రకల్పనములు మఱచిపోయిరి. ఈ ప్రబంధయుగములోని నాటకయుగము, నవలాయుగము బయలువెడలినవి. సారస్వతమీ విచిత్రగ్రంథసముదాయముతోం బరివర్తనములొందుచు మఱలంబూర్వ పథమున నీగుచు నాందోళించు తఱి బయలువెడలిన చరిత్రయుగము.

ఆంధ్రసేవ గావించుటకుఁ బెక్కుగ్రంథములు విద్యాధికులు వ్రాయుచున్నారు. ప్రత్యేకాంధ్రప్రతిభాదికములను వెల్లడించు గ్రంథములు మిగుల నరుదుగా నున్నవి. ఆంధ్రసామ్రాజ్యచరిత్రములను దిద్ది భాషకు, దేశమునకుఁ జాలిసంతసేవఁ గావించి యిహపరముల యందుఁ గృతార్థులైన మన కాదర్శప్రాయులైన మహానుభావుల యుత్తమజీవితములె మనకుఁ బఠనార్హములు. అట్టివారిలో స్వార్థ త్యాగులు, వీరచూడామణులు, స్వామిభక్తిపరాయణులగు నాంధ్ర మంత్రులు దేశమున కాదర్శప్రాయులు. అట్టి వీరాగ్రగణ్యుల జీవితములు గొన్నిభాగములుగఁ జరిత్రానుకూలముగఁ బ్రకటించి భాషా సేవ, యాంధ్రసేవ గావించుటకే మే మీ యాంధ్రమంత్రుల జీవితమును వ్రాసితిమి. ఇది ప్రథమభాగము. ఇందు మహామహులగు పది మంది మంత్రులజీవితములు చరిత్రానుకూలముగ సేకరించితిమి. ఇది కేవల చరిత్రముకాదు. కేవల కల్పితముకాదు. కథాకాలములు మాత్రము తెల్పి చర్చనీయాంశములు, భిన్నాభిప్రాయములు, వివాదాంశములు వదలి మానవజీవితాదర్శకముగా నుండున ట్లీ చరిత్ర గ్రంథమును పాఠకుల కాసక్తిగలిగించుటకై ప్రాచీనకవుల పద్యములను గథాసందర్భములలో నిమిడ్చి నూతనమార్గముగ నీగ్రంథమును వ్రాసియున్నారము. ఈవిధముగఁ బదిమందికి మించని మంత్రులను దీసికొని యొక్కొక్కభాగము చొప్పునఁ బ్రకటింపఁదలఁచి చరిత్రాంశములను సేకరించుచున్నారము. ఆంధ్రులలో మంత్రిపదవి నలంకరించి కవితారాజ్యము, ప్రభునిసామ్రాజ్యమును సమముగా వెలయించిన ధన్యులు వేలకొలఁది గలరుగాని వారిజీవితములు సంపూర్ణముగ నేఁడుఁ దెలియుట దుస్తరము. కావ్యములలోఁ గృత్యాదులయందుఁ గవులు గ్రంథనామములు, వంశావళులు మాత్రము వ్రాయుచున్నారు. ఇతర చరిత్రాధారములు లభించినఁ గాని జీవితచరిత్రము వ్రాయుటకు వీలు చిక్కదు. దేశభాషలలో నట్టి యాధారములు చాలవు. చెన్నబసవేశ్వరుఁడు, గురుమల్లికార్జునపండితారాధ్యులు, విశ్వేశ్వరశివదేశికులు, సోమనాథుఁడు, గంగామాత్యుఁడు, బొడ్డపాటి అన్నమా

త్యుఁడు లోనగు నాంధ్రశూరుల జీవితములు సంపూర్తిగ గ్రహింప నాధారము లింతవఱకు లభింపలేదు. వీరల నాంధ్రమంత్రుల జీవితములలోఁ జేర్చుటకు వలయునన్ని గ్రంథాధారము లార్జింపవలసియున్నది. శాసనములలోఁ జరిత్రములలోఁ గృత్యాదులలోనున్న స్వల్ప వర్ణనాంశములు జీవితనిర్ణయమునకుఁ జాలవు. ఇందులకై ప్రత్యేక కృషి యావశ్యకము. ప్రబంధముల సహాయము చరిత్రములకుఁ జాలదు. అందుఁ జరిత్రసాధనము లుండునుగాని కథాంశము లుండవు. కథాంశము, జీవితములు వ్రాయు నాచారము మనలోఁ బూర్వము లేదు. కాన నూతనాంశసంగ్రహణము దుస్తరమే. దృష్టాంతముఁ జూడుఁడు. రాజేంద్రచోడుఁడు ఇఱువదియొక్క వేయి గ్రామముల కధిపతి. అతనిమంత్రి కొమ్మనామాత్యుఁడు కార్యఖడ్గప్రవీణుఁడు. కొమ్మనామాత్యుని విక్రమమును కేయూరబాహుచరిత్రములో నిటుల మంచనకవి వర్ణించియున్నాఁడు:

సీ॥ సెలకట్టెవాఁటునఁ జెలఁగి రెంటిని మూఁటఁ
గూడ గుఱ్ఱంబుల గుదులు గ్రుచ్చుఁ
బ్రతిముఖంబగు నరపతుల కత్తళమునఁ
గడిమిమై వీపులు వెడలఁబొడుచు
బందంపుగోఱయడ పగిది నేనుంగుల
ధారశుద్ధిగ నసిధార దునుముఁ
చదియించుఁ బగిలించుఁ జేతులఁటవో
వడిఁ గాండమేసి మావతులతలలు

తే. గీ॥ తలపుడికి వేసి మావంతుతలలు శత్రు
రాజశిరములుఁ ద్రొక్కించు రాఁగెఁ దిరుగ
వాగె నుబ్బెడు తన వారువంబుచేత
మహితశౌర్యుండు కొమ్మనామాత్యవరుఁడు॥

ఇట్టి కొమ్మనామాత్యుని జీవితము మంత్రుల చరిత్రములోఁ జేర్పదగినంత లభింపకపోవుటకుఁ గాదు' బరితాపకరాంశ మింకొకటి

యుండదు. ఇటులె వీరశిరోమణులగు పలువురు మంత్రుల జీవితము కాలగర్భమునఁ గలసిపోయినది. ఉద్ధరింప నెవరికి సాధ్యము!

మే మీ యాంధ్రమంత్రుల చరిత్రము వ్రాయుటలో ముప్పది యిద్దఱుమంత్రుల చరిత్రము నుపయోగించుకొనవచ్చునని యూహించితిమిగాని యందుఁ జరిత్రమున కందని యభూతకల్పనములు, సమకాలికులు నమ్మజాలని యమానుషచర్యలు స్తోత్రపాఠము లుంటచే స్వయంకృషిచే నీగ్రంథము పూర్తిచేయవలసి వచ్చినది. మంత్రిత్వమున మిగుల మెలఁకువఁజూపి యాంధ్రదేశభాగములో దైవముగ భావింపఁబడు బ్రాహ్మనాయని మేము మంత్రులలోఁ జేర్చితిమి. అతని శూరులలోఁ జేర్చుటకంటె మంత్రులలోఁ జేర్చుటయే ముఖ్యము. శూరత్వము, రాజ్యాంగనైపుణ్య మితనియెడ సహజగుణములు. ఈచరిత్రగ్రంథరచనమున మాకాధారములై తోడ్పడిన గ్రంథనామములు తెలుపుటయు నామగ్రంథకర్తలకు మాకృతజ్ఞతఁ దెలుపుటయు ముఖ్యకర్తవ్యము.

ఆంధ్రచరిత్రము 11 భాగము.

వీరభాగవతము
పల్నాటి వీరచరిత్రము
వెలుగోటి వంశచరిత్రము
భాస్కరోదంతము
హిందూమహాయుగము
మహమ్మదీయ మహాయుగము
ఆంధ్రకవుల జీవితము: కం॥ వీ॥
ఆంధ్రభాషాభూషణము
సిద్ధేశ్వర చరిత్రము
శశికుమార చరిత్రము
ముప్పదియిద్దరు మంత్రుల చరిత్రము

కొండవీటి కైఫీతు
కొండవీటి సామ్రాజ్యము
కరణీకోద్ధారిణి
చాటుపద్యమణిమంజరి
కర్ణాటరాజ్య కథాసారము (జ॥ రా॥)
తిమ్మరుసుమంత్రి చి॥ వీ॥
తిమ్మరుసుజీవితము గు॥ రా॥
కృష్ణరాయల నిధనకాలము కే॥ కి॥ ల॥
గుంటుపల్లి భాస్కరచరిత్రము
ముత్తనామాత్యచరిత్రము

ఈ గ్రంథములనేగాక యితరగ్రంథములనుగూడఁ బరిశీలించి నారము. ఈయత్నమునందలి గుణదోషములు విచారించి సహృదయలోకము మన్నించినచో ఇటులె ఆంధ్రరాజన్యుల జీవితము, ఆంధ్రవీరుల జీవితము వ్రాయవలయునని యుత్సాహము కలదు.

చరిత్రాధారము లభింపని మారుమూలలనుంటచే నింకఁగొన్ని యాధారములఁ జర్చింప వీలులేకపోయినది. ప్రకటింపఁ గారణాంతరములచే వీలుగాక దాఁచిన యీపొత్తమును ముద్రించి మాతృభాషాసేవ లోకమునకు వెల్లడించిన మ. రా. రా. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య పంతులువారికి మాకృతజ్ఞతఁ దెలుపుచున్నారము.

నందిగామ,
ది 1—8—23.

ఇట్లు సుజనవిధేయులు,
శేషాద్రిరమణ కవులు,
శతావధానులు.

| పే. | తప్పు | ఒప్పు |
|---|---|---|
| ౮౩ | టక్కు- | సిద్ధ |
| ౧౧౧ | క్రీ. శ. ౧౫౨౫ | ౧౫౩౦ |

# అభిప్రాయములు

ఆంధ్రకవితాభూషణులగు శ్రీ శేషాద్రిరమణకవులచే రచింపఁబడిన యాంధ్రమంత్రులను నూతన గ్రంథము ప్రథమభాగము సాకల్యముగఁ జదివితిని. మన మాతృభాష విమర్శనపరిశోధనములందు వెనుకఁబడియుండుటచే నిట్టి లోపమును దీర్పనెంచి తమ సావకాశము నంతయును బ్రాచీనశాసనాదిపరిశోధనమునందు వెచ్చింపఁబూనుకొని శ్రద్ధతోఁ బనిచేయుచున్న యీగ్రంథకర్తలు కడు సంస్తవనీయులు.

ఈగ్రంథమునందు శాశ్వతకీర్తులగు పదిమంది యాంధ్రామాత్యశ్రేష్ఠుల జీవితములు పొందుపఱుపఁబడి యున్నవి. గ్రంథకర్తల పరిశోధన విస్తృతినిబట్టిచూడ నీగ్రంథమును వారాంధ్రసారస్వతమునఁ బరిశోధన భాగమునకు సమర్పింపనెంచిన ప్రథమకుసుమముగా భావింపవచ్చును. ఆంధ్రసోదరుల ప్రోత్సాహమునుబట్టి యితర భాగములు శీఘ్రమున వెలువడఁగలవు.

గ్రంథశైలి కడు సరళముగ నున్నది. భాష పరిశుద్ధముగ నున్నది. గ్రంథమునందలి యూహలును నభిప్రాయములును స్వతంత్రపరిశీలన గాంభీర్యముచే నొప్పారుచుఁ బ్రాచీనశాసనాదిపరిశోధనమునం దెక్కుడు గౌరవమును బ్రోత్సాహమును గలుగఁజేయుచున్నవి.

ఈపుస్తకము ఉన్నతపాఠశాలలయందుఁగాని కళాశాలలయందుఁగాని పఠనీయముగ నిర్ణయింపఁబడుట కెల్లవిధములఁ దగియున్నదని నాయభిప్రాయము. బహుకాలపరిశ్రమచేఁగాని యొనగూరని యీ గ్రంథమునకు మదరాసు టెక్స్టుబుక్కు కమిటీవారుకూడఁ దగు ప్రోత్సాహము నొసంగెదరని నమ్ముచున్నాము.

ఇట్లు బుధజనవిధేయుఁడు,

చెఱుకుపల్లి వేంకటప్పయ్య, బి. యే. యల్. టి.,

ప్రధానోపాధ్యాయుఁడు, బోర్డు హైస్కూలు.

నందిగామ,
25-8-23.

శతావధానులు సుప్రసిద్ధపరిశోధకులునగు శ్రీ శేషాద్రి రమణకవులచే రచింపఁబడిన "ఆంధ్రమంత్రులు" అను గ్రంథము నామూలాగ్రము పఠించి యనేక నూతనాంశములను నేర్చుకొంటిని. ఆంధ్రజాతియొక్క ప్రత్యేకతను నిరూపించి తొల్లిటివైభవమును గీర్తనము జేసి యిక్కాలమున నెందఱో ధన్యులగుచున్నారు. అట్టివారిలో నీకవులు ప్రథమగణ్యులు.

వీరిదివఱకు పాపారాయ నిర్యాణమను వీరరసప్రధాన నాటకరాజమును వ్రాసి యాంధ్రుల శౌర్యసాహసముల వెల్లడిచేసిరి. వసుంధర యను చరిత్రాత్మకమగు నవలను వ్రాసి, ఓరుగంటి కాకతీయసామ్రాజ్యచరిత్రము మనోహరముగ వర్ణించిరి. ఇప్పుడాంధ్రమంత్రుల ప్రతిభావిశేషమును స్వామికార్యనిర్వహణప్రవీణతను శౌర్యగాంభీర్యాద్యుత్తమగుణములను గీర్తించి కృతకృత్యులైరి. వీరికి యథార్థమునం దాసక్తిమెండు. వీరు పుక్కిటిపురాణములను వాడుకలోనుండు గాథలను బ్రమాణములుగా స్వీకరింపక సూచించి విడుతురు. శాసనములను సమకాలికుల యభిప్రాయములను బరిశీలించి నిజమును దెలిసికొనఁ బ్రయత్నింతురు. ఈగ్రంథములు చదివినవారికెల్ల వీరి సత్యప్రియత్వము, పరిశీలనాపటిమ సువ్యక్తము కాఁగలవు. ఇట్టి యుత్తమగ్రంథము ప్రత్యాంధ్రుఁడు చదివి గర్వపడఁ దగినది.

వచనశైలి ధారాళము, మృదుమధురము. దీర్ఘసమాసబంధురముగు ప్రబంధశైలిగాక, రసోచితముగు ప్రబంధశైలిగాక, రసోచితము చరిత్రమున కనుకూలమగు దేటయు నీటుదనమును గలది. దీనిని పాఠశాలలోని ఉన్నత తరగతుల విద్యార్థులకును ముఖ్యముగా కళాశాలా విద్యార్థులకును బఠనీయముగ నేర్పఱచి తమధర్మమును సక్రమముగా నిర్వహింతురని నమ్ముచున్నాను. విద్యార్థుల హృదయక్షేత్రములలో స్వదేశ స్వజాత్యభిమానబీజముల నాటునవి యిట్టి యుత్తమగ్రంథములే. ఇట్టి గ్రంథములను బెక్కింటిని వ్రాసి ఆంధ్రభాషకును ఆంధ్రజాతికిని విశేషమగు కీర్తిని గడించుటకుఁ బరమేశ్వరుఁడు వీరికి ఆయురారోగ్యముల నొసంగుఁ గాత!

సుజనవిధేయుఁడు.

నందిగామ, } చింతలపాటి వేంకటశ్రీరాములు, బి. ఎ. యల్. టి.,
౨౪ ౬-౨౩. } [illegible]

ప్రసిద్ధకవులు శతావధానులునగు శ్రీ శేషాద్రిరమణకవులచే రచింపఁబడిన "ఆంధ్రమంత్రుల చరిత్రము-ప్రథమభాగమును" బఠించితిని. ఇందు శూరాగ్రేసరులు, నీతిశాస్త్రకోవిదులు, కవితాధురీణులును త్యాగశీలురు నగు పదిమంది యాంధ్రమంత్రుల జీవితములు నాకల్పముగ వివరింపఁబడినవి. ఇట్టి మహామహుల జీవితములు ప్రజల కాదర్శప్రాయములై యాంధ్రవ్యక్తిత్వౌన్నత్యమును జాటుచు నాంధ్రదేశచరిత్రమున కెంతయు మెఱుఁగుఁబెట్టుచున్నవి. దేశీయులగు మహాపురుషుల జీవితములే దేశచరిత్రములగునని కార్లైల్ (Carlyle) అను నాంగ్ల గ్రంథకర్త చెప్పియున్నాఁడు. ఇట్టి మహాపురుషులచరిత్రము చదువరులను భావపూరితులనుజేసి వారిహృదయసీమలలో జాతీయాభిమానముల నాఁటుననుటలో సందియము లేదు.

గ్రంథకర్త లుత్కృష్టములగు శిలాశాసనాదులఁ బరిశీలించి చరిత్రాంశములను సేకరించి యీ గ్రంథమును రచించి యింతియనరాని దేశసేవగావించినందులకుఁ బ్రశంసాపాత్రులు. ఆంధ్రవాఙ్మయమునకు నాంధ్రమాతకు వీరలొసఁగిన కుసుమరాజములలో నీ గ్రంథము ప్రశస్తపుష్పము. ఇది ప్రత్యాంధ్రుఁడు పఠింపఁదగిన యుత్తమగ్రంథము.

గ్రంథము దోషరహితమైనభాషలో సులభమైనశైలిలో వ్రాయఁబడి చదువుట కుత్సాహకరముగ నున్నది. ఈగ్రంథము ఉన్నతపాఠశాలలయందుఁ గళాశాలలయందుఁ జదువు విద్యార్థులకుఁ బఠనీయగ్రంథముగా నుండిన నుపయోగకారిగా నుండఁగలదు.

పఠనార్హమగు నీగ్రంథరాజమును పఠనగ్రంథముగ నిర్ణయించి ఉన్నతవిద్యనభ్యసించు విద్యార్థుల మాతృదేశాభిమానములను గాపింప చెన్నపురి Text-book Committee వారు తోడ్పడెదరని హృదయపూర్వముగ నమ్ముచున్నాను.

ఆంధ్రవాఙ్మయమునకు సేవఁజేయుచున్న యీకవులకు భగవంతుఁ డాయురారోగ్యాదికములు ప్రసాదించుఁగాత!

నందిగామ, 30—8—23. } భాగవతుల రాఘవేంద్రశాస్త్రి, బియే., యల్. టి.,
బో॥ హైస్కూలు.

# విషయసూచిక



# ఆంధ్రమంత్రులు.

## మండంగి బసవేశ్వరమంత్రి

"పెద్దలకెందు పెన్నుద్దులమొదలు । బుద్ధులప్రోక విబుధనిధానంబు
అమితవచోరాశి సుమనోనురాగుఁ । దమలినచిత్తుఁ డుద్యద్గుణాన్వితుఁడు
సకలవీణాప్రవీణకళావిదుండు । అకలంక నాదవిద్యాపండితుండు
బసవండు జంగమప్రకరంబుఁదాను । నసలార యోలగంబై యుండెనంత."

బసవేశ్వరుఁడు శ్రీశైలముచెంతఁగల హింగుళేశ్వరమునందుఁ గల మండంగి మాదిరాజు మదాలాంబికలకు జనియించెను. ఈతని జననమునుగుఱించి యొకవిచిత్రమగుకథ బసవపురాణములో వ్రాయఁబడియున్నది. మదాలాంబికయు మాదిరాజును సంతానహీనులై యనేకవ్రతములుసల్పి క్షేత్రములసందర్శించి విఫలమనోరథులై కామ్యదాయకుఁడగు నందీశ్వరునకు ముడుపుఁగట్టిరి. కొలఁదికాలమునకు మదాలాంబికకు దౌహృదలక్షణములు తలసూపెను. నవమాసములు మోసినను మదాలాంబిక గర్భమునఁ దనయుఁ డుద్భవింపఁడాయెను. నానాఁటికి గర్భము భారముకాఁదొడంగెను. ఇట్లు నానావస్థలకులోనై మదాలాంబిక మూఁడుసంవత్సరము లధికశ్రమతో బ్రాణముభరించెనుగాని యాయమశ్రమకు విముక్తియు సంతానప్రాప్తియుఁ జేకూరదయ్యె. గర్భభారము సహింపఁజాలక మదాలాంబిక యాపురమునఁ గల శివాలయమునకేగి నందికేశ్వరునిపూజించి సాష్టాంగదండప్రణామములాచరించి తనయవస్థ నంతమునొందించి సద్గుణశోభితుఁడు చిరాయుష్మంతుఁడునగు తనయుని దయచేయుమని పలువిధములఁ బ్రార్థించి నిజమందిరమున కరిగెను. ఆనాఁటిరాత్రి మదాలాంబిక కొక స్వప్నమువచ్చెను. అందు నందికేశ్వరుఁడు ప్రత్యక్షమై నేనే నీగర్భముననుంటిననియుఁ గొలఁదిదినములలోఁ దేజోధనుఁడగు కుమారుఁడు

నా యంశముచే జనించుననియు నాతనికి "బసవేశ్వరుఁడు" అని నామకరణముగావింపుమనియు శైవాచారప్రచారమును గావించుటకై నీతనయుఁడు మిగులఁ బాటుపడుననియు వాకొని యదృశ్యుఁడయ్యెను. శుభముహూర్తమున మదాలాంబికగర్భమున బాలకుఁడుజనించెను. స్వప్నానుసారముగ నాబాలకునకు బసవేశ్వరుఁడని నామకరణము గావించి జననీజనకులు మిగుల గారాబముతోఁ బెంచసాగిరి. ఈశ్వరవర ప్రసాదముచేజనించిన యాశిశువు దినదినవర్ధమానుఁడై పంచాబ్దమున విద్యాభ్యాసముగావింపఁ గొలఁదికాలములో సర్వశాస్త్రపారంగతుఁ డయ్యెను. ఒక శుభముహూర్తమున బసవేశ్వరునకు బ్రాహ్మణ ధర్మానుసారముగ విధిచోదితముగ నుపనయనముఁ జేయింపనెంచి రాజ బంధువులనందఱఁ బ్రత్యేకించి యాహ్వానించి మాదిరాజు వలయు వస్తుసామగ్రిల సేకరింపసాగెను. శుభముహూర్తము సమీపించెను. బంధుసముదాయమంతయు నేతెంచెను. వేదవేదాంగవేత్తలు సర్వ జ్ఞులునగు బ్రాహ్మణోత్తములనేకులు విచ్చేసిరి. బసవేశ్వరుని జననీజన కులు శుభవేదికాసీనులై తనయునాహ్వానించిరి. ఇంతవఱకుఁ జూచి చూడకుండునటుల నటించుచున్న బసవేశ్వరుఁ డాపేరోలగంబుననిల్చి తనకుఁ బూర్వాచారములతోఁ బనిలేదనియు శివపూజాధురంధరుండ ననియు వర్ణాశ్రమధర్మములతో నించుకేనియుఁ బనిలేదనియు నిశ్శంక ముగా వాకొని యుపనయనమున కియ్యకొనక ప్రతిఘటించి వాదింప సాగెను. ప్రాయమున బాలుఁడయ్యు సర్వజ్ఞులునైతము నిర్వచింపరాని ధర్మరహస్యములుగ్గడించు నాబాలకుని యుక్తియుక్తవాదోధాటికం దఱు నానందింపసాగిరి. బసవపురాణమున బసవేశ్వరుని యుపన్యాస మీవిధముగ వర్ణింపఁబడియున్నది.

నంతునుపనయనంబు శుభలగ్నమునను । సేయుదునని పెద్దచిడిముడిపడఁగ
నాయొడబసవఁడిట్లనియెఁ దండ్రికిని । వడుగనిఁ యిదియేమి గడియించెదీవు
జడుఁడవెట్లయితి యీశ్వరునిఁ గొల్చియును । బరమాత్ము గురునిగాఁ బడసిదుర్నరుల
గురులనికొలిచిన నరకంబుగాదె । గతపూర్వజన్మసంస్కారుఁడైతలప
వితతద్విజత్వంబు పతితంబుగాదె । నిర్మలగురుకృపాన్వితజన్మునకు

గర్మజన్మంబు దుష్కర్మంబుగాదె । యగ్గురుపాదంబు లర్చించునతని
కగ్గిలోఁ హవి వేల్చుటది తప్పుగాదె । మలహరాత్మకమగు మంత్రంబుఁదలఁచి
పలుమంత్రములు గొనఁ బాపంబుగాదె । శూలిభక్తుల కెత్తుకేలదిత్రాట
మాలలకెత్తుట మాలిమిగాదె । "రుద్రాక్షభసితాది ముద్రలఁదాల్చి
క్షుద్రముద్రలుదాల్పఁ గూడునే చెప్పుమ । నీరికిఁ ద్రాటికి దూరమైయున్న
వీరమాహేశ్వరాచార దీక్షితుని । నిర్మతోభయకర్మనిర్మూలు నన్నుఁ
గర్మబద్ధుఁ జేయంగ ధర్మమే నీకు । గ్రచ్చగఁ గన్నులఁ గానవుగాక
వచ్చునే బసవని వడుగుఁ జేయంగ । బ్రహ్మశిరోహర ప్రపన్నైకవంశ్య
బ్రహ్మవంశ్యుండని భావించెదెట్లు । జాతిగోత్రాతీత సద్గురుజాతు
జాతిగోత్రక్రియాశ్రయుఁ జేసెదెట్లు । అకులస్థుడైయున్న యభవునిభక్తు
నికినొకకులమని నిర్ణయించెదవు । కావున నెన్నిమార్గంబుల వడుగుఁ
గావింపఁగానేల కథలిన్ని చెప్ప"

ఇట్లు బసవేశ్వరుఁడు చాలసేపు జనకునితో శైవధర్మావలంబులకు వేదచోదితాచారము లనవసరములని బోధింప జనకుఁడగు మాదిరాజు సమాధానములొసంగి యుపనయనము దూష్యముకాదని బోధించెను. మాదిరాజొసంగిన సమాధానము బసవేశ్వరుఁడు పూర్వపక్షముగావించి యుపనయనమావశ్యకమను పూర్వాచార పరాయణులగు నాగతుల నంటఁబడు హితబోధగావించి జ్ఞానికి విధిచోదితములతోఁ బనిలేదని యనేక శాస్త్రదృష్టాంతములతో సిద్ధాంతీకరించెను. బసవేశ్వరుని పాండిత్యమునకు యుక్తియుక్తవచోధోరణికి నానందించి మాఱుచెప్పఁజాలక యాతని సాక్షాన్నందికేశ్వరాంశగ భావించి యందఱు వచ్చినత్రోవను వెడలిపోయిరి. శక్తిసామర్థ్యములచేతను దైవదత్తవిద్యాప్రభావమువలనను బసవేశ్వరుఁడు దేశము నొక్కమార్గములో నడుపఁగల సమర్థుఁడని భావించి బిజ్జలునివద్ద మంత్రియు నాతని మేనమామయునగు బలదేవయ్య తనపుత్రికయు నమితసౌందర్యశాలినియు నగు గంగాదేవినొసంగి పరిణయముఁగావించెను. బసవేశ్వరుఁడు గృహస్థాశ్రమములోఁ బ్రవేశించినదిమొదలు శాస్త్రాభ్యసనము నభివృద్ధిపఱచుకొని వీరశైవమతమును సభాస్థానములలో బోధించి యద్వైతమత ప్రవర్తకులతో వివదింపసాగెను.

బసవేశ్వరునికాలమున మతములలో నపూర్వమగు కల్లోలము జనించెను. శైవమతమునే నిలువబెట్టి యన్యదీయమతములన్నింటిని రూపుమాపవలయునని బసవేశ్వరుఁడు దీక్షవహించి విద్వాంసులగు బ్రాహ్మణులతో ననేకమారులు మతవిషయిక వివాదములుగావింప సాగెను. సంఘబలము రాజాశ్రయముగల యద్వైతాదిమతములను బ్రతిఘటించుటచే లభించినది శ్రమమేగాని ఫలముకాకపోవుటచే బసవేశ్వరునకుఁ జాలనిరుత్సాహముకలిగెను. అట్లు నిరుత్సాహకరములగు విఘ్నము లెదురొడ్డుచున్నను బ్రాహ్మణబృందము వివాదములలోఁ బ్రతిఘటించుచున్నను రాజులు ప్రోత్సాహమునొసంగకున్నను ప్రజాసామాన్యము తనపై విశ్వాసమును జూపకున్నను నాత్మవిశ్వాసము మాత్రమువిడనాడక శైవమతవ్యాప్తికొఱకు బసవేశ్వరుఁడు సర్వతోముఖముగఁ బ్రయత్నముచేయసాగెను. కొంతకాలమునకు బసవేశ్వరుని బోధనములు దేశీయులహృదయముల నాటసాగెను. పండితవర్యులగు బ్రాహ్మణులనేకులు బసవేశ్వరునివలనఁ బవిత్రమగు నద్వైతమతము నశింపవలసివచ్చునేమోయని భుజబలముతోఁ బ్రతిఘటింపసాహసించిరి. రానురాను విరోధబృందమధికమై బసవేశ్వరుని సర్వవిధముల వేధించుచునుంటచే నాతఁడు తనయుద్యమమునుమాత్రము వదలక జన్మదేశమును త్యజించెను. పరసీములకేగుటకు సంకోచింపక మొదట సంగమేశ్వరాలయమునకేగి కొలఁదిదినములచట తపముఁగావించెను. ఈశ్వరుఁడాతనికిఁ బ్రత్యక్షమై "కుమారా! నిరుత్సాహమునొందకుము. భరతఖండములో నీవు నొకమతాచార్యుఁడవుకాగలవు. ముందుఁగానవచ్చు విఘ్నపరంపరలఁగాంచి భయపడకుము. సత్యమును వచింపవలయుననియు లింగమును ధరింపవలయుననియు శైవాచారధురీణులయెడ వర్ణాశ్రమభేదమును బాటింపవలయుననియు శివుఁడుదక్క దైవములేఁడనియు నీయనుచరులకుఁ బోధింపు"మని యదృశ్యమయ్యెను. స్వప్నానంతరమున బసవేశ్వరునకొకవిధమగు నాత్మవిశ్వాసముజనించెను. వీరశైవమతప్రచారమునకే తానుజనించితినను దృఢసంకల్పము కలవాఁడై బసవేశ్వరుఁడు దేశదేశములకేగి సమస్తజనులను సమావేశపఱచి

వీర శైవమతధర్మముల బోధింపసాగెను. కాలక్రమమున బసవేశ్వరుని నూతనమతములో ననేకులు ప్రవేశింపసాగిరి. ఆంధ్రదేశమున బసవేశ్వరునిమతమున కొకవిధమగు నిలుకడచిక్కెను. ఆతనిబోధ విని యామతములోఁ బ్రవేశించిన బ్రాహ్మణులుకొందఱు బసవేశ్వరుని యాదేశము ననుసరించి మతప్రచారముఁ గావించుటకై దేశమునంతటను యథేచ్ఛముగఁ దిరుగసాగిరి. విశేషించి యీమతము బ్రాహ్మణేతరులలో వ్యాప్తినొందెను.

తనబోధనము వినని బ్రాహ్మణులు క్రమక్రమముగ సాదరముగ వినుటయు నంతతోఁబోక యానూతనమతమున బ్రవేశించుటయు బసవేశ్వరుని యుత్సాహము నినుమడింపఁజేసెను. స్వప్నమున పార్వతీశ్వరుఁడు ప్రత్యక్షమై సందేశము చెప్పినదాది యాతనిజీవితము గొప్పమార్పునొందెను. బసవేశ్వరుఁ డదిమొదలు లోకులకొక యపూర్వబోధకుఁడుగను దైవస్వరూపుఁడుగను గానరాఁదొడంగెను. గౌరీశ్వరుఁడు బసవేశ్వరున కొసంగిన సందేశము గమనింపఁదగినదగుటచే నిట నుదాహరించెదము.

" గతకాలవర్తనకంటె సద్భక్తి । మితిఁదప్పినడువకుమీ బసవన్న
సడిసన్నభసితాది శాసనధరుల । మృదులంగా మదినమ్ముమీ బసవన్న
శూలిభక్తులను దుశ్శీలములఁగన్న । మేలుగాఁగైకొనుమీ బసవన్న
శత్రులైనను లింగసహితులైయున్న । మిత్రులకాఁజూడుమీ బసవన్న
పట్టినవ్రతములు ప్రాణంబుమీద । మెట్టినవిడువకుమీ బసవన్న
వేఱుభక్తులజాతి వెదకకుండుటయె । మీఱినపథముసుమీ బసవన్న
చిత్తజాంతకుభక్తి చెడనాడుఖలుల । మిత్తినీనైత్రుంపుమీ బసవన్న
వేదశాస్త్రార్థ సంపాదితబుద్ధి । మేదినివెలయింపుమీ బసవన్న
తిట్టినభక్తులు గొట్టినకాల । మెట్టినశరణనుమీ బసవన్న
యేదప్పఁబట్టుదు నిలఁ బరస్త్రీల । మీఁదఁగన్నార్పకుమీ బసవన్న
సాధ్యమౌభక్త ప్రసాదేతరంబు । మేధ్యంబుగాఁ జూడుమీ బసవన్న
నిక్కంబుసద్భక్తి నిర్వంచకతయె । మిక్కిలిగుణముసుమీ బసవన్న "

బసవేశ్వరునకు స్వప్నానంతరము తాను సిద్ధసంకల్పుఁడనను నమ్మకముగుదిరెను. వాదప్రతివాదములలో నాఱితేఱుటచే నిరా

ఘాటమగు యుక్తివాదము జ్ఞానముసైతము సాధ్యమయ్యెను. బసవేశ్వరుఁడు నిత్యము కూడలియను స్థలమునందున్న శివాలయమునకేగి లింగమును బూజించుచు నాలయమున నున్నవారలందఱకుఁ దన సిద్ధాంతములు నివేదించుచుఁ ద్రికాలములయందు దచట ధ్యానముఁ జేయుచు శివోక్తమార్గముననే గమింపసాగెను. సర్వజనులకుఁ గాలక్రమమున బసవేశ్వరునియందు భక్తివిశ్వాసములు జనించెను. ఆతనిమతమునందందఱకుఁ బ్రీతిజనింపసాగెను. ఇటులుండ బసవేశ్వరుని మామయగు బలదేవుఁడు మరణించెను. అందుచేఁ గళ్యాణపురముఁ బరిపాలించు బిజ్జలుని సంస్థానమునకు నూతనమంత్రి యావశ్యకమయ్యెను. మంత్రిపదవికి నూతను నెవనిని యోజించుట యుక్తమో ప్రజాభిప్రాయము నెఱుంగఁగోరి యొకపౌరసభ గావించి రాజన్యుఁడు తనయుద్దేశ్యమును బ్రజల కెఱుంగఁజేసెను. బసవేశ్వరునిసామర్థ్యము సమస్తము నెఱింగియున్నవారలగుటచేఁ బౌరులందఱేకముఖముగ మంత్రిపదవికి బసవేశ్వరుఁడె సర్వవిధముల సమర్థుఁడని విన్నవించిరి. బసవేశ్వరుని శక్తిసామర్థ్యాదు లెఱింగినవాఁడగుటచే బిజ్జలరాయలందులకంగీకరించి "మంత్రిపదవినొసంగెదము స్వీకరింతురేని దయచేయు"డనుసందేశము బసవేశ్వరునకు నాప్తులగు రాజకీయోద్యోగులచే సత్వరము పంపించెను. రాజుచే నియోజితులగు నుద్యోగులందఱు దేశములుతిరిగితిరిగి కప్పడియను గ్రామమున వీరశైవమతమును ప్రబోధించుచున్న బసవేశ్వరునిసందర్శించి సాష్టాంగనమస్కారము లాచరించి రాజన్యునిసందేశము నామూలాగ్రము నివేదించిరి. తృష్ణాజనకములగు రాజ్యకాంక్షలపై నాసక్తి విసర్జించినవాఁడగుటచే బసవేశ్వరుఁడా రాజన్యుని సందేశమును దిరస్కరించి నాకిట్టియధికారములతోఁ బనిలేదని కంఠోక్తిగఁ దెలిపెను. పౌరులందఱు బసవేశ్వరునితో "మంత్రిత్వమున కామోదించినచో శైవమతమును రాజ్యమున మిగులసాహసముతో వ్యాప్తిలోనికిఁ దేవచ్చును. రాజావలంబనములేని దేమతము నభివృద్ధిలోనికి రాఁజాలదు. మనకు నేఁటివఱకు రాజప్రాపకము లేనికొఱత దీనిచే సమసింపఁగల"దని విన్నవించిరి. బిజ్జలునిచే నంపఁబడినవారునుశైవము

బసవేశ్వరుని కిటులనే యుద్బోధించిరి. బసవేశ్వరుడు చాలసేపు కర్తవ్యమునుగూర్చి యోజించి వీరశైవమతప్రచారమునకు బిజ్జలునిచెంత మంత్రిత్వముసర్వవిధముల సహాయకారికాఁగలదని భావించి యందులకియ్యకొని తనసోదరియగు నాగాంబికతోఁగూడఁ గళ్యాణపురమునకు బ్రయాణమయ్యెను. బసవేశ్వరుడు వచ్చుచున్నయంశమును ముందుగా గ్రహించి బిజ్జలరాయఁ డూరుబయటి కెదురుగానే తెంచి యేనుంగును దిగి స్వాగతమునొసఁగి యాస్థానమునకుఁగొనిపోయి సర్వసైన్యాధ్యక్షుఁడుగను కోశాగారాధ్యక్షుఁడుగను మహామంత్రిగను సర్వస్వతంత్రుఁడుగను నియోగించి రాజ్యభారమునంతయు నొసంగి సగౌరవముగ వర్తింపసాగెను. బసవేశ్వరుడు రాజతంత్రములబోధించు ధర్మశాస్త్రములు శ్రద్ధశాస్త్రాదికములు పఠియించియున్నవాఁడగుటచేతను బుద్ధిశాలియగుటచేతను గళ్యాణపురరాజ్యభారమును దలపైదాల్చి మిగుల మెలకువతోఁ బ్రవర్తింపసాగెను. రాను రాను ప్రజలకుఁబ్రభువుపైకంటె బసవేశ్వరునిపై భక్తివిశ్వాసములు జనింపసాగెను. బసవేశ్వరునిసోదరిని మఱికొందఱు పద్మావతియనిచెప్పియున్నారు. బిజ్జలుఁ డాయమ సౌందర్యాదికములఁగాంచి మోహించి తనయంతరంగమును బసవేశ్వరునకు తెలిపెను. వర్ణాశ్రమధర్మములయందు విశ్వాసములేనివాఁడగుటచే దక్షిణము బసవేశ్వరుఁడు తనసహోదరిని బిజ్జలునకొసంగి యొకశుభముహూర్తమున వివాహముఁగావించెను. బసవేశ్వరుఁనకు బిజ్జలరాయునకు స్నేహమేగాక బాంధవ్యముసైతము కలుగుటచే నుభయులైకమత్యముతో మిగుల స్నేహముగఁ గాలక్షేపము సేయసాగిరి. రాజన్యుఁడు మంత్రియు నీరక్షీరములభాతి కలిసియుంటచే విరోధిరాజులు కళ్యాణనగరమును దేఱిచూడఁజాలరైరి. బసవేశ్వరుని యనన్యసాధ్యమగు రాజనీతికౌశలముచేఁ గళ్యాణనగరరాజ్యము దినదినాభివృద్ధిఁ గాంచసాగెను. శత్రువుల కభేద్యముకాఁదొడంగెను. బసవేశ్వరుఁడు మంత్రిపదవియందేయుండి కర్తవ్యము నిర్వహింపసాగెను. రాజ్యములోఁ దనకుఁబలుకుఁబడి యధికముగానుంటచే సర్వత్ర సంచారముఁగావించి పౌరులసమావేశపఱచి వీరశైవమతధర్మముల

న్నింటిని సావకాశముగ సంభాషణములతో బోధించి యనేకుల మత మునఁజేర్చికొని వారలకుఁ గొన్ని మతలాంఛనములొసంగి యాదరింపఁ సాగెను. విద్వాంసులచేఁ గొన్ని గ్రంథములు వ్రాయించియుఁ బట్టణములలో మతపీఠములస్థాపించియు దేశదేశములకు బోధకులుగ శిష్యులనుబంపియు వీరశైవమతవ్యాప్తికి బసవేశ్వరుఁ డెన్నివిధములనో పాటుపడెను. సర్వసమత్వము బోధించు మతమగుట నిమ్నజాతులు విశేషముగ నీమతములోఁజేరసాగిరి. శాస్త్రజ్ఞులగువా రనేకులు బ్రాహ్మణులీ మతములోబ్రవేశించుటచే గ్రమముగ నీమతమునకు బలము చేకూరెను. దేశమునందు పెచ్చుపెరిగి శంకరాచార్యునిచేనైతము మిగుల్పఁబడిన జైనమతము చాలవఱకీతనికాలమున నిర్మూలము గావింపఁబడెను. అద్వైతమతమున కాయువుపట్టుతొలంగెను. బసవేశ్వరునకు సమకాలికులుగఁ బ్రఖ్యాతి మతసంస్కర్తలాకాలమున లేకపోవుటచే నేకధాటిగ బసవేశ్వరునిసంకల్పము ఫలవంతమయ్యెను. బసవేశ్వరుఁడు రాజ్యాంగములలోఁ దీఱికలేనప్పు డాయనకుమాఱుగ నాతని మేనల్లుఁడును విద్వాంసుఁడును భృంగిరిటి యవతారము నని భావింపఁబడు చెన్నబసవన్న మతప్రచారమునకు బయలువెడలి దేశమునంతయు వీరశైవమతమయముఁ గావింపవలయునను స్థిరదీక్షతోఁ బ్రచారము గావింపసాగెను.

బసవేశ్వరుఁడు తనధనమునేగాక రాజ ధనాగారములోని ధనమునుగూడ జంగమదేవరల కొసంగును వర్తింపసాగెను. క్రమముగ ధనాగారములోని ద్రవ్యము తఱుగసాగెను. రాజునకీయంశము చాల కాలమువఱకుఁ దెలియదయ్యెను. సంస్థానసంబంధులెవ్వరు సాహసించి తెలుపఁజాలరైరి. కొంతకాలమునకు రాజాసంగతి గ్రహించి బసవేశ్వరునియెడ భిన్నాభిప్రాయముతో వర్తింపసాగెను. మంచన్నయను నొక రాజకీయోద్యోగి యీయదనుగ్రహించి మిత్రునివలె బసవేశ్వరునివద్ద సంచరించుచు నాతఁడుగావించు వ్యయములన్నింటిని గుర్తించి యాంతర్యముగ బిజ్జలభూపాలున కెఱుంగఁజేసి యుభయుల కంతఃకలహ

ములఁ బెంచసాగెను. బసవేశ్వరుఁ డీయంశముగ్రహించియు లక్ష్యము చేయక వీరశైవమతవ్యాప్తికై యింక సాహసముగ ధనవ్యయముగా వించి ప్రజాసముదాయమునంతనుఁ దననూతనమతమునందుఁ జేర్చి కొనసాగెను. బిజ్జలుఁ డిదిగ్రహించి "దేశమంతయు బసవేశ్వరుని భగవంతునిగా భావించుచున్నది. ఆతనికి రాజ్యమున రానురాను పలుకుబడి యతిశయించుచున్నది. ఇంక మిన్నకుంటిమేని కొలఁదికాలములో సంస్థానమునకే యపాయము రాగల"దని గుర్తించి బసవేశ్వరు నెటులేని బంధింపవలయునని బిజ్జలుఁడు మాయోపాయములు గావింపసాగెను. కొంతకాలమునకు బసవేశ్వరుఁడు బిజ్జలరాయని కృత్రిమోపాయము గ్రహించి యారాజ్యమునఁ దానుగావింపవలసిన పనియంతయు బూర్తియగుటవలనను ప్రభువునకు భిన్నాభిప్రాయముంటవలనను గళ్యాణ నగరము విడచిపోవనిశ్చయించి యనుచరులతో నెటకోపోయెను. బిజ్జలరాయ లీమంత్రియేగుటవిని యాతనివిషయమై చూచి చూడనటులుంటిమేని ప్రజాసామాన్యమును బ్రతిఘటింపఁజేసి రాజ్యమునకే యపాయమును గల్గించితీరునని నమ్మి యాతని నన్వేషించుటకై కొలఁది సైన్యమునుబంపి యునికినెఱింగి వీలైన బసవేశ్వరుని బంధింపవలయుననియు లేకున్న వధింపవలయుననియు నిశ్చయించి యమితమగుబలముతో జైత్రయాత్రకు బయలువెడలెను. ఈవిజయయాత్రాకథ రాజ్యములో నందఱువినిరి.

పౌరులందఱు శైవులగుటచే బసవేశ్వరునిపైకి బిజ్జలుఁడు దండయాత్రకేగుచున్నటుల విని వీరావేశపూరితులై యుక్తాయుక్తము మఱచి బసవేశ్వరునిపక్షమునకుఁ జేరిరి. బిజ్జలరాయని సైనికులలో ననేకులుచీలి బసవేశ్వరునిపక్షములోఁ జేరిరి. అప్రయత్నముగ బసవేశ్వరుని బలము సముద్రమువలె నంతము నాది గుర్తింపవీలులేనటులుండెను. నిమిత్తమాత్రముగ బసవేశ్వరుఁ డాసైన్యమధ్యమునవిల్చి బిజ్జలరాయని కభిముఖుఁడై "వెనుకడుగువేయనేల సంగ్రామమున కుపక్రమింపు"మని హెచ్చరించెను. బిజ్జలరాయలు సైన్యమును సంగ్రామమునకుఁ బురికొల్పెను. బసవేశ్వరుఁడు తనశైవబలమును ముందునకునడపి

శివమతాచారములబోధించుచు నిది మతసంగ్రామము; ఇందు మరణించినయెడల శివునితో నైక్యముకానచ్చునని వాకొనసాగెను. బసవేశ్వరునిసైన్యమంతయు రౌద్రరసావతారమో యనునటు లట్టహాసము లొనరించుచు హరహర మహాదేవయనుచు బిజ్జలునిసైన్యముపైకి విజృంభించి దుమికెను. బిజ్జలునిసైన్యముగూడ కొండవలెకదలక మిగుల ఘోరముగ సంగ్రామముం గావింపసాగెను. మతావేశపూరితులగు బసవేశ్వరునిసైనికులు మరణమునకు వెఱువక మృత్యుముఖద్వారమున నరాతిసైన్యములం జేర్చుచు ఘోరముగం బోరాడసాగిరి. క్రమక్రమముగ బిజ్జలునిసైన్యము నాశనస్థితికి వచ్చెను. హతశేషమగు సైన్యము సంగ్రామరంగమున నిలిచి బసవేశ్వరునిసైన్యముతోం బోరాడజాలక పాఱిపోయెను. బిజ్జలుఁడు బసవేశ్వరునిచే బంధితుఁడయ్యెను. తరువాత బసవేశ్వరుఁడు బిజ్జలుఁడు సమాధానపడిరి. బిజ్జలుఁడు యథావిధిగ కల్యాణపురరాజుగ నుండునట్లును బసవేశ్వరుఁడు పూర్వమువలె మంత్రిగానుండునట్లును దమలోఁదాము నిశ్చయించి సంగ్రామసూచకములగు రక్తవసనములతో నష్టశేషములగు సైన్యములతో వెనుకకు మఱలిరి.

బసవేశ్వరుఁడు బిజ్జలుఁడు నీ సంగ్రామానంతరమునం జాలకాలము కలసిమెలసి యుండిరి. ఒండొరులు సామ్రాజ్యక్షేమమునకై సర్వవిధములం బాటుపడుచుం బూర్వమువలె వర్తింపసాగిరి. కాని యిరువురిహృదయములుమాత్రము మాలిన్యవిముఖములుమాత్రము కావయ్యెను. ఇట్లుకొంతకాలము కపటనాటకము ప్రదర్శితమయ్యెను.

బసవేశ్వరుండు కల్యాణపురిముజేరినదాది వేదాచారపరాయణులగు బ్రాహ్మణులపైకి దాడివెడలి శైవబ్రాహ్మణులకంటె వారన్నివిధముల హీనులనియు బ్రాహ్మణపూజకంటె మాహేశ్వరులంబూజించుటయే ముఖ్యమనియు సాటసాగెను. ఆబోధనము పరమతదూషణమునకు బట్టుకొమ్మగనున్నది.

"త్ర్యక్షపరాఙ్ముఖక్రతువావరించి । దక్షుఁడెఱుంగవే తలగోలుపడియె
పరశురాముడు తొల్లి బాపలకర్త । ధరయిచ్చి యెఱుఁగవే తానేమిగానో

ఇలయెల్ల నెఱుఁగ విప్రులనుపూజించి । బలిబంధనంబునఁ బడఁడె తెల్లముగ
నడరంగ గౌతముఁ డగ్రజన్ములకుఁ । గుడువఁబెట్టియ కాద గోహత్యఁబొందె
వేదజ్ఞులగు కోటివిప్రులకన్న । మాదటఁబెట్టిన యట్టిఫలంబు
త్ర్యక్షభక్తున కొకభిక్షంబుఁబెట్టు । నక్షయఫలమున కసమానమగును"

ఇట్లు బసవేశ్వరుఁ డాత్మమతవ్యాప్తికొఱకుఁ బరమతములనిందింపసాగెను. దానిచేఁ బ్రజలలో నాందోళన ముదయించెను.

బిజ్జలుఁడు జైనమతాభిమానియేగాక జైనుఁడుగూడ నైయుండెను. మతమునందభిమానముగల జైనాచార్యులు కొందఱు బిజ్జలుని యాశ్రయము నూతగాగొని వీరశైవములోఁ జేరినవారల మరల జైనమతములోనికిఁ గొనిరాసాగిరి. జైను లనేకులు విచ్చలవిడిగ రాజ్యమునందంతటను సంచరించి వీరశైవ మతాచారముల నిరసించి బసవేశ్వరునకుఁ బ్రతికూలముగఁ జరింపసాగిరి. ఇట్లు బిజ్జలుడుఁ జైనులఁ బ్రోత్సహించి జైనమతధర్మములఁ బునరుద్ధరించుటకు రెండు కారణములు కలవు. మొదటిది తనమతమును బరమతమునకు లోఁబడకుండఁ గాపాడుకొనుట; రెండవది వీరశైవమతము రూపుమాపి బసవేశ్వరు నసహాయుని గావించుట. ఈ రెండుధర్మములు లక్ష్యమునందుంచుకొని బిజ్జలుఁడు జైనుల మిగులఁ బ్రేరేపి దేశమునందున్న యన్నికడలకుఁ బంపి వ్యయభారములు తానే భరింపసాగెను.

క్రమముగ బిజ్జలరాయలు బసవేశ్వరుఁడు లోలోననిముడ్చుకొను ద్వేషాగ్ని యొక్కమాఱు ప్రజ్వలించెను. బసవేశ్వరుని మతప్రచారకులలో నిరువురు మిక్కిలి సమర్థులు. బసవేశ్వరుఁడా యిరువురను మిగులఁ బ్రేమతో సుతనిర్విశేషముగఁ దిలకింపసాగెను. వారిరువురొకమారు బిజ్జలుని యాచార్యులగు జైనులతో మతవిషయములో మిగుల ఘోరముగఁ బోరాడిరి. వారి వాదముల నన్నింటిని రూపుమాపి మీ రాజుతో మీరుగూడ శైవమతము స్వీకరింపక తప్పదని వాకొనసాగిరి. పరశ్రేయోఽసహనుఁడగు బిజ్జలుఁడిదియంతయుఁ బ్రచ్ఛన్నముగా విని మిగులఁ గోపించి యా యిరువుర జంగములఁ గట్టి తెప్పించి నిర్దయాస్వాంతుఁడై క్రూరుఁడై గ్రుడ్లు తీయించెను. ఈ విషయము వినఁగ

రికి బసవేశ్వరునిశాంతము నశించెను. హృదయము సారెసారెకుఁ గోపాగ్నిచే రగులుకొని మండిపోవసాగెను. బిజ్జలరాయని యంతము గాంచిగాని నేను లింగార్చనముఁ గావింపనని బసవేశ్వరుఁడు వాకొని తన ప్రియశిష్యుఁడగు జగద్దేవుఁడను నొక సామంతరాజును బిల్పించి తన ప్రతిజ్ఞ నెరింగించి యెటులేని బిజ్జలుని వధించితీరవలయునని యాజ్ఞాపించి కళ్యాణపురమును శపించితన గ్రంథసమూహమును యావదాస్తియు నటనే విసర్జించి వెడలిపోయెను.

జగద్దేవుఁడొక మండలేశ్వరుఁడు గాకపోయిననుసామంతరాజులలోఁ బలుకుబడి కలవాడు. బసవేశ్వరుఁడు కళ్యాణపురములో మంత్రిగానున్నపు డనేకసహాయములుపొంది శివతత్త్వోపదేశమునొంది నాటనుండి విధేయుఁడై వర్తించుచున్నవాఁడు. బసవేశ్వరుఁ డొసంగిన యాజ్ఞ యుక్తమా యయుక్తమాయను సంశయములో దన్మయుడై జగద్దేవుడు కర్తవ్యము తెలియక వర్తింపసాగెను. వీరమాతయగు నాతనిజనని కుమారుని యాందోళనము నంతయువిని యేకాంతము నఁజేరఁజని " తనయా! బసవేశ్వరునియాజ్ఞ భావించుట నీకు గర్తవ్యము. అతఁడు దైవాంశసంభూతుఁడుగాని మానవమాత్రుఁడుకాఁడు. భగవత్తేజ మాతనియందు నిండి నిబిడీకృతమై యున్నది. నిమిత్తమాత్రముగ మనచే నా కార్యములు చేయించుచున్నాఁడు గాని వేఱుకాదు. పరమశైవుఁడగు బసవేశ్వరునిమాటలు పాటించేసి కృతార్థుఁడవుకమ్ము. అప్పుడుగదా నేనువీరమాతనని గర్వింపవలసినది" అనియనేకవిధముల జ్ఞానోపదేశము గావించెను. జగద్దేవుని యుత్సాహ మతిశయించెను. ప్రజలకు బసవేశ్వరునియం దమితవిశ్వాసము గలదు. అతఁడు కళ్యాణపురమును విసర్జించి యేగినదాది పలువిధములఁ బరితపించుచు నెటులేని బిజ్జలరాయని వధ గావింపవలయునని తీవ్రప్రయత్నములు గావింపసాగిరి. "ఈ యదనున మిన్నకుండజనదు. పౌరులకంటె ముందు బసవేశ్వరునియాజ్ఞ పాటించితీరవలయు"నని జగద్దేవుఁడుస్వామిహితకార్యధురీణుఁడై యవసరమైన మృత్యువునైనేని ప్రతిఘటింపవలెనని బయలుదేరెను.

జగద్దేవుని పరాక్రమాభిముఖునిగావించి సంగ్రామరంగమున కుఱికించిన వీరమాతజీవితము సర్వవిధముల సంభావనీయము. కర్తవ్యనిర్ణయమునఁ బ్రాలుమాలు సమయమునఁ బ్రేమను త్రెంచుకొని సంగ్రామమున మరణించియైన బసవేశ్వరునిమాటపాటింపుమని యేకపుత్రునకానందముగ బోధించిన యీవీరమాత స్త్రీజనమున కాదర్శక మగుఁగాక. ఈ వీరమాత తనయునకొసంగిన బోధనము స్త్రీపురుషులకు గుణపాఠము గావించుననుట యతిశయోక్తి కాదు.

"ఇక్కడజగదేవుఁ డింటికి తేరఁ। జక్కన నాయయ్య జననియీక్షించి
శివగణద్రోహంబు చెవిబడ్డయప్పుడ | యవిచారమున వానిహరియింపవలయు
జాలరేతామేని సమయఁగవలయు । కాలకానిభక్తగణమార్గమిదియు
సమయింపఁజాలక చండియైతాను | సమయని ప్రాణవంచన కుటిలుఁరకు
విపరీతచరితుండు విషములోచనుఁడు । మెచ్చనేవారికి మిక్కిలిభక్తి
యిచ్చనేకూర్చనే యిన్నియునేల | క్రీతమునీప్రాణపరిత్యాగమునకు
మతిమెచ్చి యవసరోచితమిచ్చినన్ను । బనిచియేగిరి గాక భక్తులాద్రోహి
త్రుంచుటకోడియ తొలఁగిరెచెప్పుమ"

మాతృబోధనము వేడిరక్తము ప్రవహించు జగద్దేవుని శరీరమంతయు గగుర్పొడిచెను. సమయానుసారముగఁ గళ్యాణనగరమున ననేకారిష్టములు ప్రదర్శితమయ్యెను. కళ్యాణనగరాంతమునకు బసవేశ్వరుఁడేగాక భగవంతుఁడుసైత ముద్దేశించినటుల జగద్దేవుఁడూహించెను. 'తాను నిమిత్తమాత్రుఁడేగాని వేఱువిధముచేనైన బిజ్జలుఁడు గతింపకమానఁడని జగద్దేవున కీక్రిందియరిష్టములవలన బోధపడియెను.

"కటకంపు భాగ్యంబుగ్రక్కునఁదొలఁగె । భూకంపమయ్యెను భువినర్ధరాత్రి
కాకులఱచె వంటకంబులుపుచ్చె । ధరణిబడియెనుల్క తత్తరాలవాన
గురిసెభాస్కరచంద్ర పరివేషమయ్యె । దిపదీటుకల్గె వేసవిమాగిరుంచు
యెంతకానున్నదో యిటమీఁదననుచు । సంతాపచిత్తులై జనులుఁ బేతిల్ల
గడునుగ్రరూపుడైఁ కాలుండుగాన । బడియెనుబట్టణప్రాంతదేశమున
బోకపోఁగవిసెఁ గావిరియెల్లదెసల । ధరణీశ్వరుఁడుగాంచెఁ దలలేనిపీడ
రవియుదయించు దత్ప్రస్తవంబునను | దివి ప్రతిసూర్యులు దీపించిరపుడు"

ఈయరిష్టములు వీరశైవులకు శుభసూచకములుగఁ గాన్పించెను.

ఈవిషయమున సమానవిచారముగల మల్లయ్య బొమ్మయ్య యను నిరువురు శైవమతప్రచారకులుగూడ జగద్దేవునితోఁ గలసిరి. వారు కర్తవ్యమునిర్ణయించుకొనుటకై యాలస్యముగావింపక యాయుధహస్తులై కళ్యాణనగరముచేరి రాజద్వారము సమీపించి లోనికేగుచుండ ద్వారపాలకులు ప్రతిరోధము గావించిరి. వెంటనే నిశితాసికి వారిని బలిగావించి యీ వీరులు మువ్వురు సభామందిరమునకుఁ జేరిరి. బిజ్జలుఁడప్పుడె సభామందిరాభిముఖుఁడై వచ్చుచుండఁగ అకుఁగత్తులతో నీమువ్వురువీరు లొక్కమారె బిజ్జలునిపైఁబడి వధించిరి. భటులు వారింపఁబోయి ప్రాణములవిడిచిరి. ఈఘోరహత్య వినఁబడఁగనే రాజపక్షపాతులును జైనమతాభిమానులును గుంపులుగుంపులుగ బయలువెడలి యట్టహాసములుగావించుచు సంగరాభిముఖులగు నామువ్వురువీరులపైకిఁ దూఁకిరి. శైవమతాభిమానులగు పౌరులందఱాయుధపాణులై వారలఁ బ్రతిఘటింపఁబయలువెడలిరి. ఉభయపక్షములకు సంకులసమరము జరుగసాగెను. అరాజకమగుటచే సేనాజనమంతయు యథేచ్ఛముగ నేపక్షముతమకనుకూలమో యాపక్షమునఁజేరి పోరాడసాగిరి. కాల్బలము, అశ్వికులు, రథికులు తమ యభిమతముననుసరించి యుభయపక్షములలోఁజేరి ఘోరముగఁ బోరాడసాగిరి. మొత్తముమీఁదను సంగ్రామమును మతసంగ్రామమని పేర్కొనవచ్చును. జైనమతస్థులు నా శైవమతస్థులు నుభయపక్షములవారగుటచే మతసంగ్రామానలము రాజిరాజి కళ్యాణనగరసామ్రాజ్యమంతయు నొక్కమాఱు భస్మము జేయసాగెను. భూమియంతయు రక్తప్రవాహములతో మాంసఖండములతో శల్యరాసులతోఁ బీనుంగుల గుంపులతో నిండిపోయెను. కడకు విజయము వీరశైవయోధులగడించిరి. ఇంతఘోరమగు మతసంగ్రామమంతకుముందు జరిగియుండలేదు.

బసవేశ్వరుఁడు బిజ్జలుని వధాకథ నాలకించి "కృతార్థుఁడనైతిని. నాయాగ్రహానలము చల్లారెన"దని సంతోషించి శైవక్షేత్రరాజమగు సంగమేశ్వరాలయమున కేగి యచటదేవునితో నైక్యమొందెను. బసవేశ్వరుని ప్రతిభాతిశయములు చాటుట కీజీవితచరిత్రము చాల సహాయ

కారికాఁగలఁడు. రాజకీయములందును దృఢనిశ్చలమునందును మత విశ్వాసమునందును నప్రమేయమగు కౌశలముగల బసవేశ్వరుఁడు రమారమి యేఁబదియాఱువదిసంవత్సరములు జీవించి దేశసేవయు మతసేవయుఁ గావించి ధన్యుఁడయ్యెను. కొందఱు బసవేశ్వరుఁడొనరించిన సాహసమును స్వామిద్రోహమని యనుచున్నారు. మంత్రియన నెంతటిగౌరవమునకర్హుఁడో గ్రహింపక రాజు దుర్మార్గమునకుఁ జొచ్చి యనవసరవిషయములలో జోక్యముకలిగించుకొన్నపు డభిమానశాలి యగు నేభారతీయుఁడేని మృతునివలె నుండఁజాలఁడు.

బసవేశ్వరుఁ డాంధ్రదేశమునసైతము ప్రచారముగావించి యుంటవలనను గళ్యాణనగర మాంధ్రదేశమందగుటవలనను నాంధ్రుఁడని విశ్వసింపవచ్చును. ఆంధ్రకవులనేకులు బసవేశ్వరుని జీవితమును ద్విపదగను పద్యకావ్యముగను వ్రాసియున్నారు. ఈమహామహుఁడు క్రీస్తుశకము ౧౧౦౦ మొదలు ౧౧౬౭ వఱకు జీవించి బిజ్జలరాజుని వధానంతరము మరణించెను.



# శీలము బ్రహ్మనాయుఁడు

"సీ॥ జాతికాకృత్యంబుఁ జూపవచ్చినమంత్రవిధివిదంపపంక్తులు విఱుఁగఁదన్నె
నాయకురాలొక్క మాయచేనంపిన హరునికైవడి హాలాహలము మ్రింగ
విపినాంతరంబున వృషభంబుఁబట్టి వేశ జబ్బలి శివస్వామిని జేసె
గ్రామమైక్యస్నాతరంగిణిలోనున్న యార్యభామినిశాపమహహ హరించె
తే॥ గీ। భావిభూతప్రపంచసంభవములెఱిఁగి
మ్రొక్కఁగొనఁ భూపభుమోహపుత్రుఁ
జెన్నశివదేవుఁ బ్రసన్నుఁజేసె
మనుజమాత్రుండె నాయండు మానవేంద్ర."

ఆంధ్రమంత్రులలోఁ బద్మనాయక కులాలంకరణుఁడు రేచర్ల గోత్రజుఁడు దొడ్డనాయునిపుత్రుఁడు నగు శీలము బ్రహ్మనాయుఁడు మిగుల ప్రఖ్యాతిఁవహించెను. ఈయన జీవితచరిత్రము పాటలుగఁ బల్లె

పదములుగ జానపదులచేఁ బాడఁబడుచున్నది. పల్నాటివీరులనుగూర్చిన కథలు మనము వినియున్నాము. ఆకథలకుఁ గారకుఁడీ బ్రహ్మనాయఁడె. ఇతనినే పల్నాటికృష్ణుఁడనియు నాయుఁడనియు భక్తివిశ్వాసములతో వ్యవహరించుచున్నారు. ఈమంత్రివర్యుని పవిత్రజీవితము తెలిసికొని యానందింతము.

ఉత్తరదేశమునందుఁ బాలమాచాపురియను నొకపట్టణము కలదు. దానిని బాలించురాజన్యుఁడగు ననుగురాజు తీర్థయాత్రాపరుఁడై యనేకపుణ్యప్రదేశములను సందర్శించి వెనుకకుమఱలి దనదపురమని ఖ్యాతివహించిన చందవోలున కేతెంచి యాపురముఁ బాలించు భూపాలుని పుత్రికయగు మైలమాదేవిని బెండ్లాడెను. చందవోలురాజు తన కుమార్తె కారణముగఁ బల్నాడురాజ్యమంతయు నొసంగుటచే ననుగురాజు బలనాటికిఁ బ్రభువై గురిజాల ముఖ్యపట్టణముఁ జేసికొని పరిపాలింపసాగెను. అనుగురాజునకు మైలమాదేవి యొక్కతేగాక వీరవిద్యాదేవి భూరమాదేవియను మఱియిరువురు భార్యలుకలరు. అందు వీరవిద్యాదేవియందుఁ బెదమలదేవుఁడు పినమలదేవుఁడు బాలమలదేవుఁడు ననువారును మైలమాదేవియందు నలగామరాజును భూరమాదేవియందు కామరాజు నరసింగరాజు మొదలగువారును జనించిరి. అనుగురాజువద్ద దొడ్డరాజు మంత్రిగఁ జాలకాలముండెను. ఇతఁడు వెలమకులజుఁడు. శీలముబ్రహ్మనాయని జనకుఁడు. కొంతకాలమునకు బలనాటిప్రభువగు ననుగురాజును నాతనిమంత్రియగు దొడ్డనాయకుఁడు కాలవశమున గతించిరి. అనుగురాజు వ్యాధిగ్రస్తుఁడై యుండు తరుణమునఁ గొమాళ్లలో నలగామరాజొక్కఁడె యుక్తవయస్కుఁడగుటచేఁ బలనాటిరాజ్యమాతనికిఁ బట్టాభిషేకముగావించి బాలురగు తనతనయుల నందఱను మంత్రిపుత్రుఁడగు బ్రహ్మనాయకున కర్పించి నిజరాజ్యమునకు నలగాము సంరక్షణార్థమునకు మంత్రిగ నియోగించెను. బ్రహ్మనాయఁడు బాలకులకందఱకు సంరక్షకుఁడుగనుండి వారిక్షేమము సహస్రభంగుల విచారించుచు నలగామరాజువద్ద మిగుల మెలకువతో మంత్రికృత్యము నెఱవేర్పసాగెను. క్రమక్రమముగ

నలగామునిపైనికంటె బ్రహ్మనాయనిపైననే ప్రజలకు భక్తివిశ్వాసములు మిక్కుటమయ్యెను. రాజనీతికుశలుఁడగు బ్రహ్మనాయుఁడు నలగామరాజునకు హితబోధగావించుచుఁ బరిపాలనరహస్యములు తెలుపుచు మంత్రిపదవి యసామాన్యముగ నిర్వహింపసాగెను. నలగామరాజు బ్రహ్మనాయనియందు మిగుల గౌరవముంచి యాతనియాజ్ఞ జవదాటక మిగులభక్తితోఁ గాలము గడుపసాగెను. కొలఁదికాలమునకుఁ గామరాజు నరసింగరాజులకుఁగూడ యుక్తవయస్సువచ్చెను. బాలమలదేవ పినమలదేవ పెదమలదేవులుమాత్రము మిగులఁబసివారలుగనుంటచేబ్రహ్మనాయుఁడు వారలసంరక్షణ భారము మాత్రమే తనయందుంచుకొని రాజసోదరుల కుచితకార్యములునియోగించి నలగామరాజుచే ధర్మరాజ్యము చేయింపుచుండ భూతలస్వర్గమువలె పలనాటిరాజ్యము ధర్మబద్ధమై ప్రజారంజకముగ నలరారసాగెను.

నలగామరాజు పరివారసమేతుఁడై యొకమాఱు వేటకేగెను. అవి నిదాఘదినములగుటచేఁ గొలదిసేపు మృగయావిహారము గావింపఁగనే నలగామరాజు బడలిపోయెను. అంతలో నొక యాటవికమృగము కానవచ్చుటచే మృగయావ్యసనబద్ధుఁడై దానివెంట త్రోవయనక డొంకయనక చాలదూరమేగి దానిని వధించెను. అప్పటికిమిగులఁ బ్రొద్దెక్కెను. వెంటవచ్చిన పరిజన మెటనో నిలిచిపోయెను. నిర్మానుష్యమగు నాయరణ్యమున నలగామరాజునకుఁ దృష్టిఁదీఱ దాహమునేని యొసంగువారు కానరారైరి. ఆనూతనప్రదేశములో నెటుబోవుటకుఁదోఁచక తహతహపడుచుండ నొక యువతి యచటికేతెంచి రాజన్యుని సందర్శించి యటనున్న తనవిడిదిలోనికిఁ దీసికొనివెళ్లి నలగామరాజునకు సమస్తోపచారములుఁ జేసి యిష్టాన్నమునొసంగి సంతృప్తిపఱచెను. నిర్జనప్రదేశమున నాతిథ్యమొసంగి ప్రాణమునిల్పిన యాయువతిని మిగులసాదరముతో నలగామరాజు తిలకించి యిష్టగోష్ఠియొనరించి యామె బట్టుగా మాలపాడు నివాసియగు రామిరెడ్డి కూతురనియు నాగాంబయనియు నెఱింగి నాటిసహాయమునకుఁ బ్రతికృతిగ నేదేని కోరుకొమ్మనియడిగెను. నాగాంబిక కొంచెముసేపు యోచించి నలగామరాజుతో "నాఁడితక్క

తివేని ప్రజలు నిన్నునమ్మరుసుమా!" యని హెచ్చరించికొన్నిగడియలు పల్నాటిరాజ్యమును బరిపాలించు నధికారమును నేనుకోరినపుడు దయ చేయవలయునని యడిగెను. నలగామరాజు సంతోషముతో నందులకియ్యకొని నాగాంబికవలన సెలవంది కొలందికాలమునకు గురిజాలఁజేరి యథావిధిగ రాజ్యమును బరిపాలనముచేయుచుండెను.

నాగాంబనేనాయకురాలనికూడవ్యవహరింతురు. నాయకురాలు బాలవితంతువుకావచ్చును. కావుననే పితృగృహమున మిగుల స్వతంత్రముగఁ గాలక్షేపముఁజేయసాగెను. జిట్టగామాలపాడు నాయకురాలు చేరినదాది నలగామరాజు రాజ్యపరిపాలనమును బ్రహ్మనాయనిమంత్రిత్వమును బాగుగావిమర్శించి యోజించెను. బ్రహ్మనాయకుని మంత్రిత్వమాయమకు రుచింపదయ్యెను. ఎటులైన శ్రమచేసి బ్రహ్మనాయకుని మంత్రిపదవినుండి తొలంగించి నలగామరాజాదులను గీలుబొమ్మలుగఁ జేసి పలనాటిరాజ్యమునంతయుఁ దానే పాలింపవలయునని యాయమ యూహించి తగు ప్రయత్నములు చేయసాగెను.

కొంతకాలము గడచినపిమ్మట నాయకురాలు నలగామరాజు సంస్థానమునకు శీలము బ్రహ్మనాయకుఁడు లేనితరుణమున నేగి చాల కాల మేకాంతము జరిపి పూర్వమొసంగిన వరముఁ బరిపాలింపుమని కోరెను. నలగామరాజు వెంటనే నాయకురాలిని బలనాటిసీమపై సర్వాధికారముల నొసంగి రాజముద్రిక చేతికిచ్చెను. నాయకురాలు వెంటనే పౌరులలోఁ గొందఱు ముఖ్యులను బిల్పించి పల్నాటిలో నైశ్వర్యవంతులెవరో తెలిసికొని బందిపోటుదొంగల రప్పించి ధనికుల గృహముల నన్నింటిని దోఁచి తెల్లవారువరకు రాజుగారి బొక్కసము నింపుడని యాజ్ఞాపించెను. చోరులు వెంటనేయేగి పలనాటిసీమలోని ధనికులగృహములనన్నింటినిదోచి నియతకాలమునకు నాయకురాలి యాజ్ఞచొప్పున బొక్కసమునంతయు ద్రవ్యముతో నింపివేసిరి. నాయకురాలు స్వయముగా నాధనాగారములను సందర్శించి యన్నింటికి దాళములు వైచి రాజముద్రికలతో గుర్తులుపెట్టి మఱుసటినాఁడు నలగామరాజును సందర్శించి రాజన్యా! నాయభిమతిము నెఱవేఱినది. కొలదిసేపు పలనా

టిరాజ్యమును పాలించితిని. ప్రతిఫలముగ మీరాజ్య మాచంద్రార్క ముగనుంటకై ధనము సైతము సేకరించితిని. రాజ్యమునకు ధనమే ప్రధానము. వలయునంత ధనసంగ్రహము లేనిరాజ్య మల్పకాలములో నశించి తీరును. బ్రహ్మనాయుడు చిరకాలము మంత్రిగానుండెగాని రాజ్యమున కావశ్యకమగు నర్థసంగ్రహణము నాతడు చేయడయ్యెను. యుక్తాయుక్త పరిజ్ఞానశూన్యులగువారిని మంత్రిపదవియందుంచినచో రాజ్యమునకు బ్రజలకు రాజునకు విప్లవము సంభవించుననుట నిశ్చయమనుచు నాయకురాలు ధనాగారముల తాళములనుదీసెను. సువర్ణరాసులతో నిండియున్న కొట్లుచూచి నలగామరాజు మిక్కిలియాశ్చర్యమునొంది కొలదిగడియలలోనె రాజ్యమున కింతధనమునుగూర్పజాలిన యీనాయకురాలు మంత్రిణిగనున్న రాజ్యమభివృద్ధిలోనికి రాకమానునా! యని యోజించి వెంటనే మంత్రిపదవినుండి బ్రహ్మనాయకుని తొలంగించి నాయకురాలునకు మంత్రిపదవినొసంగెను. నాయకురాలు మిగుల జండశాసనము వహించి పలనాటిసీమయందంతటను లేనిపోనిపన్నులను విధించి రాజప్రీతిమాత్రము లక్ష్యమునందుంచుకొని కోశాగారముల నన్నింటిని పూర్తిచేయసాగెను. నలగామరాజాదులకు రాజ్యమునందున్న రుచికంటె ద్రవ్యముపైనభిరుచి మెండుగనుంటచే నాయకురాలి యడుగులకు మడుగులొత్తుచు నాయకుచేతి కీలుబొమ్మలవలె వర్తింపసాగిరి. పేరునకు నలగామరాజు రాజుగనుండెగాని సర్వకార్యములు నాయకురాలె నిర్వహించుచు రాసాగెను. దురాలోచనాపరతంత్రయగు నాయకురాలు వీలుచూచి నలగామరాజునకు దుర్బోధగావించుచు సోదరులును వీరవిద్యాదేవిపుత్రులునునగు బాలమల్లేవ పెదమల్లేవ పెన్నమల్లేవులను వధించుట కర్తవ్యమనియు లేకున్న బ్రహ్మనాయకుడు వారలబెంచి పెద్దజేసి పలనాటిరాజ్యమునకే యపాయము దెచ్చితీరునని తెల్పి వారలవధింప బ్రేరేపించెను. నాయకురాలి చేతికీలుబొమ్మయగు నలగామరాజు సోదరులగు కనులుగానని కందువుల వధింపబ్రయత్నించెగాని యా కృత్రిమము నెరింగినదగుటచే బ్రహ్మనాయకునితల్లి శీలాంబిక యాశిశువులను సంరక్షించి సవిస్తర

ముగ నాయకురాలి కృత్రిమములు నలగామరాజు దుండగములు తన
యుండగు బ్రహ్మనాయకునకు నివేదించి బాలకులమువ్వుర నాతని
వశముఁ గావించెను. బ్రహ్మనాయఁడు నాయకురాలి దుర్నయ
ములు నలగామరాజు దుశ్చేష్టలు కనులారఁగాంచుచు నిరుద్యోగముగ
గురిజాలనుంట శ్రేయస్కరము గాదనియు నింకఁ గొలదికాల మటు
లున్నచోఁ రాజపుత్రుల కపాయము కలిగితీఱుననియు భావించి
సకుటుంబ పరివారముగఁ జంద్రవంక తీరమునకు బయలు వెడలెను.
బ్రహ్మనాయకునితోఁగూడ గురిజాలనుండియుఁ జుట్టుపట్లగ్రామము
లనుండియుఁ బలువురుపౌరులు వస్తువాహనములు పశువులపైనిడి
వెంట బయలుదేరివచ్చిరి. బ్రహ్మనాయఁడు వెంటవచ్చినపౌరులనందఱ
నాదరించి చంద్రవంకనదీతీరమున నొకపురమునుగట్టించి దానికి మా
చర్లయని నామకరణముగావించి చెంత నొకగొప్పతటాకము త్రవ్వించి
పౌరులుగనుండువారలకుఁ దగువృత్తులనొసంగి నగరమధ్యమున గొప్ప
చెన్నకేశవాలయమును దానిచెంత గొప్పకోటయుఁ గట్టించెను. బాల
మలిదేవాదులు బాలకులగుటచే బ్రహ్మనాయఁడు వారిపక్షమునఁ
బల్నాడురాజ్యములోని కొలఁదిభాగమును స్వయముగాఁ బరిపాలింప
సాగెను. క్రమక్రమముగ నాయకురాలి దుర్మార్గమునకు నలగామ
రాజు తెలివితక్కువకుఁ బ్రతిఫలముగ నవస్థపడు పౌరులందఱు గురి
జాలరాజ్యమునుండి విముక్తులై బ్రహ్మనాయకుని ఛత్రచ్ఛాయకుఁ
జేరి సుఖముగ జీవింపసాగిరి. బ్రహ్మనాయకుఁడు పేరునకుమంత్రి
యైనను స్వతంత్రునివలె రాజ్యముపాలించుచుఁ బ్రజలను గన్నబిడ్డల
మాఱుగఁ బలకరించుచు బాలమలిదేవాదులసౌఖ్యమే తనసౌఖ్యముగ
భావించి ధర్మానుకూలముగ వర్తింపసాగెను. స్వల్పకాలమునకే బ్రహ్మ
నాయనియందుఁ బ్రజల కమితభక్తివిశ్వాసములు నెలకొనుటచే
నాతని శ్రీవిష్ణువునంశముగా భావింపసాగిరి. బ్రహ్మనాయకుని రాజ్య
వైభవము బాలమల్దేవాదుల కుశలవర్తమానాదులు వినుటచే నాయకు
రాలికి నలగామరాజునకు నసూయమెండయ్యెను. ఎటులైన బ్రహ్మనా
యనిరాజ్యమును క్షీణపరచి బాలమల్దేవాదుల బంధింపవలయునని

వారు మిగులఁ గుట్రగావింపసాగిరి. రాజనీతికుశలుఁడగు బ్రహ్మనాయకుఁడది లక్ష్యపెట్టక సమయోచితములగు ప్రతికృతులతోఁ దాత్కాలికశాంతి గావింపసాగెను.

బ్రహ్మనాయునికి బాలచంద్రుఁడను కుమారుఁడు కలఁడు. పరప్రభావమునఁ బంచమకాంతకు జనించిన కన్నమనాయఁడను మఱియొక కుమారుఁడు కలఁడు. వీరిద్దరిలోఁ గన్నమనాయఁడు పెద్దవాఁడు. సర్వకార్యములయందుఁ గన్నమనాయఁడు బ్రహ్మనాయనికి దక్షిణహస్తమువలెనుండి యనేకవిధములఁ దోడ్పడసాగెను. పితృభక్తిపరాయణుఁడు స్వామికార్యనిర్వహణధురీణుఁడునగు కన్నమనాయఁడు తనయావచ్ఛక్తిని వినియోగించి మాచర్లకు నాయకురాలివలనను దదనుయాయులవలనను నెట్టియపాయము రాకుండఁ జాగరూకతతోఁ దిలకింపసాగెను. వేగులవారలేగి నాయకురాలికి మాచర్ల వైభవము బ్రహ్మనాయని యసాధారణపరిపాలనము బాలమలిదేవుల కుశలవార్త నెఱింగించిరి. నాయకురాలు వినినదాది సహింపలేక యెట్లు బ్రహ్మనాయని వంచింతునాయని యనేకవిధముల యోజించి కడకుఁ గొందరు దోఁపిడికాండ్రను మాచర్లకొల్లఁగొనుఁడని పంపెను. వారొకచీకటిరేయిని మాచర్లలోఁ బ్రవేశించి మంత్రిణి యాజ్ఞ నెరవేర్పఁ బ్రయత్నము చేయసాగిరి. ప్రజాపక్షపాతియు స్వామిభక్తుఁడునగు కన్నమదాసుఁ డీయంశమునంతయు బ్రహ్మనాయనివలన నెఱింగి చోరులు పురమునఁ బ్రవేశించి వస్తుసంభారములదొంగిలించి చంద్రవంకతీరము చేరువఱకుఁ జూచిచూడనట్లు మిన్నకుండి పరిజనముతోఁ బోయి యాకస్మికముగ ముట్టడించెను. చోరులందఱు నాయుధముల స్థలాంతరమునుంచి ద్రవ్యరాసులను మోయుచున్నవారగుటచేఁ గస్త్రశూన్యులై పట్టుపడిరి. కన్నమనాయఁడు పరిజనసహాయముతోఁ జోరుల నందఱ బంధించి వారలు తెచ్చిన ద్రవ్యమునంతయు నెవరిదివారికిచ్చు నేర్పాటులతో రాజమందిరమునకుఁ బంపి ధనము తెచ్చిన గోతములనిండఁ జంద్రవంకలోని యిసుకఁ బోయించి చోరుల నెత్తిపైఁ బెట్టి వారలనందఱఁ దెల్లవారుసరికి గుంజాలకు నడిపించెను. చావుబ్రతుకులతోఁ జోరులు తెల్లవారుచుండఁ బురముఁ జేరగనె

గన్నమనాయుఁడందఱనొక దొడ్డిలోనికి నెట్టి యెవరు బైటికివచ్చినను ఖండింపఁబడుదురని కఠినముగ బోధించి ద్వారము గాచియుంచెను. తెల్లగ దెల్లవారుసరికిఁ జోరులు కన్నమనాయకునిచే గుడిజాలలోనె బంధితులైరని నాయకురాలువిని యాగ్రహోదగ్రురాలై కనుల నిప్పుకలురాల స్వయముగా బయలుదేరి గన్నమనాయుని సమీపించి ఛీ పంచముండా! తగుమనని గుడిజాలకు వచ్చితివా! ద్వారమునువిడచి చోరులను వదలిపెట్టకున్నచో నీమాంసమును గాకులకు గ్రద్దలకు వేయింతునని పేలుచుఁ బైకివచ్చెను. బ్రహ్మనాయుని వరపుత్రుఁడగు కన్నమనాయుఁడు నాయకురాలి యదలింపులకు బెదరక నిల్చి యామెతో నిట్లుభాషించెను.

"సీ॥ మాలఁడనుచు బుద్ధిమాలి పల్కెదవీవు నాలుక రెండుగా నఱకువాఁడఁ
గడజాతియని నన్నుఁ గడవఁబల్కెద నీదంతముల రాల్చు శౌర్యంబువాఁడ
ముట్టరాదనినన్ను దట్టిన నీ హస్తపద్మయుగ్మకండలు గారఁగ దఱుగువాఁడఁ
బంచముండనినన్ను నెంచిన నీమ్రోల పంచశాఖలను ఖండించువాఁడ
తే॥ గీ॥ నాయునాజ్ఞలేక నాతినిజంపఁగ
విహితమగునెయంచు విడచినాఁడ
నెందుఁబోయెదిక నింకపరాక్షి ని
కైశ్యమైనఁ గోసికానివిడువ"

కన్నమదాసుఁ డిట్లుభాషించుచు నాయకురాలిని వెంబడించెను. ఆయువా ప్రాణభీతిచే మృగయునిగాంచి హరిణచందమున పిడిసపెన్నెటితోఁ గడగడవడంకు దేహముతోఁ దొట్రుపడు నడుగులతో సంతిపుర ముఁదూచె మెటులోఁ బ్రాణములఁ గాపాడుకొనెను. ఈసంరంభమున కలికిఁ జోరులందఱు గుమిగూటచేఁ గన్నమదాసుఁడు యావద్వృత్తాంతము వారికి నివేదించి నాయకురాలి మూర్ఖతయు నలగామరాజు దురాగతములు నైతము చాటిచెప్పి చోరులందఱను క్షమార్పణము గోరించి విడిచిపెట్టి యోగనిశ్చయించెను.

కన్నమదాసుఁడు చోరుల సమూహమునేగి తిరిగిరాకుంటచే బ్రహ్మనాయుఁడు మిగుల విచారించి చోరులు వధించిరో లేక గుడిజాలకు నిర్బంధించి కొనిపోయిరో యని తలంచి సపరివారముగ గుడిజాలకు బ్రయాణమయ్యెను. ఉన్నతావు నెక్కి బ్రహ్మనాయుడుత్వర

లో గఁరిజాలచేరి యట గన్నమదాసుని జూచి గతవృత్తాంతమంతయు నాలకించి యాతని ధైర్యస్థైర్యసాహసాదుల కపరిమితానందస్వాంతుఁడై మాచర్ల కేగుమని యాజ్ఞనొసంగి తాను నలగామరాజును నరసింగరాజును నాయకురాలిని జూచిపోవ సంకల్పించి రాజసౌధమున కేగెను. రాజును రాజసోదరులు మంత్రిణియు బ్రహ్మనాయకు ననేకవిధముల గౌరవించి యుచితాసనమునొసంగి కుశలప్రశ్నములను గావించి వేరువేరు వరుసను సోదరులు మువ్వురియొక్కయు దక్కంగల రాజబంధువుల యొక్కయు గుణశీలాదికములు విచారించిరి. బ్రహ్మనాయడన్ని ప్రశ్నములకు సముత్తరముల నొసంగి నాటిభోజనమునకు రాజుచే నిర్బంధితుఁడై యచటనే నిలిచెను. కృత్రిమోపాయ పారంగతురాలగు నాయకురాలెట్లైన బ్రహ్మనాయని వధింపకున్నచో నేనాటికైన నపాయము వచ్చితీరుననియు నలగామరాజాదుల కాతనిపై సంపూర్ణముగ విశ్వాసము నశింపలేదనియు గ్రహించి రాజగృహమునవంట జేయువారితో గలిసికొని యాహారపదార్థములలో విషము గల్పించెను. ఏపాపము నెఱుఁగని బ్రహ్మనాయ డావిషాహారమును బుచ్చుకొనెను. దైవవశమువలన నాతని కెట్టియపాయము కలుగదయ్యెను. భగవదంశసంభూతులకు మానవులు చేయు దుష్కార్యములు ప్రతిబంధకములు కానేర్చునా?

"తే. గీ॥ బ్రహ్మగర్భమందు దాఁగియుండిన నాఁడు
విషముఁ ద్రావిమృత్యు విజయుఁ డయ్యె
నేఁడు ప్రాప్తమయ్యె నెగడిన నాయున
కీవిషంబు జాహ్నవీవిషంబు॥"

గర్భస్థుఁడై విషము భక్షించుకొనిన బ్రహ్మనాయనికి నాయకురాలు పెట్టినవిషము జాహ్నవి (జలము) విషమువలె నారోగ్యప్రదమయ్యెను. దానచే నాయకురాలి హృదయమువ్యథ మొందయ్యెను. బ్రహ్మనాయుని బలిలోకమాత్రికుబంధుల ప్రీతమకర్తవ్యము, రాజ్యవిచ్ఛిత్తుని గావించుట కెందవలె [illegible]

రాజకీయవిషయముల సంభాషించుచు నలగామరాజుతో నరసింగరాజుతోఁగలసి కాలక్షేపము జేయనాగెను. నాయకురాలీయదను గ్రహించి పౌరుషశాలియగు బ్రహ్మనాయని వంచింప నొకవెరవు నాలోచించి తరుణమునకు వేచియుండెను. బ్రహ్మనాయఁడుసమయోచితముగ జాలసేపు భాషించి నలగామరాజును నరసింగరాజును జూచి రాజన్యులారా! మీ రాజమందిరంబులు మిగుల జీర్ణములై యున్నవనియు బునర్నిర్మాణమునకు నిసుక గావలయుననియు నాయకురాలు తలంచుటచే జారులచే నిసుకబంపితిని. చూచిపోవ రండని వారినిసువురను గన్నమనాయఁడు చోరులను బంధించిన గృహమువద్దకు దీసికొనిపోయి చూపించెను. నలగామరాజు నరసింగరాజు నాయకురాలొనరించిన యీకృత్యమున కించుక యేవగించిరి.

బ్రహ్మనాయఁడునలగామరాజునొద్ద సెలవునొంది మాచర్లపురాభిముఖుఁడై బయలుదేరెను. కొలదిదూరము వచ్చుసరికి మార్గమధ్యమునజనులుమూఁగియుండిరి. "అదుబ్రహ్మనాయఁడునాయకురాలు" అను పేరులు వినవచ్చుచుంటచే నటగల విశేషము లేవియో కనుఁగొనవలయునని బ్రహ్మనాయఁడావైపున కశ్వమును మఱలించి చూచెను. నాయకురాలాగుంపుమధ్యనిల్చియుండి రెండు పొట్టేళ్లకు నిరువురు బాలకులకు రెండు కోడిపుంజులకు రెండుమహిషములకు నిరువురుయోధులకు గ్రమక్రమముగబోరుపెట్టుచు నోడినవారు బ్రహ్మనాయనిపక్షమువారనియు గెలిచినవారు నాయకురాలి పక్షమువారనియు వాకొననాగెను. బ్రహ్మనాయఁడున కదిచూచువఱ కింతయునరాని యాగ్రహము వచ్చెను. స్త్రీ తన్నటుల నవమానించిసందులకు బ్రతిక్రియ జేయ దలంచి బ్రహ్మనాయఁడశ్వముదిగి ముందుకువచ్చినాయకురాలింజూచి యువతీ! నేను పన్నిదంబొడ్డని జాతువుల మొగ్గరంబులోఁ జొచ్చి యోడినవానినెల్ల బ్రహ్మనాయనివని గేలిచేయుచున్న దానవు. బ్రహ్మనాయని బలపరాక్రమములు నీవెఱుగక యాడుదానవగుటచే నొకకొలంబులా [illegible]

నని భటునిచే నొకముంచికోడిపుంజును దెప్పించి దానిపాదమునకుఁ గత్తిగట్టి బ్రహ్మనాయు డెలలో నుంచెను. నాయకురాలాపుంజునకు సాటిపుంజుల దెచ్చి కత్తిగట్టి పోరునకు విడిచెను. కాలవశమున నాయకురాలు విడిచిన పుంజులన్నియు గెలుపసాగెను. బ్రహ్మనాయుని కుత్సాహము మెండయ్యెను. నాయకురాలి కుక్కుటములన్నియు బ్రహ్మనాయుని కుక్కుటముతోఁ బోరాడి గెలుపసాగెను. పిల్చి యవమానము దెచ్చుకుంటినేయని నాయకురాలు మిగులఁ బరితపించి మాంత్రికులకు నిలయమగు కట్టుబోతులగంగవరమున కేగి మంత్రవేత్తల నందర సందర్శించి మీకు గోరిన రొక్కంబుల నిచ్చెదను. పందెములో బ్రహ్మనాయుని కోడిపుంజోడునటులఁ జేయుమని కోరెను. ఘాతమాంత్రికులామోదించి పందెపుంజోటున కేతెంచి బ్రహ్మనాయునికోడిపుంజుపక్షములకు బాదములకు గసులకు బ్రయోగము గావించిరి. నాయకురాలు లోలోన నీదుండగముఁగావించి బ్రహ్మనాయునిచెంత కేగి పందెములేకుండ సమీక్షముండరాదు. నీకోడిపుంజోడిపోయినచోఁ గుటుంబముతో రాజన్యులతోఁగూడ నేలేశ్వరము రేవున గృష్ణదాటి ఏడుసంవత్సరములు పరసీమలలోవసించి యనంతరము నిజరాజ్యమునకు జేరవలెను. నేనోడిపోయితినేని మా రాజన్యులతోఁ గృష్ణజెట్టేల రేవునదాటివలసబోయెదను. ఈ ప్రతిజ్ఞకామోదింతువా యనెను. నాయకురాలి మాటలకు బదులుచెప్పక బ్రహ్మనాయుడందులకంగీకరించెను. పిమ్మట నిరువురు తాము తామంగీకరించిన నిబంధనముల నొకపత్రికపై వ్రాసి యుభయులుసంతకములుగావించి ప్రమాణము లొనరించి సాక్షులచేసైతము వ్రాలుచేయించి కుక్కుటసమీక్షమున కాయిత్తమైరి. కర్మవశమున నైననేమి నాయకురాలి మాయోపాయములవలన నైననేమి మాంత్రికుల ప్రయోగమాహాత్మ్యమువలన నైననేమి బ్రహ్మనాయునికోడిరణరంగమున మరణించెను. ఆకీలప్పనిబ్రహ్మనాయునికివలస పోవలసినవిధిప్రాప్తించెను. చేయు కార్యము లేక యకారణముగ బ్రాణపదమగు కోడిపుంజు మరణించినసందులకు విచారమునంది వెంటనే మాచెరల పురముజేరి నగర సంరక్షణమునకు గోపన్నయను విశ్వాసపాత్రుడగు భటునొకనిని నియో



గించి బ్రహ్మనాయఁడొకశుభముహూర్తమునఁ బ్రతిజ్ఞానిర్వహణార్థమై తనధర్మపత్నితోడను బరిజనముతోడను బాలమలదేవాది రాజకుమారకత్రియముతోడను గృష్ణానదిదాటుటకై బయలువెడలెను. బ్రహ్మనాయనివెంట కొమ్మభూపాలకుఁడు నలగాంచమల్లు పెద్దన్న పేర్నీడు సూర్నీడు మల్నీడు సుంకర గామానాయఁడు గండుకన్నమనీడు మొదలగు పేరుజెందిన వీరభటులుకూడఁ బ్రయాణమైరి. ఆగర్భశ్రీమంతుఁడగు బ్రహ్మనాయఁడు మార్గమధ్యమున ననేకదురవస్థలకు లోనయ్యెను. అతని శకటముల లాగు వృషభములను బెబ్బులిపట్టుకొనెను. కృష్ణానదిదాఁటుచుండ మొసలి బ్రహ్మనాయకుని బట్టుకొనెను. ఈయవస్థలన్నియు ననుభవించుచు రాజకుమారుల వెంటఁదీసికొని నాయఁడు కొలదికాలమునకు నేలేశ్వరము రేవుయొద్దఁగృష్ణదాఁటిమూఁడామడలదూరము ప్రయాణముగావించి యచట విశాలముగనున్న నొక యడవినరికించి మండాదియను పురమొకటినిర్మించి పరిజనముతోఁ బశుగణముతో నచటనె నిలిచెను. మంత్రియైరాజ్యమునంతయు నోడివచ్చినబ్రహ్మనాయని రాజకుమారులైనను సాటివీరులైనను బల్లెత్తుమాటయైన ననలేదు. రాజనీతిధురీణుఁడగు బ్రహ్మనాయఁడు పరిజనులక్షేమమె తనక్షేమముగ భావించి యందఱక్షేమమును విచారించుచు మండాదిలో సుఖముగాఁ గాలక్షేపము గావింపసాగెను.

బ్రహ్మనాయని పశుకదంబము సమీపారణ్యములలోఁ బూరిమేసి మిగులనభివృద్ధిలోనికి వచ్చెను. నాయఁడు పుట్టుభోగియగుటచే నేకొంతలేకుండ నరణ్యప్రదేశమగు మండాదిలో నుండుటవిని నాయకురాలు సహింపలేక కొందఱుకిరాతులను సమావేశపరచి వారితో మీరందఱు చీఁకటిరాత్రిలలో బయలువెడలి మండాదిఁజేరి బ్రహ్మనాయని గోకదంబమును దోలుకొనిరండని ప్రేరేపణముగావించి పంపిచెను. కిరాతులు నాయకురాలియాజ్ఞప్రకారము బ్రహ్మనాయని పశువులమందలోఁబ్రవేశించి యన్నింటినదలించి తోలుకొనిపోవుటచే ద్వారమునందుఁబరుండి పశురక్షణముగావించుచున్న లంకన్నయను వీరుఁడు దుర్మరణముగావించెను. కిరాతులు స్వేచ్ఛగా గోకదంబములఁ దోలు

కొనిపోవుచుండ నాటవికులవలన నావృత్తాంతమునంతయు బ్రహ్మనాయుడువిని యది నాయకురాలి దుర్నయముగనూహించి (గండు) కన్నమదాసుని గోసంరక్షణమునకుఁ బంపిచెను. విరాటరాజుగోవులనురక్షించుట కర్జునుఁడేగినటులఁ గన్నమదాసుఁడు నాయకురాలుపంపిన సైన్యముపై కీవిధముగనేగెను.

"సీ॥ పండ్రెండుమూరల భైరవఖడ్గంబు నాలుమూరల కంచుటంగదనర
మత్తదంతావళ మండలిపైఁబాఱు పంచాస్యడింభక భాతినలరఁ
దళజీమూతబృందంబుపైనేతెంచు ప్రబలజంఝూసమీరంబుపోల్కెఁ
బశుకందంబుపైఁ బరతెంచు భయదశార్దూలంబు లీలనద్భుతపరాక్రి
తే॥గీ॥ మక్రమంబున వెడలినిర్వక్రధైర్య
శౌర్యగాంభీర్యపటుభుజావీర్యములన
లంకరించితదీయబలంబు నెదిరి
మొదవులమఱల్చె రిపులదుర్మదముచెదర॥"

కన్నమదాసుఁడు ఘోరసంగ్రామము నాచరించి యెట్టకేలకు విజయము గడించి కిరాతులనందఱను బాఱఁదోలిగోకదంబముల నన్నింటినివిడిపించికొని మండాదిచేరి విశేషములన్నియు బ్రహ్మనాయునికి నివేదించెను. నాయకురాలి దుర్నయములకు నాయఁడు చాలయేవగించి గురిజాలకు మిగుల సమీపముగనున్న మండాదిలో నున్నచో నిట్టి యపాయములె యనేకములు రావచ్చునని తలంచి యటనుంట యుక్తముగాదని పరిజనులకుఁ దెలిపి స్థలాంతరమున కేగనిశ్చయించి "దొమ్మర్లగొంది"యనుచోట గృష్ణానదిదాఁటి శ్రీశైలముచెంత కేగెను. నాయఁడు త్రిలింగములలో నొకటియు సుప్రసిద్ధక్షేత్రరాజమునగు శ్రీశైలమువద్ద కొన్నిదినములుండి శంకరున కినేక భోగంబులను జేయించి భూదానాదికములొనరించి కొలదికాలమువసింప నాయాలయధర్మకర్తయు నాప్రదేశమునకుఁబరిపాలకుఁడునగు మాకరాజుతో స్నేహముకుదిరెను. బ్రహ్మనాయఁడు తనహారములు ఖడ్గరాజము మాకరాజువద్ద కుదువయుంచి శ్రీశైలప్రాంతమందుఁగల అడ్డీడు బడ్డీడు జమ్ములపల్లె కలరోడు పూరకాపురము దున్నపోతులపల్లె దూపాడు కొలకుల యెగువపాలెము దిగువపాలెము అన్నసముద్రము చిన్నకొలకుల గొల్లపల్లి వీర

భద్రిపురము కోనభీములపాడు కొచ్చెర్లకోట నదగోపు ముటుకుల చాపలమడుగు త్రిపురాంతకము గణపవరము మేడపియను గ్రామముల కొలఁదిసుంకము చెల్లించులాగున సర్వాధిపత్యములతో గుత్తబుచ్చికొని యాజ్ఞాపత్రికఁ గైకొని యాయాగ్రామములలో నివాసయోగ్యమేదియో యట నిలువనిశ్చయించి పరిజనముతో బయలు వెడలెను. బ్రహ్మనాయఁడు మొదట త్రిపురాంతకముఁ జేరి పార్వతీశ్వరుని సందర్శించి యటనుండి మారకాపురమునకుఁ బోయెను.

బ్రహ్మనాయఁడు పరివారసహితముగ మారకాపురములోఁ జాలదినములునివసించి చెన్నకేశవాలయము గట్టించి గొప్పతటాకమును నిర్మించి యట వసతులుతక్కువగానుంటచే మేడపి ముఖ్యస్థానముగఁ జేసికొని యచటనె స్థిరావాసముగ నొనరించెను. మేడపిలోఁ గొలఁదికాలము నివసించువఱకు రాజకుమారకులకు యుక్తవయస్సు వచ్చెను. పూర్వపులెక్కలను రిబశీలించిచూడఁగా మాచర్లవిడిచి యేడుసంవత్సరములు దాఁటిపోయినటులఁ దెలియవచ్చెను. పరస్థలములలో నివసించినివసించి విసిఁగినవాడగుటచే బాలవృద్ధాదులతో మాచర్లకుఁ బోవసంకల్పించి బ్రహ్మనాయఁడు సహచరులతో గర్తవ్యమునుగూర్చి యోజించెను. పరిజనులందరు నాయకురాలి దుర్నయముల నుగ్గడించి మాచర్ల సాధారణముగా స్వాధీనము కానీయదనియు సంగ్రామముతప్పదనియు వాకొనిరి. బ్రహ్మనాయఁడు చాలసేపు యోజించి ముందొక రాయబారిని గురిజాలకుఁబంపి మాచరలరాజ్యము మాకొసంగవలయుననియుగడువుతీరెననియుఁ దెలుపఁదలంచి దూతగ నెవరేగనర్హులోయని సహచరుల నడిగెను. అందరునేకముఖముగ దౌత్యమునకుఁ దగినవాఁడుభయరాజన్యులకు బంధువును గార్యవాదియు ననుచితజ్ఞుఁడునగు నలరాచమల్లెసమర్థుఁడని నిర్ణయించిరి. అలరాచమల్లు గురిజాలలోని రాజన్యునిసోదరుఁడగునరసింగరాజునకల్లుఁడును నాయకురాలికిఁ బ్రియుఁడును యథార్థవాదియు నగుటచేఁ గార్యసిద్ధినిఁగూర్చి యుండకును సంశయములఁబోనాడిసంధికై ప్రేరేపణముగావించిరి. మొదట నలరాచమల్లుశ్వశుర్రిగేహమున కేగ నంగీకరింపకుండెను. కాని బహుజనాభిప్రాయ

ము ముఖ్యముగ బ్రహ్మనాయుని యభిప్రాయముఁ దూలనాడలేక కడ కంగీకరించెను.

నలరాచమల్లు, బ్రహ్మనాయుఁడు, మిగిలినవీరులు, చెప్పినయంశములన్నియు నవగతముఁగావించుకొని రాయబారమునకై గురిజాలకుఁ గొలఁదిబలముతో బయలువెడలెను. కొలఁదినాళ్లకు గురిజాలకు నలరాచమల్లు చేరెను. పలనాటిరాజ్యము పరిపాలించు నలగామరాజు పెంచుకొనిన నరశింగరాజుకుమార్తె తనభార్యయగుటచే నలరాచమల్లు శ్వశురగృహమునకు లోకాచారానుసారముగ నేగి యొకటిరెండు దినములు కాలక్షేపముగావించి యొకనాఁటి పేరోలగంబున నాయకురాలు నరశింగరాజు మంత్రాంగములు కావించుసమయమున నలగామరాజుతో నిటులఁ దెలిపెను.

"రాజన్యా! నేను మలిదేవరాజుల సమక్షమునుండి తన్మంత్రియగు శీలము బ్రహ్మనాయకునిచేఁ బంపఁబడిన దూతుఁడను. మీతోఁ గొన్ని రాజకీయాంశములు మొగమోటములేక మాటలాడవలసి యేతెంచితిని. మలిదేవరాజులు కాననిక్రింతలలో నాయకురాలియొక్కయు మీయొక్కయు దుర్నయఫలము లనుభవించుచు నానావస్థలకులోనైయున్నారు. విష్ణుసదృశుఁడగు బ్రహ్మనాయని దుర్వోదరమున మోసగించి మాచర్లరాజ్యము నొడంబడికప్రకారముగ నేఁడుసంవత్సరములు పరిపాలించితిరి. గడువుతీరినది. ఇప్పుడుమీరు మాచర్లరాజ్యము మాస్వాధీనము గావింపవలయును. ధర్మబద్ధమగునీకార్యమునకు మీరంగీకరింపకేని సంగ్రామముఖమునన్నైన మిమ్ముఁనిర్జించి మారాజ్యమును మేముచేకొనకమానము. ముందు సామోపాయముతోఁ దెల్పుచున్నారము. నాయకురాలి దుర్బోధనమునకు లోనుగాక స్వతంత్రముగ యోజించి ప్రత్యుత్తరము నొసంగవలయును."

నలరాచమల్లు తెలిపినమాటలన్నియు వారలకందఱకు ములుకులయ్యెను. నలగామరాజుమాటలువిని తోఁకద్రొక్కిన పామువలె, నాగ్రహోదగ్రుఁడై నలరాచమల్లుని దుర్భాషలాడి తృణము నిలుపఁ దగుచోటుసైతము మలిదేవరాజుల కొసంగననియు నావశ్యకమైన

చో నాసంస్థానమునకువచ్చిన ధర్మపిండంబు వేయింతుననియు బ్రహ్మనాయని యహంకారము దుర్మంత్రిత్వమునకు చెలువమనియు భాషించెను. బ్రహ్మనాయనియందమితభక్తివిశ్వాసములు గలవాఁడును బాలమలిదేవాదులయందుఁ బక్షపాతబుద్ధికలవాఁడు నగు నలరాచమల్లు నలగామరాజుచేయు గర్జితములకుఁ జలింపక మాచర్లరాజ్యము నొసంగకున్నచో మీయందరకు సంఘమరణము కలిగితీఱును. బ్రహ్మనాయకునిపక్షమున వీరులు లేరనిగర్వింపకుమని యీవిధముగాఁ దెలిపెను.

"సీ॥ మత్తమాతంగ కుంభస్థలంబులుడుల్ప నొమ్మగేందుఁడు పెద్దినాయఁడుండ
స్యందనాచలరాజిశకలంబులుగఁ జేయ నవశతారుండు పేర్నాయఁడుండ
ఘనతురంగమఖురవ్యూహముడలింప నిస్తులోగ్రుపిమల్లిడుకలుగ
ఖిలపదాతి పిపీలికానీకములుద్రవ్వ బుక్కనాగండుసూక్ష్మకలుగ
తే॥గీ॥ నఖిలదేశాధినాథసైన్యప్రతాన
నిబిడజీమూతసంఘముల్ నెఱయఁబోలఁ
దరళపవనుండుకన్నమదాసుఁడుండ
వీరులెదురెవ్వరనుచుగర్వింపనగునె।"

నలరాచమల్లు పలికిన ప్రతివాక్యమును నలగామరాజాదులు ఖండించి పాలొసంగ వీలులేదనియుఁ జేతనైన సంగ్రామమున గెలిచి తీసికొండనియు ఖండితముగఁ బలికిరి. నయమున భయమున నెన్నివిధములఁజెప్పినను ఫలములేకపోవుటచే నలరాచమల్లు సంధిప్రసంగము మానివేసి బ్రహ్మనాయకునకు గడచిన సంగతినంతయుఁ దెలియఁజేయు నపుడె ప్రయాణము చేయనిశ్చయించెను. నాఁటిదినము మేఘములు కమ్మి వర్షమువచ్చునటులుంటచే యటనె విధిలేక నిలువవలసి వచ్చెను. ఆరాత్రి విందునకురమ్మని నాయకురాలు నలరాచమల్లుని ననేకవిధముల నిర్బంధించెను. దుర్మార్గురాలగు నాయమ కపటవర్తనము బ్రహ్మనాయనికి విషముపెట్టినదాది నలరాచమల్లు సాకల్యముగ నెఱింగియున్నవాఁడగుటచే నియ్యకొనఁడయ్యెను. నాయకురాలంతతో నూరుకొనక వంటవారలచే నలరాజు భుజించునాహారములో విసముఁబెట్టించెను. దూరదృష్టిగలనలరాచమల్లాయాహారమును భుజింపక విసర్జించెను. నాయకురాలది గ్రహించి యెటులేని యాతని మట్టుపెట్టకున్నచో నిచటి

రహస్యములన్నియు బ్రహ్మనాయని కెరింగించి సంగ్రామప్రయత్నముగా వించుననియుద్దేశించి శివాలయమున కేగి శివనిర్మాల్యములలో విసము నించియాకుసుమములను జత్రముగఁ జెండ్లుగుచ్చి పూజారులకు రొక్కమునొసంగి యాపుష్పకందుకములను నలరాచమల్లున కీయవలసినదిగ నియోగించెను. వారటులె గావించిరి. దూరదృష్టిలేక కాలముకూడివచ్చిన నలరాచమల్లాపుష్పకందుకములను భక్తితోఁగైకొని దన్నిర్మాణమున కానందించుచు నాఘ్రాణించి శీఘ్రముగు విషప్రయోగముచే నెంటనే మరణించెను.

నరసింగరాజు పుత్రికయు నలరాచమల్లు ధర్మపత్నియునగు రత్నాలపేరాంబ భర్తృమరణమునకు మిగులవిలపించి నాయకురాలియొక్కయు నరసింగరాజుయొక్కయు నలగామరాజుయొక్కయు దుర్నయముల మిక్కిలినిరసించి భర్తృచితిఁలోబడి సహగమనమాచరించి సాక్ష్వలోకమున కాదరణపాత్రురాలయ్యెను. కొలదికాలమునకు నలరాచమల్లుతో గురిజాల కేగిన పరిజనమంతయు మేడపిచేరి విచారకరమగు నలరాచమల్లు మరణము పేరాంబ సహగమనము నాయకురాలు నలగామరాజాదుల దుర్నయములు నామూలాగ్రము బ్రహ్మనాయుడు మొదలగువారికందరి కెరింగించిరి. నలరాచమల్లు తండ్రియు శతవృద్ధునగు కొమ్మరాజు తనయునిమర్మరణమునకు మిగుల శోకించి పుత్రశోకముతో మైమరచి పడుండ బ్రహ్మనాయుడాతని సమీపించి యనేకవిధముల వైరాగ్యోపదేశములఁ గావించి తన కుమారుడును బాలకుడునునగు బాలచంద్రుని యాతని హస్తములయందుంచి యాతనిని నీకు [illegible] కునిగా భావించికొమ్మ్మ నీపుత్రమరణమునకుఁ గారకుడగు నరసి [illegible] జు నీతఁడ వధింపఁగలఁడని పెక్కువిధముల నోదార్చెను. కొమ్మ [illegible] బ్రహ్మనాయనిబోధనముచేఁ గ్రమక్రమముగ శోక [illegible] మమునఁ బగతుర నిర్జించి హృదంతరమును భస్మ [illegible] ధమును తీర్చుకొనవలయునని యువ్విళులూరసాగెను. [illegible] క్కయు నరసింగరాజు నలగామరాజులయొక్కయు [illegible] దాది బ్రహ్మనాయకుని పరిజనమునకు సైనికులకు

బాలమలిదేవాది రాజకుమారులకు సైతమట్టి నిశ్చయమె కలిగెను. ఇఁక బ్రహ్మనాయునియంశము చెప్పనవసరమే లేదు.

బ్రహ్మనాయుఁడు సామోపాయములతో నిఁక లాభము లేదనియు రక్తపాతము జరుగనిది రాజ్యము రాదనియు నిశ్చయించి వెంటనే సైన్యమునకుఁ దోఃప్రియులకు సంగరమున కాయితముగుండని యాజ్ఞాపించెను. శూరవర్యులగు బ్రహ్మనాయుని సహచరులందరు నాయుధములకు మెఱుఁగుఁబెట్టి సంగ్రామమున కెదురుచూడసాగిరి. చుట్టుపట్టులఁ బాలించురాజన్యులు బ్రహ్మనాయుని స్వామిభక్తియు ధర్మసంగ్రామసంరంభమును జూచి కొంత సైన్యమును సహాయముఁగావించిరి. బ్రహ్మనాయుని దైవముగా భావించు పౌరబృందము కిరాతులు పెక్కుమంది విజయకాములై గురిజాలపై దాడివెడల సిద్ధపడిరి. బ్రహ్మనాయుఁడు తనయాప్తులలో నొకనిని మాత్రము మేడపిరాజ్యము నందుంచి యంతఃపురసంరక్షణమునకును మంత్రిత్వమునకును దనయుఁడగు బాలచంద్రుని రాజకీయకార్యముల కనపాతనిఁ నియోగించి వీరనాయకులతోఁ గలసి యొకశుభముహూర్తమున గురిజాలపైకి విజయదుందుభి మ్రోఁగించుచు దాడివెడలెను. సుంకరదామానాయుఁడు కన్నమదాసుఁడు పేర్నీడు మల్నీడు సూర్నీడు మొదలగు శూరవర్యులందరు సంగరరంగమునకు అకు సైన్యమున కగ్రేసరులై యుచితగతి నడపించుచు సంగ్రామధర్మముల బోధించుచు త్రిపురాంతకము మేళ్లవాగు లోనగు చోటుల విడిదిగావించుచుఁ బలనాటిసీమలోని కార్యమపూడిచెంత నుండిన నాగులేరుదరికిఁ జేరిరి. బాలమలిదేవాదిరాజన్యులను దోడ్కొని మంత్రివర్యుఁడగు బ్రహ్మనాయుఁ డాయుధములతో విజయదుందుభినాదములతో సకాలమునకు నాగులేరుతీరమునకు వచ్చెను. బ్రహ్మనాయుని సైన్యము విశాలముగనున్న నాగు ంసుకతిన్నెల చెంత గుడారములువైచి కొంఁదిదినములు విశ్రా ష్టికల బ్రహ్మనాయుఁడు యుక్తాయుక్తములు చూ వలన రానున్న యుభయుల నష్టములగూర్చి విచా గురిజాలపాలకు లంగీకరింతురేమోయని యొకి

భట్టుమ[illegible]ని రాయభారముపంపెను. అతఁడు వెంటనే గురిజాలకేగి బ్రహ్మనా[illegible] సందేశమునంతయు నాయకురాలు నరసింగరాజుముందు నలగామరాజునకు నివేదించెను. కాని దురాశాపీడితులగు నామువ్వురు సంధికంగీకరింపకపోఁగా భట్టుమూర్తిని బ్రహ్మనాయని మిగులదూషించి మేమును సంగ్రామమునకు సర్వసిద్ధముగా నున్నారము. రాయభారములతో నవసరములేదని ఖండితముగాఁ దెలిపిరి. భట్టుమూర్తి చాలతడవు బ్రహ్మనాయకుని పరాక్రమము వీరులసంగ్రామ నైపుణ్యము నాయకురాలిదుస్తంత్రములు పూసగ్రుచ్చినటులఁ దెల్పి సంధికై యనేకవిధములఁ బ్రయత్నించెఁగాని లాభములేకపోయెను. చేయునదిలేక భట్టుమూర్తి బ్రహ్మనాయనిపాలికరిగి జరిగినకథయంతయు వీరలముందు నివేదించెను. బ్రహ్మనాయనితో సంగ్రామమునకువచ్చిన వీరులనామము లీవిధముగఁ జెప్పఁబడెను.

"నామాలవారును నాణెమువారు | కొండ్లవిందులవారు గోవిందువారు
ముతసానివారును ముయ్యూరువారు | సర్మాలవారును నాయనివారు
పైడిచుక్కలవారు పాల్పర్తివారు | బలమూంవారును పాలెమువారు
శేషనూళ్ళలవారు రేచెర్లవారు | నట్లూరిముట్లూరి యాఖ్యలవారు
చెవులవారును మఱిచిల్లరవారు | గుఱ్ఱైననాయకుల్ కూడియేతేర
గండువారేగురు కదిసినవేడ్క | జరిబిరుదులతోడ సాహసంబలర
నొప్పగానిందరు నఱఁ జైనబంట్లు | ఘోటకంబులు మేటికుంజరావళులు
నుత్సాహమున హుటాహుటినడువంగ | భట్టువారలుమించిబహువిధంబులను
బిరుదుపద్యంబులు పెల్లగాఁజదువ | నుద్దండమూర్తులు నొనరనిర్వంక
భై వఖడ్గంబుఁ బట్టుకరాఁగ | శీలమ్మతనయుఁడు సింహవిక్రముఁడు
కరముక్కికనుకుల కన్నమనడచె!"

నలగామరాజు నాయకురాలి ప్రోత్సాహముచే సైన్యమును సంగ్రామమునకు సిద్ధముగావించుటయేగాక సాటివారగు రాజులకందఱకు సైన్యసహాయముకొఱకు లేఖలువ్రాసెను. పలువురు రాజన్యులు సైనికదళమును నాశ్వికదళమును సహాయముగావించిరి. కోటకేతురాజును ధరణికోటపాలకుఁడు సైన్యముతో సహాయమువచ్చి యుభయపక్షములకు సంధి కుదుర్పవలయునని యనేకవిధములఁ బ్రయత్నించి

విఫలమనోరథుఁడయ్యెను. నాయకురాలొక శుభముహూర్తమున నర సింగరాజును నలగామరాజును సైన్యముతోఁ బ్రయాణముఁ జేయించి కార్యమపూడికదనరంగమునకుఁ గొనివచ్చి యొకచో విడిదిచేయించెను. బలసాహసములతో నుభయసైన్యములు సంగ్రామముగావింప సిద్ధముగనుండెను.

బాలచంద్రుఁడు మేడపిలోఁ గాలక్షేపముఁ గావింపఁజాలక తానును సంగ్రామముగావింప నెంచి జననివలన ననుజ్ఞనొంది వీరపత్నియగు మాంచాలయొద్దకేగి తన ప్రయాణమును దెల్పి యామెవలన నాశీర్వాదపురస్సరముగ నొక కరవాలముబడసి సంగరరంగస్థలమగు కార్యమపూడికిఁ జేరెను. అప్పటికి రాయబారములన్నియు ముగిసి సంగ్రామము జరుగసిద్ధముగా నుండెను. కార్యవేదియగు బ్రహ్మనాయఁడు దూరమాలోచించి రణరంగమున రక్తాంజలి నొసంగ నెంచిన వీరవర్యుల నందఱకు సమయోచితముగ ధర్మములనెఱింగించి యాప సాగెను. బాలచంద్రుఁడు శీఘ్రముగ సైన్యములోఁ జొచ్చి మధ్యనున్న రాజశిబిరము చెంతకేగి సంగరమున కాయితముకారేలయని కఠినముగ మందలించి రణదుందుభి మ్రోగింపుమని వీరభటుల కాజ్ఞయొసంగెను. బ్రహ్మనాయుని యాజ్ఞకొఱకువేచి భటులెవ్వరు వీరదుందుభి మ్రోగించుటకు సంగ్రామమున కుఱుకుటకు నాయితముకారైరి. బాలచంద్రుఁడు చాలఁగినిసి తనపరిజనము సంగ్రామ విముఖముగానున్నటుల భావించి పేరుపేరువరుసల వీరులఁ బేర్కొని యిట్లు ప్రోత్సహింపసాగెను.

"కొమ్మరాజా నీవు కోపంబుమాని | తీఱనిసుద్దులఁ దెగఁ జాలెదేల
ధనువుశింజినిలాగి ధ్వనిఁజేసి తేని | బ్రహ్మాండభాండముల్ పగిలినట్లుండు
నెనలేని విలుకాఁడ పటుపంటినీవు | తనయునిచావుకుఁ గాశ్వదవెట్లు
ఆవాలనాయఁడా! అప్రుడుపంతములు | పలికినపేవేల పరవశుఁడైతి
తలపోయఁగా వీరధర్మంబుమఱచి | నిద్రించుచుండుట నీకుయోనీకు
విముఖతలేనట్టి వీరుఁడవీవు | కట్టినాఁడవు కాసెపట్టితిగత్తి
పగయీడలేనట్టి పౌరుషమేమి | మితిమూఁడునెలలాయె మిన్నకున్నావు
నీవంటిజగజెట్టి నేఁజూడలేఁప | మామకన్నమనీడ మగటిమియేది
కపిలనికంబంబు కాలిసంకెలలు | పొంగించినావుకై పూనినిల్చితివి

కంబంబు చెదలంటెఁ గదలించి మాడు । సుంకర రాముఁడా చుట్టుకొంకెనలు
తుప్పులుపట్టెను దొడరవదేల । చెవుల నాయకులార చెలఁగెడిబంటు
లిచ్చగించరుమది నెంగిలిపోటు । మేటికూరుల నాజి మెచ్చరియట్టి
నమ్మనజంగిలి నాయకులార । తగుజల్లివేడముల్ దండచక్రములు
పోఁగొట్టుకోరయ్య పోరుమీకేల । వీరయోధులుగదా పెనుమాలవారు
గాయగోవాళాఖ్యగల బిరుదములు । పగతురుగనకుండఁ బాతుఁడీస్వామి
బాదన్న రాహుత్తపాటవమేడ । సంపెటనాగన్న జయముగుబిరుద
మెక్కడకేగె నీవెందుదాఁగితివి"

బాలచంద్రుఁడు వీరుల నుద్దేశించి యిటుల మాటలాడుసరికి రోషావేశమున వారందఱు మేనులుమఱచి కదనరంగమునకు అరుటకు సంసిద్ధులైరి. దిక్కులన్నియు సైనికుల యట్టహాసములచేఁ గంపింపసాగెను. వీరచూడామణియగు తనయునిగాంచి ధన్యుఁడనైతినని బ్రహ్మనాయుఁడానందించి బాలచంద్రునిగొనివచ్చి తనయర్థసింహాసనమునందుంచి యనేకవిధముల గారవించి బుజ్జగించెను. బాలచంద్రుఁడు వెంటనే జనకునివద్ద నాజ్ఞనొంది వీరవేషముధరించి నిశితకరవాలమును గేలనలంకరించి కొంతసైన్యమును వెంటఁగొని కదనరంగమునకుఁ బ్రయాణము కాసాగెను. వీరులందఱు బాలచంద్రుని సంగరసంరంభములకు విముఖులై యీవిధముగ మందలించిరి.

" వలదు బాలుఁడ పిన్నవాఁడవునీవు । పన్నుపుఁబనికాదు సమరకార్యంబు
దళమువిస్తారంబు తెగదుశౌర్యంబు । పడుచువాఁడవునీవు పటిమకొంచెంబు
వలనొప్పశీలము వారందఱికిని । సంతానమేలేకసంతోషమెడలి
పండ్రెండువర్షాల పరిమితిగడచె । మాచర్లచెన్నునిమన్ననబడసి
యైతేఁబనినుగనె నధికమోదమున । సంతతివృద్ధియైజరుగఁగనిమ్ము
సమరంబునకునేగు సాహసమేల । మీతలిదండ్రుల మిగులమన్నించి
మమ్మాదరించియు మామాటవినుమ"

కాని బాలచంద్రుఁ డావాక్యములువిని నిరుత్సాహపడక తాను బాలకుఁడయ్యుఁ బరాక్రమమునఁ బెద్దవారలకుఁ దీసిపోవననియు శౌర్యసాహసములలోఁ బెద్దచిన్న భేదమవసరములేదనియు శూరులందఱకుఁ బ్రత్యుత్తర మొసంగెను. కొమ్మరాజు పరాక్రమవిక్రమశాలియగు

బాలచంద్రుని బుజ్జగించి ప్రత్యర్థులపైకిపుడు పోవఁబోలుకాదనియుఁ దరుణమురాఁగలదనియు నలరాచమల్లు మరణముచే దురపిల్లు నన్న మన్నించి ప్రత్యర్థులఁ దునిమి పుత్రశోకము మఱపింపవలయుననియు బ్రతిమాలెను. ఇంతలో నుభయులరణదుందుభులు మ్రోఁగెను.

బ్రహ్మనాయఁడు సంగరమునకు విజయదుందుభి మ్రోఁగింపఁగనే యుత్సాహసమేతులై సైనికులందఱు గుమిగూడిరి. బ్రహ్మనాయఁ డందఱఁబిల్చి సమీపముననున్న యొకపాముపుట్టపై వీరతాంబూలముంచి దానిని ముందు గ్రహింపువాఁడెవఁడో యాతఁడె ప్రథమమున సంగ్రామరంగమునముందు దురముచేయనర్హుఁడని యానతిచ్చెను. శూరులందఱు వెనుదీయక యుత్సాహముతోఁ బుట్టసమీపమునకేగ నందుండి యొకకృష్ణసర్పము బుస్సుమని పైకిరాఁదొడంగెను. శూరులందఱు వెనుకకుఁ దగ్గసాగిరి. బాలచంద్రుఁడు ధైర్యముతో నాపామును లక్ష్యపెట్టక తాంబూలమును గ్రహించెను. బ్రహ్మనాయఁడు తనయుని పరాక్రమాదికముల కానందించి కౌఁగలించి ప్రథమసంగరమున కాజ్ఞయొసంగెను. అభిమన్యుకుమారునికిఁ దీసిపోని బాలుఁడు సింహనాదముగావించుచు రెండువేల యాశ్వికదళమ్మునకు మూఁడువేలరధికులకు రెండువేలధనుష్మంతులకు రెండువేల శూలపాణులకు వేయి గజసైనికులకు రెండువేల కృపాణహస్తులకు నాయకుఁడై సంగరరంగమునఁ బ్రవేశించి ప్రతిపక్షులకెదురుగ నడువసాగెను.

బాలచంద్రుఁడు విజయదుందుభి నాదములతో శూరవర్యులతో సంగ్రామరంగమునఁ బ్రవేశించి ప్రతిపక్షసైన్యముపైఁ గవిసెను. ఉభయసైన్యములకు ఘోరమగు సంగ్రామము జరిగెను. గురిజాలపక్షము వారిసైన్యమును నరసింగరాజు నడపించుచుండెను. బాలచంద్రుఁడు సాహసముతో సైన్యమును విజృంభింపఁజేసి దురముఁజేయించుచుండఁ బ్రతిపక్షసైన్యమంతయు భిన్నభిన్నమై నలుదెసలకుఁ బాఱిపోయెను. బాలచంద్రుఁడు పాఱిపోయిన సైన్యమును దఱుముటమాని చెంతనున్న యొక ప్రతిపక్షవీరుని నరసింగరాజుగ భావించి యాతని యుత్తమాంగ

మును జెండి బల్లెమునకుగుచ్చి నూరేగింపుచుఁ గొనివచ్చెను. జనకుఁడు కొమ్మరాజు మొదలగువీరులందఱు నాశిరమునుజూచి నరసింగరాజు తలకాదని నిశ్చయించిరి. బాలచంద్రుఁడు తన తొందరతనమునకు మిగులఁ జింతించి పరిజనులవలన నరసింగరాజు పోలికయంతయు విని మఱల సంగ్రామరంగముఁ జేరెను. పాఱిపోయిన సైన్యమును మఱికొంత నూతనసైన్యమును వెంటఁబెట్టుకొని నరసింగరాజు రణభూమికవతరించి తీవ్రముగ బాలచంద్రుని బ్రతిఘటించెను. బాలచంద్రుఁడు మిగులఁ బట్టుదలతో విరోధుల సేనలనన్నింటి దునుమాడుచు మృత్యుముఖమునబడెనన్న విరోధివ్యూహమును జించిచెండాడుచు ముందునకేగి యుత్తుంగమగు గజము నారోహించియున్న నరసింగరాజు పైకిదూకి యాతని గ్రిందికిలాగి యుత్తమాంగముఁ ఖండించి కరవాలాగ్రమున దానినిజేర్చి జయజయనినాదములు గావించుచుఁ బితృసన్నిధికేగెను. బాలచంద్రుని సాహసమునకు బ్రహ్మనాయుఁడు కొమ్మరాజు బాలమలిదేవాదులానందించి నరసింగరాజు మరణమునుగూర్చి విచారమును వెలిబుచ్చిరి.

నరసింగరాజును జంపుటతోఁ దనభారము తీఱలేదని బాలచంద్రుఁడు మఱల సంగ్రామరంగమున కేగెను. నరసింగరాజు మరణించెనని విని నాయకురాలు పరితపించి హతశేషమగు సైనికులను దాను నడపించుచు బాలచంద్రుని బ్రతిఘటించెను. బాలచంద్రుఁడు సోదరుల సహాయముతోఁ జాలసేపుపోరాడి సంగ్రామరంగమున వీరమరణము నొందెను. నాయకురాలావార్త వినంగనె మిగులనానందించి వెంటనే యావర్తమానమును నలగామరాజునకుఁ దెలియఁజేసి గొప్ప యుత్సవముఁ జేసెను.

బాలచంద్రుని మరణవార్త వినఁగనె బ్రహ్మనాయునికి మితిలేని కోపమువచ్చి యిట్టి పుత్రునిమృతికిఁ గారకులగు విరోధులఁ జెండాడుటయే నాకర్తవ్యమని సంగ్రామరంగమున కుఱికెను. కొమ్మరాజుగూడ నాయనివెంటనే బయలువెడలెను. సైనికులందఱుటలేని యావేశముతో యుద్ధరంగము నలంకరింపసాగిరి. బ్రహ్మనాయుఁడు తన సైన్య

మును నాలుగుభాగములుగావించి రేచెర్ల పేర్నీడు గండుకన్నమనాయఁడు సుంకర దామానాయఁడు సూర్నీడు లోనగు నలువుర సేనానాయకులనుగా నియోగించి సంగ్రామమునకుఁ బ్రేరేపణముఁజేసెను. నాయకురాలు నడుపుచున్న విరోధసైన్యమును సేనానాయకులందఱు తమతమ సైన్యములతో మిగుల సాహసముగమట్టడించి రణరంగమునంతయు రక్తప్రవాహములతో నచిరకాలమున నింపివేసిరి. ఉభయుల సైన్యముల కింతయనరాని నష్టముకలిగెను. పేరినీడు సన్నికండ్లవద్దను మాలకన్నమనాయఁడు తన నలువురు సోదరులతోఁగూడఁ జింతపల్లి వద్దను వీరమరణమునొందిరి. ప్రతిపక్షసైన్యము చాలవఱకు నుసుమాడి చివరకుఁ గొమ్మనాయఁడుగూడ రణరంగమున నొరగెను.

బాల్మలిదేవాదులంతకుమున్నె మరణించిరి. ప్రతిపక్షసైన్యమంతయు నాశనమయ్యెను. గండుకన్నమనాయఁడు సంగరరంగమున ఒక్కమాలి యొంటరిగనున్న మహాకాళీస్వరూపియగు నాయకురాలిని బంధించికొనివచ్చి బ్రహ్మనాయకుని ముందుంచెను. అసహాయుఁడై నలగామరాజు ప్రాణభీతితో బ్రహ్మనాయుని శరణుఁగోరెను. దయార్ద్రహృదయుఁడగు బ్రహ్మనాయఁడు నలగాముని నాయకురాలిని క్షమించి స్వరాజ్యనాశనమునకుఁ బరితాపమునొంది విరాగియయ్యెను.

బాలచంద్రుఁడు కొమ్మరాజు మలిదేవరాజాదులు సైనికులు వీరమరణమొందుట చే బ్రహ్మనాయని హృదయముసీరయ్యెను. తాను మాచర్లరాజ్యముగడించి యేరాజపుత్రులకుఁ బట్టాభిషేకము గావింప నెంచెనో వారందఱు వీరమరణమునందుటచే బ్రహ్మనాయని శ్రమయంతయు విఫలమయ్యెను. కానకగన్న కసుగందగు బాలచంద్రుఁడు రణరంగమున నిహతుఁడయ్యెను. ఇంతటి ప్రళయమునకు గారకురాలగు నాయకురాలిని నలగామరాజును జూచువఱకు బ్రహ్మనాయని హృదయము విరాగమువహించెను. పల్నాటిరాజ్యమునంతయు వారలకె విడచివేసి బ్రహ్మనాయఁడొక శుభముహూర్తమున వీరవర్యులెందఱు మరణించిన నాగులేటితీరమునఁ బ్రాయోపవేశముగావించి పరలోకము నలంకరించెను. కన్నమదాసుఁడుకూడ మరణించెను. కావ్య

శిష్టప్రియుఁడగు బ్రహ్మనాయకుఁడు మరణించుటచేఁ బలనాటిసీమ యొక్క యమూల్యమగురత్నమును గోలుపోయెను. దైవాంశసంభూతుఁడగు బ్రహ్మనాయుఁడు మంత్రిత్వమున జూపినత్యాగ మనన్యసామాన్యమైనది.

బ్రహ్మనాయనిశాంతము సత్యప్రీతికార్యకౌశలమును జర్చించి యాతనిని బల్నాటికృష్ణుఁడనియు భగవదంశసంభూతుఁడనియుఁ బ్రజలుతలంచుచున్నారు. బలనాటిసీమనంతయు నేకచ్ఛత్రముగఁ దనమంత్రిత్వముక్రిందఁ బరిపాలించి నాయకురాలిదుర్న్యయముచే విరాగియైన యీమహాత్మునిజీవితమున నాచరణయోగ్యములగు ధర్మరహస్యము లనేకములుగలవు.

పలనాటిసంగ్రామము క్రీ. శ. ౧౧౮౦ ప్రాంతములలోఁ జరిగినటుల జరిత్రకారులభిప్రాయపడుచున్నారు. పలనాటి వీరవర్యులు వీరమరణమునొందిన పుణ్యస్థలమగు కార్యమపూడి గుంటూరుమండలములోని నరసరావుపేటకుఁ బశ్చిమమున ౨౮ మైళ్ళదూరములోనున్నది. బ్రహ్మనాయఁడు కార్యమపూడిసంగ్రామముపూర్తికాఁగానేవిరాగియై సమీపముననున్న (గుచ్చాద్రి)గుత్తికొండ బిలమునకుఁ దపముఁజేసికొనుట కేగెననియు నిప్పటివఱకుఁ జిరంజీవియైయుండెననియు నాప్రాంతములలోనివారు భక్తివిశ్వాసములతో విశ్వసించుచున్నారు. పలనాటిపేరులయుద్ధము ముగియఁగనే యటనున్న పిడుగుమంత్రిప్రగాడు వీరపూజలు గావించుచు వార్షికోత్సవములతో వీరులమరణము స్మరణమునకుఁ దేసారెను. నాఁడుమొదలు నేఁటివఱకుఁ గార్యమపూడిలోని పిడుగువారను నియోగులు రేచర్ల బ్రహ్మనాయని ముద్రికర్తలను బిరుదనామము వహించి పరంపరగ వీరపూజలు మిగులశ్రద్ధాభక్తులతోఁ గావించుచున్నారు. వీరవర్యుల జీవితచరిత్రములు పలువురాంధ్రకవులు ద్విపదలుగవ్రాసిరి. నిమ్నజాతులవారు వీరనాదములతోఁ బండితపామరప్రీతికరముగ నాకథాగానముఁ జేయుచున్నారు. వీరకథ ద్విపదగవ్రాసినవారిలో శ్రీనాథకవియొకఁడు.

కార్యమపూడిలోఁ బలనాటివీరులపూజ మిగులవైభవముతో జరుగుచున్నది. ఆకాలపు యుద్ధస్థితులు తెలిసికొనఁదలఁచు వారీయుత్సవకథనము వినఁదగును. దూరదేశములనుండి పలువు రీయుత్సవసందర్శనమున కేతెంచుచున్నారు. కార్తీకపూర్ణిమనాఁడు రంగస్థలములో నెఱ్ఱజెండా నెత్తుదురు. ఆనాఁడే నలుదిక్కులవారికి సంగ్రామమునకు సైన్యసమేతులై రమ్మని జాబులువ్రాయుదురు. అమావాస్యనాఁడు రాచగావు మఱునటిదినము కల్లిపాడు మూఁడవదినము మందపాడు నాలవదినము కోడిపోరు ఐదవదినము కల్లిపాడున నుత్సవముల గావించుచున్నారు. మూఁడవనాటి యర్ధరాత్రమునఁ బౌరు లొసంగు బియ్యములోనగు వస్తువులతో నన్నమువండి రక్తముతోఁ గలిపి వీరాలయసమీపమున దిగంబరులై రణబలియొసఁగి పూర్వధర్మములను పాటించుచున్నారు పలనాటివీరుల దివ్యచరిత్రము నుత్సవమూలకముగఁ బ్రత్యక్షముగ సందర్శించుచు గానరూపమున నాలకించుచు నాంధ్రు లానందించుచున్నారు. భాంతీయకుటుంబములలో వీరులపూజయు బాలురపూజయు నేటికిఁ బ్రాయికముగ జరుగుచున్నది. ఆంధ్రవ్యక్తుల పవిత్రజీవితముల వెల్లడించు నీయుత్సవముల నభివృద్ధిలోనికిఁ దెచ్చుటయుఁ గథాగ్రంథములు విరివిగఁ బ్రకటించుటయు నాంధ్రమహాజనుల కర్తవ్యము. కార్యమపూడి సంగ్రామక్షేత్రమును గాశిగా నొకానొక కవి యీక్రిందివిధముగ వర్ణించియున్నాఁడు.

"ఉ॥ వీరులు దివ్యలింగములు; విష్ణువు నాయఁడు; కల్లిపోతరా
జారయ భైరవుండు; తుహినాద్రిజ అంకమ; నిర్మలాంబునై
పేరెడు గంగ భాగమడుగే మణికర్ణిక; యన్నిభంగులన్
గారెమపూడి పట్టణము కాశిసుమీ కనుఁగొన్నవారికిన్ ॥"

# తిక్కన సోమయాజి.

"సీ॥ సరసకవీంద్రుల సత్ప్రబంధములొప్పఁ గొమనను టధికకీర్తనకుఁగారువు
లలితనానాకావ్యములు చెప్ప నుభయభాషలయందు ననుట ప్రశంసప్రోవ
యర్థిమై పెక్కండ్ర కగ్రహారంబులుఁగా నిచ్చుననుట సౌగద్దసాలను
మహితదక్షిణలైన బహువిధయాగంబు లొనరించుననుట వర్ణనము గాని

తే॥ గీ॥ పరుని కొక్కని కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజములై పెంపు సొంపారి నెగడునట్టి
కొమ్మనామాత్య తిక్కనకొలఁది సచివు
లింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు?"

—దశకుమార చరిత్రము.

ఆంధ్రకవులలో నాయకుఁడు నాంధ్రమంత్రులలో శిరోభూషణుఁడు నగు దిక్కన సోమయాజి జీవితము మిగుల పవిత్రతమము. సుప్రసిద్ధుఁడగు నీ మహాత్ముని పావననామము నెఱుఁగని యాంధ్రుఁడు లేఁడు. కవితావిషయముననె గాక నీ మహామహుఁడు రాజ్యపాలనమునసైత మెక్కుఁడనుభవము గలవాఁడై మిగుల ప్రసిద్ధిఁగాంచెను.

## తిక్కన సోమయాజి వంశము.

"సార కవితాభిరాము గుంటూరువిభుని
మంత్రిభాస్కరు మత్పితామహుని దలఁచి"

అని తిక్కనసోమయాజి తన పితామహుఁడగు భాస్కరుని ప్రశంసించియున్నాఁడు. భాస్కరరామాయణము రచింప నారంభించిన భాస్కరమంత్రి యీతఁడేయని చరిత్రకారులు కొందఱు విశ్వసించుచున్నారు. పృథ్వీశ్వరమహారాజు చందవోలు రాజ్యస్థానముగఁ జేసికొని యాంధ్రదేశమునంతయు నేకచ్ఛత్రముగఁ బరిపాలించు తరుణమున భాస్కరమంత్రి యాఱువేలనాడని వ్యవహరింపఁబడు గుంటూరు మండలమునకుఁ బ్రతినిధిగ సర్వస్వాతంత్ర్యసముపేతుఁడై పరిపాలింప సాగెను. ఈతఁడు గౌతమసగోత్రుఁడు. నియోగివంశాలంకారుఁడు.

కొమ్మనదండనాయకుఁ డీతనిపుత్రుఁడు. ఈకొమ్మన, దండనాథుఁడై గాక సాంగవేదపఠనము గావించి సర్వవిద్యలలో నారితేఱి శ్రౌత బ్రాహ్మణ్యధర్మముల కవలంబనుఁడై యాంధ్రులలో మిగులఁ బ్రశంసాపాత్రుఁడయ్యెను. ఆంధ్రలోకమార్తాండుఁడగు తిక్కనసోమయాజి యీకొమ్మనదండనాయకునకుఁ బుత్రుఁడై యుభయకులపవిత్రుఁడై వెలసెను. కొమ్మన తనజీవితము నెచటగడపెనో, యేయేమహాత్కార్యము లాచరించెనో, తిక్కనామాత్యుఁ డెచటజనించెనో తెలిసికొన నాధారములు కానరావు. కాని తిక్కన బాల్యమునుండి నెల్లూరి యందె యున్నటు లూహింపవచ్చును. ఈ నెల్లూరినె విక్రమసింహపుర మందురు. తిక్కన యిటనే తనబాల్యావస్థ గడపి విజయలక్ష్మికిని, సరస్వతికిని రంగస్థలమగు యౌవనమున మిగులఁ బ్రశంసాపాత్రుఁడై యనేక వీరోచితధర్మముల నెఱవేర్చెను.

తిక్కన బాల్యముననె సర్వవిద్యలలో నిరంకుశమగు ప్రవేశము నార్జించెను. కావుననే దశకుమారచరిత్రములోఁ గేతనకవి తిక్కనను బ్రశంసించుచు "వేదవిద్యాపాలకుఁడనియు సకలవిద్యా చణుఁడనియు వేదత్రితయాత్మకుఁడనియు, సకలాగమార్థతత్త్వవిచారుఁడనియు, యాగవిద్యాభిరాముఁడనియు, సువచస్సమగ్రతా చతురాస్యుఁడనియు" విశేషణము లుపయోగించి యున్నాఁడు. సత్యబద్ధములగు నీ విశేషణోక్తులచేఁ దిక్కనమంత్రి సర్వవిద్యాపారంగతుఁ డనియు శ్రౌతధర్మములయం దభిమానముఁ గలవాఁడనియు వేదము నంతయు వల్లించినవాఁడనియుఁ దెలియును. తిక్కన బాల్యముననె యుపనీతుఁడై గురుకులవాసమొనర్చి పవిత్రమగు పెన్నాతరంగిణీతీరమున సహాధ్యాయులతోఁ బాఠములు వల్లించుచు సర్వశాస్త్రములు పఠించెను. తిక్కనసాహిత్యము నిరంకుశమైనది. సంస్కృతాంధ్రవాఙ్మయములలో నాతనికి నిరర్గళమగు కవితాధారకలదు. ధర్మశాస్త్రములయందు రాజకీయతంత్రగ్రంథములయందు వేదములయందు సంపూర్ణప్రవేశము కలదు. సుందరాకారుఁడు అమోఘమగు వాగ్ధోరణి గల

వాఁడు. ఇంతియకాక మంత్రిభాస్కరునకుఁ గొమ్మదండనాథునకు సర్వవిషయములలోఁ బయిచేయి యనఁదగినవాఁడు. ఆగర్భశ్రీమంతుఁడు. సంతతాన్నదానచణుఁడు

సర్వసుగుణాభిరాముఁడగు తిక్కనప్రశస్తి విని యాకాలమున విక్రమసింహపురమును బాలించు మనుమసిద్ధియను సూర్యవంశనరపాలకుఁ డానందించి తన రాజ్యభారమును నిర్వహించుటకై మంత్రిగ నియోగించెను మహాత్ముల కున్నతదశ లభించువఱకు జ్ఞానతేజము సర్వతోముఖముగఁ బ్రజ్వరిల్లఁ జాలదు. తిక్కనమంత్రికి మనుమసిద్ధనరపాలకుని యవలంబనము లభించుటచే నాంధ్రవాఙ్మయము ధన్యత్వమొందెను. తనకుఁగల క్షాత్రధర్మానుభవము రాజకీయధర్మ విజ్ఞానము సుప్రసిద్ధములగు నున్నతభావములు బాహ్యారంగమునఁ బ్రదర్శింపఁ దిక్కన కదన మొదవెను.

## మనుమసిద్ధి రాజ్యవిషయము.

ఆంధ్రరాజులలోఁ జోళరాజులు మిగుల సుప్రసిద్ధులు. పూర్వమాంధ్రదేశమును ద్రవిడదేశమును జోళులు పరిపాలించుచు ముఖ్యస్థానములలో సామంతుల నుంచి వారిచే రాజ్యధర్మములు నిర్వహింపఁ జేయుచు వచ్చిరి. అట్లు సామంతులుగ నియోజింపఁబడిన వారలలోఁ దిక్కరాజొకఁడు. ఈతఁడు మిగులఁ బరాక్రమశాలి. అనేక ఘోరసంగ్రామములలో నిల్చి విజయము గడించి యాంధ్రదేశమునఁ బ్రతిష్ఠ గడించెను. తిక్కరాజువిజయము లసామాన్యములైనవి. బాల్యముననే యోధవేషధారియై కదనరంగమున నాజతేజసవీరునివలె విజృంభించి సంచరించి వేగిదేశమును బాలించుచున్న పృథ్వీశరాజును వధించెను. విక్రమశాలియు వీరవర్యుఁడు నగు నీతిక్కరాజు, చోళభూపాలకుని రాజ్యమునంతయుఁ గర్ణాటదేశపాలకుఁడగు సోమభూపతి హరించి విజృంభింపఁ బ్రతిఘటించి ఘోరమగు యుద్ధము గావించి సోమేశ్వరుని నిర్జించి తిరిగి [illegible] చోళుల [illegible]

పనాచార్య బిరుదము నందెను. ఇంతియకాక "లకుమయ్య, శంభురాజు, కాళవరాజు" లోనగురాజన్యులను జెండాడి స్వతంత్రశీలుండై జీవించెను. క్రమముగఁ దిక్కరాజు బలమును రాజ్యమును నభివృద్ధి పఱచుకొని పరులకు సామంతుండై యుండనోపక స్వతంత్రరాజయ్యెను. అతివిస్తృతము బలసమన్వితము శత్రుజనాభేద్యమునగు విక్రమసింహపురసింహాసనము తిక్కరాజు తన పుత్రుఁడగు మనుమసిద్ధి భూపాలున కొసంగి తిక్కనామాత్యుని మంత్రిగా నియమించి వార్ధకమునఁ గొంతకాలము కుమారునికి బాసటమైయుండి దేహము చాలించెను.

## మనుమసిద్ధి శీలాదికము.

మనుమసిద్ధిభూపాలుని సిద్ధిరాజనిసైతము వ్యవహరింతురు. సిద్ధిరాజు సత్యభాషియై ధర్మస్వరూపుఁడై పితృదత్తమగు నాత్మరాజ్యము దిక్కనమంత్రివర్యుని కౌశలమును సహాయముగ నాధారముఁజేసికొని పాలింపఁదొడంగెను. తిక్కరాజు ధర్మములను బాలింపుచుఁ బ్రజాహితమును లక్ష్యమునం దుంచికొని రాజ్యపాలనము నెఱపు మనుమసిద్ధిని పౌరులు శ్రీరాముఁడని ప్రశంసింపసాగిరి. కేతనమహాకవి మనుమసిద్ధినిటుల దశకుమారచరిత్రమునఁ బ్రశంసించి యున్నాఁడు

"సీ॥ వీరారివర్గ విదారణక్రీడ నద్యతన జగత్ప్రాణసుతుండనంగఁ
బరధనదారాపహరణానభిజ్ఞత నూతన గంగాతనూజుఁడనఁగ
నర్థార్థిజనవాంఛితార్థ సంపూర్ణవితీర్ణి నభినవకర్ణుఁడనఁగఁ
గామినీచిత్తాపకర్ష కారణశుభాకారసంపద వింతకంతుఁడనఁగ
ఆ॥ వె॥ ధీరతాగరిమను మేరుమహీధర మన
గభీరవృత్తి నబ్ధియనఁగ
వెలసె వైరిరాజ వేశ్యాభుజంగాంక
భూషితుండు తిక్కభూవిభుండు॥"

మనుమసిద్ధి భూనాయకుని పరాక్రమము, పరకాంతా పరాఙ్ముఖత, ఔదార్యము, సౌందర్యము, ధైర్యము సౌజన్యాదులు

Ottibomulu Venkata Subba Rao.
V form
తిక్కన సోమయాజి. రగ్
Board High School. Gannavaram

వేనోళ్ల శ్లాఘించుచున్నది. ఇట్టి సర్వశుభలక్షణ లక్షితుఁడగు నరపాలకుని చేఁత మంత్రియై పండితుఁడై చెలికాఁడై ప్రవర్తించిన తిక్కన మంత్రిభాగ్య మనన్యలభ్యము. తిక్కనమంత్రిని మనుమసిద్ధి గౌరవముతోఁ దిలకించుచు "మామా" యని వరుసతోఁ బిలచువాఁడఁట. దీనిచేఁ దిక్కనమంత్రి, రాజుకంటె వయోవిషయమునసైతము వృద్ధుఁడై యుండెననట నిశ్చయము. తిక్కనమంత్రి యితరకవులవలెఁ గవితోపజీవి కాఁడు. పరుల నాశ్రయించి బ్రతుకవలసిన యవసరము కలవాఁడు కాఁడు. నిరంకుశుఁడు, స్వాతంత్ర్యశీలుఁడు. ఈ స్వాతంత్ర్యశీలుఁడగు తిక్కనమంత్రిని సవినయముగ రాజొక కృతి నిమ్మని ప్రార్థించెను. ఆ ప్రార్థనము యుక్తియుక్తముగ నుంటచేతను రసికుఁడగు ప్రభుని యభిమతముఁ దీర్చుట కర్తవ్యమగుటవలనను "నిర్వచనోత్తర రామాయణ" మను నుత్తమగ్రంథమును రచించి యంకితముఁ గావించెను. సర్వైశ్వర్య సంపన్నుఁడగు నీకవి, కృతిని ప్రతిఫలము నొందుటకై యొసంగియుండఁడనియు రాజాభిమతముఁ దీర్చుట తనవిధియగుటచే నటులఁ గావించెననియు విశ్వసించుటకుఁ దగునాధారము నిర్వచనోత్తర రామాయణమునఁ గానవచ్చుచున్నది.

"కం। ఏ నిన్నుమామ యనియెడు దీనికిఁ దగనిమ్ము భారతీకన్యక నా
కీవర్హుఁడవగుదనినను భూనాయకుపలుకు చిత్తమున కింపగుడున్."

రాజుచేఁతగల యభిమానఋణమును దిక్కనమంత్రి కృతిప్రదానముచే సంపూర్ణముగఁ దీర్చికొనెను. తిక్కనవంటి కవీశ్వరునిచేఁ గృతినొందుటచే మనుమసిద్ధిభూపాలకునిజన్మము పావనమయ్యెను. సర్వవిభవాభిరాముఁడగు తిక్కనమంత్రిప్రశస్తి దిగంతరములలో వ్యాపించెను. దాతలలో దాతయుఁ, గవులలోఁ గవియు నగు తిక్కనచేఁ బరిష్కృతమైన గ్రంథము వ్యాసప్రోక్తమువలె సుప్రసిద్ధమై యలరారసాగెను. రాజ్యతంత్రధురీణుఁడగు తిక్కనమంత్రి మాతృభాషాభిమానము పురస్కరించకొని నిర్వచనోత్తర రామాయణము, విజయసేనము మొదలగు గ్రంథములు రచియించి కవిలోకము నలంకరించి

విఖ్యాతుఁ డగుటయే గాక కవుల ననేకులకు వృత్తులొసంగి విద్యా వినోదములతోఁ గాలక్షేపముఁ జేయుచుండెను. ఆంధ్రకవులలో నైశ్వర్య వంతుల నేకులుగలరు. కాని వారలందఱు పరశ్రేయమునకు సహించువా రుకారు. ఇతరుల కవితను శ్లాఘించువారు కారు. ఇట్టిలోపము తిక్కన మంత్రియందుఁ గానరాదు. బయ్యనామాత్యుని కవితాచాతుర్యమునకు హర్షించి "భవ్యభారతి" యనుబిరుదము నొసంగిన దీమహానుభావుఁడే. విద్వత్ప్రభువని పేరునొంది తిక్కనమంత్రి పండితమండలికిఁ గల్పభూ రుహమువలె కామితప్రదుఁడై యలరారుచుంటచేఁ గవిరాజు లనేకులు విక్రమసింహపురమున కేతెంచి తిక్కనమంత్రిచే గౌరవము లంద సాగిరి. అట్టి యాగంతుకులలోఁ గేతనకవి యొక్కఁడు. కేతనకవి తిక్కనమంత్రి కెటులేని యాచకత్వమాచరించి కుక్షి పోషించుకొనవల యునని వచ్చిన యాచకుఁడుగాఁడు. తిక్కనమంత్రిచే సగౌరవంబుగ నాహూతుఁడైన వేఁగిదేశనివాసియు 'విప్పర్ల'ను నగ్రహారస్వామియు నధ్యయనపరుఁడును సంస్కృతాంధ్రాద్యనేక భాషాకవియునగు మూల ఘటిక కేతనకవీశ్వరుఁడు విక్రమసింహపురమున కరుదెంచెను. తిక్క నమంత్రిచే సగౌరవముగ నభినవదండి బిరుదాంకితుఁడైన కేతన కృతిరచ నమునకుఁ బ్రేరేపితుఁడై తనశక్తినంతయు వినియోగించి దశకుమార చరిత్రమును రచించి కృతినొసంగెను. తిక్కనామాత్యుని కులశీలాదిక ము లాగ్రంథము సహస్రముఖముల వాకొనుచున్నది. కవిరాజశిరోమ ణియగు తిక్కనామాత్యుని గుణగణముల నన్నింటి కేతనకవి పొగడి చరితార్థుఁడైనాఁడు. కేతనవంటికవియే ప్రశంసింపఁబడెనేని యాత్మస్తుతి విముఖుఁడగు తిక్కనమంత్రిజీవితము మనముపఠించి హర్షించుభాగ్యము లేకపోయెడిది. తిక్కనామాత్యుని చరిత్రస్మరణముచేఁ గేతనజీవితము ధన్యమయ్యెను. తిక్కనయంతకవికిఁ బ్రేమపాత్రుఁడై సగౌరవంబుగఁ గృ తిరచనమునకుఁ బ్రేరేపితుఁడయ్యెఁగానఁ గేతనకవి యెంతవాఁడో నిరూ పించుట సులభసాధ్యముకాదు. ఈయంశమును గేతనయే తనగ్రంథ మున నిటులఁ జెప్పికొనియున్నాఁడు:

"తే॥ గీ॥ కవితఁజెప్పి యుభయకవిమిత్త్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
బరగు దశకుమారచరితంబుఁ జెప్పిన
ప్రోడ నన్నుఁ వేఱఁ బొగడ నేల॥"

(ఆంధ్రభాషా భూషణము.)

కేతనమహాకవిశక్తిసామర్థ్యములను దూమటకు వచనకుఁ దిక్కనామాత్యుఁడు పడికట్టుతాయి యైనాఁడు. తిక్కనమంత్రి యాకాలమున సరస్వత్యవతారమువలెఁ గల్పవృక్షమువలె దైవసమానునివలెఁ బూజింపఁబడెననుటకుఁ గేతనయొనర్చిన ప్రశంసాపద్యములే యాధారములు కాఁగలవు.

"సీ॥ సుకవీంద్ర బృందరక్షకుఁడెవ్వఁడనిన వీఁడను నాలుకకుఁ దొడవైనవాఁడు
చిత్తశుద్ధిస్థిత శివుఁడెవ్వఁడనిన వీఁడనుశబ్దమున కర్థమైనవాఁడు
దశదిశాక్రాంతయశుఁ డెవ్వఁడనిన వీఁడనిచెప్పుటకుఁ బాత్రమైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁడెవ్వఁడనిన వీఁడని చూపుటకు గుఱియైనవాఁడు
తే॥ గీ॥ మనుమసిద్ధిమహీశ సమస్తరాజ్య
భారధౌరేయుఁ డభిరూప భావభవుఁడు
కొట్టరువుకొమ్మనామాత్యు కూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి॥"

తిక్కనమంత్రి కవులపాలిటి కల్పభూరుహము. శైవాచారపారీణుఁడు, యశస్సాంద్రుఁడు, సకలవిద్యాసముద్రుఁడు, సుందరాకారుఁడు, రాజ్యభరణధురీణుఁడనుటకుఁ గేతనయే ప్రమాణము. సర్వవిధముల నాంధ్రుల కాదర్శప్రాయుఁడగు తిక్కనమంత్రిజీవితము పఠించుటవలనఁ గాని యే యాంధ్రుఁడు ధన్యుఁడు కాఁజాలఁడు.

తిక్కన గ్రంథకర్తృదశ పరిశీలించుదము. ఈ మహాకవి కవితలో నాఁటి తేటి గ్రంథరచనము నారంభించునాఁటికి భాస్కర రామాయణము నన్నయభట్టారకకృత భారతపర్వత్రయ మాంధ్రవాఙ్మయమున

నలరారుచుండెను. రామాయణమున నుత్తరకాండము లేకుంటచే నా కొఱంత వారింపఁదలంచి నిర్వచనోత్తరరామాయణమును దిక్కనమంత్రి రచించెను. భారతమును బద్యకావ్యముగ రచింప నారంభించి మూఁడుపర్వములువ్రాసి నన్నయభట్టారకుఁడు మరణించెను. రెండు వందలసంవత్సరములకుఁ బైకాలమువఱకు భారతమునందలి యవశిష్టభాగము నితరమహాకవు లెవరు సాహసించి పూర్తిచేయఁజాలరైరి. ఆంధ్రజనులకు "ధర్మశాస్త్రము, వేదము, పురాణము, సర్వస్వము" అనిభావింపనగు భారతమును సంపూర్ణముగ నాంధ్రీకరణముఁ గావింపఁజాలక యరణ్యపర్వమధ్యమున గ్రంథమువిడచి నన్నయభట్టు మరణించుట యాంధ్రజనులకు గొప్పకొఱంతయయ్యెను. నన్నయ తిక్కనల మధ్యకాలమునఁ బెక్కండ్రుకవులు కలరుగాని సాహసించి భారతరచనమున కుపక్రమింపమిచే సర్వవిద్యాసంపూర్ణుఁడు వివిధాగమరహస్యజ్ఞుఁడు, మంత్రిమార్తాండుఁడు నగు తిక్కనమంత్రి కాలోపము స్ఫురించెను. ఆంధ్రమహాజనులు సవినయముగ నాంధ్రభారతమును పూర్తిగావించి దేశము నుద్ధరింపుమని ప్రార్థింపసాగిరి. అమోఘమగు తిక్కనకవితాప్రవాహ మాంధ్రభారతరంగమున నిరాఘాటముగఁ బ్రవహించు నదృష్టము ఫలించెను ఆంధ్రమహాజనుల పూర్వపుణ్యము సార్థకమయ్యెను. ఆంధ్రభాషాంగన ధన్యరాలయ్యెను. ఇట్టి శుభసమయమునకై పండితపామరులు చిరకాలమునుండి నిరీక్షింపసాగిరి. తిక్కనమంత్రి భారతశేషమును బూర్తిచేయ నుత్సహించెనో లేదో మనము తెలుపఁజాలముగాని యాంధ్రులయదృష్టవశమున నాతనికి సాంగవేదవేదియు మధురకీర్తివిస్తరుఁడను స్వర్గవాసియు జనకుఁడునగు కొమ్మనామాత్యుఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై 'హరిహరనాథుఁడను దైవము నిన్ననుగ్రహింపవచ్చుచుండె' నని వెంటనేతెంచు దేవతాసార్వభౌముఁడగు హరిహరనాథుని జూపెను. భక్తిపరవశుఁడై కరములుమోడ్చి వినయవినమితగాత్రుఁడై తిక్కనమంత్రి హరిహరనాథునిముందు "దేవా! భృత్యున కేమియాజ్ఞ?" యనినిలచెను.

కరుణాసాంద్రములగు కడగంటిచూపులతోఁ దిక్కనమంత్రిని హరిహరనాథుఁడు చూచి "వత్సా! భారతము నాంధ్రీకరించి యాంధ్రవాఙ్మయము నలంకరించి ధన్యుఁడవుక"మ్మని తెల్పి కొమ్మనామాత్యునితోఁగూడ నంతర్ధానుఁడయ్యెను. సర్వకళాకోవిదుఁడగు తిక్కనమంత్రి తనస్వప్నమును శుభసూచనముగా మదిలో భావించి భారతామ్నాయవిరచనమున కియ్యకొనెను. భారతాంధ్రీకరణమునకు దీక్షాకంకణము ధరించెను. లౌక్యవృత్తిచేఁ గలుషితమైయున్న తన యైహికజీవనమును బవిత్రముఁగావించుకొననెంచి తిక్కనమంత్రి వేదవేదాంగపారగులు, సర్వశాస్త్రరహస్యవిజ్ఞాతలు నగు బ్రాహ్మణోత్తములసన్నిధానమున యజ్ఞమొనరించి సోమయాజియయ్యెను. అదిమొదలు తిక్కనమంత్రియని ప్రపంచముచే వ్యవహరింపఁబడుచున్న యీమహానుభావుఁడు తిక్కనసోమయాజి యను బిరుదనామము వహించెను. సోమయాజియను బిరుదనామము నిర్వచనోత్తరరామాయణమునందును దశకుమారచరిత్రమునందును గానరాకపోవుటచేఁ దిక్కన భారతము రచింప నిశ్చయించువఱకు యజ్ఞముఁ జేయలేదనుట నిశ్చయము. యజ్ఞదీక్ష నిర్వర్తించి తిక్కనసోమయాజి వ్యాసరచితమగు మహాభారతమును రచింప శుభముహూర్తమున నిశ్చయించెను. నన్నయభట్టారకుఁడు రాజరాజునానతిచే నరణ్యపర్వమువఱకుఁ దెలిఁగించి కాలవశమున మధ్యభాగమున నాపిన భారతభాగమును దీసికొని విఘ్నమైన యరణ్యపర్వముఁ దాను పూర్తిఁగావింపనొల్లక విరాటపర్వమునుండి యాంధ్రీకరింప నారంభించెను. ఆంధ్రకవులలో నేఁటివఱకుఁ దిక్కనవంటికవి జనింపలేదు. తిక్కనసోమయాజి హరిహరనాథున కంకితముఁగావించి పదునేనుపర్వముల భారతమును "ఆంధ్రావళి మోదముం బొరయునట్లు......మహాకవిత్వదీక్షావిధి" తో రచించి కృతార్థుఁడయ్యెను. తిక్కనసోమయాజికవిత్వ మనన్యసామాన్యమైనది. అనదృశ ధారాభిరామమైనది. పూర్వోత్తరమీమాంసలయందు సాంఖ్యశాస్త్రమున నధ్యయనమున వేదాంతశాస్త్రమున ధర్మశాస్త్రమున ఆంధ్రసంస్కృతవాఙ్మయములయందు నిరాఘాటమగు ప్రజ్ఞకలిగి రాజ

నీతిశాస్త్రములో నాటినేటి వశ్యకవితాధారగల తిక్కనసోమయాజి యంతకవి భారతమునందలి యవశిష్టపర్వములు రచించుట యాంధ్రుల యదృష్టపరిపాకమనుట సహజోక్తియె. ఆంధ్రకవులలోఁ దిక్కనసోమయాజియొక్క సర్వతోముఖకవితాప్రావీణ్యమున కొలఁదిడఁజనినవాఁడొక్కఁడైనను లేఁడు. ధారావేగమున యుక్తిబాహుళ్యమునఁ గథాసంగ్రహణమున, యతిప్రాసకల్పనమున నింక నితరవిషయములలో దేనియందైనఁ దిక్కనసోమయాజికి సాటివచ్చు నాంధ్రకవి లేఁడని ఘంటానాదముగ నాంధ్రపండితు లందఱు వాకొనుచున్నారు. భారతరచనమునకుఁ బూర్వము తనకుఁగల విషయలౌల్యముఁ గ్రమముగఁ దగ్గించికొని యజ్ఞమొనరిచి పరమార్థవిచారణములతోఁ గవితావినోదములతోఁ గాలక్షేపముఁ జేయుచుఁ దిక్కన భారతమును స్వల్పకాలములోనె ముగించియుండును. తిక్కనసోమయాజి కిట్టి విశ్రాంతి నొసఁగి మహాభారతరచనమునకాధారుఁడైన శ్రీ మనుమసిద్ధిరాజు మనకందఱకు వందనీయుఁడు. తిక్కనసోమయాజియంతటి కవిని సంస్థానమున నుంచుకొనుటచేతనే మనుమసిద్ధి చిరకాలము రాజ్యము పాలించుటకు నేఁటివఱకు మృతజీవియై యుండుటకు నవకాశము కలిగినది. సత్పాలకుల కీర్తిజీవితములు కవుల లేఖన్యగ్రమునకు సంబంధించిన వనుటలో నతిశయోక్తి సుంతయేనియు లేదు. తిక్కనసోమయాజి మంత్రియై యొనరించిన యుత్కృష్టకార్యములు పెక్కులు కలవు.

## మనుమసిద్ధి దిగ్విజయములు.

తిక్కనసోమయాజి మనుమసిద్ధిరాజ్యభారమును శిరసావహించి ధర్మపాలనముఁ గావింపసాగెను. దేశ మాకాలమున మిగుల నరాజకముగ నుండెను. చోడరాజులు దేశమునంతయు నాక్రమించుకొని విజృంభింపసాగిరి. చాళుక్యరాజులు మాత్రు దేశమును నేకచ్ఛత్రముగఁ బాలింప విశ్వప్రయత్నములు కావింపసాగిరి. కాకతీయరాజు లోరుగంటిలో నాంధ్రసామ్రాజ్యము స్థాపించి పేరుచెందిన మండలేశ్వరు

లను సామంతులుగ నొనర్చికొని భూదేవినంతయు రక్తప్రవాహములతో నలంకరింపసాగిరి. ఈస దిగ్ధసమయములో మనుమసిద్ధి కాజన్మద్వేషులగు దాయాదు లారాజ్యము నెటులేని హరింపఁ దీవ్రప్రయత్నములు చేయసాగిరి. ఇట్టియవస్థలో మనుమసిద్ధిరాజ్యమునకు ముఖ్యమంత్రియై రాజ్యమును క్షేమవంతముగాఁ బాలించి ప్రభుకృతజ్ఞతాపాత్రుఁడై కీర్తిసాంద్రుఁడై శాంతిస్థాపకుఁడై యశోజీవియైన తిక్కనసోమయాజి యెవరికి వందనీయుఁడు కాఁడు? మనుమసిద్ధిభూపతి సంస్థానమునఁ దిక్కనసోమయాజి మంత్రిగానున్న తరుణమున క్షాత్రమునఁ బరశురామునకుఁ బైచేయియై ప్రశస్తిగాంచిన పౌరుషాకారుఁడగు ఖడ్గతిక్కన సర్వసేనానాయకుఁడై రాజభక్తి ప్రకటించుచు రణముఖముల నగ్రేసరుఁడై చరింపసాగెను. ఇతఁడు తిక్కనసోమయాజికిఁ బెదతండ్రికొమారుఁడు. కవితిక్కనయని తిక్కనసోమయాజిని, ఖడ్గతిక్కనయని తిక్కనయోధుని నాకాలమున వ్యవహరింపసాగిరి. తిక్కనసోమయాజి భారతరచనమునకుఁ బూర్వము పలుమారు సంగ్రామములలో మనుమసిద్ధికిఁ దోడ్పడి ఖడ్గతిక్కన కవలంబనముగ నిల్చి విజయములఁ గడించెను. మనుమసిద్ధి ద్రవిడదేశాధీశ్వరుని నిర్జించెను. కర్ణాటభూపాలకుని దర్పంబడంచెను. విజయవర్మయను నొకరాజును వంచించెను. రక్కెసగంగయను బిరుదము వహించి విక్రమపౌరుషాదులలో ననన్యసామాన్యుఁడైన గంగయసాహిణిని బంధించి వానియైశ్వర్యముల నన్నింటిని గ్రహించి యాశ్రితవత్సలబుద్ధిగల యీ మనుమసిద్ధి మరల విడిచిపెట్టెను. మహారాష్ట్రదేశాధీశ్వరుల సామంతుఁడైయున్న సారంగుఁడనురాజును మనుమసిద్ధి సులభముగా జయించెను.

"శా॥ శృంగారంబు నలంగదేమియును బ్రస్వేదాంబుర శ్రీశ తే
దంగంబుల్ మెఱుఁగడ వించుకయు మాహారాష్ట్రసామంతు సా
రంగుఁ ద్రోలి తురంగముం గొనె సంగ్రామంబునన్ దృప్త స
ర్వాంగస్ఫా [illegible] సైన్యంబులన్ ॥"

ఇట్లు మనుమసిద్ధివిజయములను దిక్కనసోమయాజి నిర్వచనోత్తరరామాయణములో శ్లాఘించియున్నాఁడు. మనుమసిద్ధి గడించిన సర్వవిజయములయందును దిక్కనసోమయాజియే ముఖ్యుఁడై యున్నాఁడు. ఏయేవిజయములలోఁ దిక్కనసోమయాజి యెంతవఱకు ఖడ్గధారణము గావించెనో తెలుపు నాధారములు లేవుగాని ప్రతిజైత్రయాత్రయందును ప్రధానయోధుఁడుగ ఖడ్గతిక్కనయు సంగ్రామనిర్ణేతయై తిక్కనసోమయాజియు బయలుదేరి రనుట నిక్కము. తిక్కనసోమయాజిని కేతనమహాకవి, "తిక్కచమూపా— తిక్కదండాధీశా" యనిసైతము ప్రశంసఁ గావించియుంటచే మొదట సేనానాయకుఁడై కాలముగడపి మనుమసిద్ధికృతజ్ఞతకుఁ బాత్రుఁడై క్రమముగ మంత్రియయ్యెనని విశ్వసింపవచ్చును. యౌవనమున దండనాయకుఁడై సంగ్రామరంగములలో ముందరిగిన తిక్కసోమయాజి మంత్రిపదవిలో నుండియు నరాతులఁ జెండాడుచు సంగ్రామభారము వహించుచుఁ గీర్తిఁగాంచెననుట విశ్వసనీయము. కావున దిక్కనసోమయాజివీరత్వమునుగూర్చి యుద్ధనైపుణ్యమునుగూర్చి సంశయింపఁ బని లేదు. సంగ్రామరంగములలో నవతరించి తామసవృత్తి నవలంబించి వధోద్యోగములలో ముందంజవేయుచు రక్తపాతముఁ గావించుచుఁ గ్రోధపరాయణుఁడై వర్తించుటయందు విముఖుఁడై తిక్కనమంత్రి తన యుత్తరవయస్సున నాధ్యాత్మికజీవనమునం దభిరుచిగలవాఁడై యజ్ఞమొనరించి యైహికము బునీతము గావించికొనియుండెను. యజ్ఞానంతరము తిక్కనసోమయాజి శాంతవృత్త్యనుసారియై గ్రంథకరణోద్యమముతో రాజ్యకార్యధురంధరత్వముతో జీవితము గడపియుండును. ఈస్థితి వచ్చునప్పటికి మనుమసిద్ధిరాజ్యమున శాంతి స్థాపింపఁబడియుండెను. దాయాదులు బలవంతులై విక్రమసింహపురమునకుఁ బలుమా రేతెంచి మనుమసిద్ధిరాజ్యమును రూపుమాపవలయునని ప్రబలప్రయత్నములు చేయసాగిరి. ఈయవస్థ తిక్కరాజుకాలమునుండి వచ్చుచుండెననుటకు "దర్పదుర్జయులగు దాయాదనృపతుల ననిలోనఁ బఱపఁడే యాగ్రహమున" యను నిర్వచనోత్తరరామాయణ పద్యభా

గముచే సువ్యక్తమగుచున్నది. దాయాదవిజృంభణము కడకుఁ బెచ్చు పెరిగెను. తిక్కనసోమయాజి భారతరచనముతో శాంతముగఁ గాలక్షేపముఁ జేయుచున్నతఱి దాయాదులలో ముఖ్యులు బలవంతులు నహంకారస్వరూపులు నగు "అక్కన, బయ్యన" యనువారు సేనలతో బయలుదేఱి సమయము వేచి మనుమసిద్ధి నాకస్మికముగా రాజ్యవిచ్యుతునిగావించి నిరంకుశముగ విక్రమసింహపుర రాజ్యమును బరిపాలింపసాగిరి. చండశాసనులగు నక్కన బయ్యనలు బలవంతులు, ప్రభుభక్తిపరాయణులు, మనుమసిద్ధి పక్షపాతులునగు యోధుల నిర్బంధించి సైనికులనందఱ స్వవశముఁగావించికొని స్థిరవాస మొనరించికొని నెల్లూరులోఁ దమసైన్యముల నెలకొల్పి ప్రతిపక్షులు ముందడుగు వేయకుండఁ గనుగలిగి మెలకువతోఁ జరింపసాగిరి. మనుమసిద్ధిరాజు బంధనాలయమునఁ గాలక్షేపముఁ జేయవలసినవాఁడయ్యెను. ప్రజలయందుఁ గల్లోలముదయించెను. సంస్థానమునం దన్నిచోటుల నశాంతిజనితమగు సంతాపహేతువు పొడసూపెను. ఈయవస్థలోఁ దిక్కనసోమయాజి దీక్ష యదృష్టవశమునఁ బూర్తియయ్యెను. పరనృపతుల యధీనమునందున్న రాజ్యమును గైకొనుటకు మనుమసిద్ధిని రాజ్యమున నెలకొల్పుటకును దిక్కనసోమయాజికి సాధ్యముకాదయ్యెను. క్రమక్రమముగ నక్కన బయ్యనలబల మమితమయ్యెను.

## తిక్కనసోమయాజి రాజనీతి.

బాహుబలముచేఁ బగతుర నిర్జించి మనుమసిద్ధిపైఁ గనికరముఁ జూపువీలు తప్పుటచేఁ దిక్కనసోమయాజి తన రాజనీతిసహాయముచేఁ గార్యము సాధింపవలసిన యావశ్యకము తటస్థించెను. ఆంధ్రదేశమునఁ గాకతీయగణపతిచక్రవర్తి సుప్రసిద్ధుఁడై బలవంతుఁడై ఓరుగల్లు ముఖ్యపట్టనముగఁ గంచివఱకుఁగల ముఖ్యమగు దేశమునంతయుఁ బరిపాలించుచుండెను. సకలేశ్వరత్వము గణప వహించియుంటచే మనుమసిద్ధిరాజ సామ్రాజ్యమునకు కావలసివచ్చెను సామంతుఁడై కప్పములఁ జెల్లించి

మనుమసిద్ధి విధేయుఁడు గాకముందె రాజ్యవిచ్యుతి తటస్థించెను. తిక్కనసోమయాజి యీ యాపత్సమయమున గణపతిదేవుని సహాయముతో మనుమసిద్ధిరాజును బంధోన్ముక్తుని గావించుటకును, అక్కన బయ్యనలను రాజ్యమునుండి వెడలనడపుటకును నిశ్చయించి యెవరికిఁ దెలియకుండ నోరుగంటికిఁ బయనమయ్యెను. దూరదృష్టిలేక స్వబలమునే యాధారముఁ జేసికొని రాజ్యమదమున యుక్తము యోజింపని అక్కన బయ్యనలు తిక్కనసోమయాజివిషయమున జాగరూకత వహింపరైరి. భారతద్వితీయుఁడై కొలఁదిదినములకుఁ బర్యంకచారియై తిక్కనసోమయాజి యేకశిలానగరమని వ్యవహరింపఁబడు నోరుగల్లు చేరెను. ఆవలికథయంతయు సిద్ధేశ్వరచరిత్రమున నిట్లు చెప్పఁబడియున్నది:

"సారపారావార సరసగంభీర | సారుఁడై కీర్తివిస్తారుఁడై యలరు
నారీతి గణపతి నటుమాచు వేడ్క | తిక్కనసోమయాజక్కడకొకట
* * * | దిక్కుదిక్కులనుండి తెలివిద్యార్థు
లక్కడక్కడను గావ్యముల శ్లోకార్థ | మొక్కొక్కవిధమున నొగి వినుపింపఁ
జక్కనవినుచును నొక్కయందలము | నెక్కితిక్కనసోముఁ డక్కడే తెంచె
నారీతి గాసోమయాజుల రాక | వారకచని ఘణిహారుఁడుం దెల్ప
* * * | అట్టిమహాత్ముని నాసోమయాజి
నెట్టన నెదురేగి నేర్పుతో రాజు | తెచ్చియాస్థానస్థితుని గాఁజేసి
మెచ్చితాంబూలాదు లెచ్చుగానిచ్చి | * * *
అగుభారతాఖ్యాన మావీరవరుఁడు | తగఁజేసినట్టి యుద్ధప్రకారములు
వినియు సంతోషించెఁ గనినట్లుచెప్ప | * * *
అంతఁ దిక్కనసోమయాజికి మెచ్చి | వింతవస్త్రంబులు వివిధభూషణము
లత్యంతభక్తితో నప్పుడిచ్చుచును | సత్యసంధుండును సభ్యవర్తనుఁడు
నగుసోమయాజితో నారాజుకనియెఁ | దగుమాటవినుమొక్క ధర్మకార్యంబు
సూర్యవంశంబున సొబగొందునట్టి | యార్యపూజితచర్యుఁ డామనుమసిద్ధి
రాజుదా నెల్లూరు రమణతో నేల | * * *
[illegible]న బయ్యన అధికబలిష్ఠు | లక్కట సిద్ధిరాయుని బాఱఁదోలి
రాజ్యంబు తా మెరయించుచు | నొక్కకాసైనను జక్కఁగనీరు
[illegible]వి వారి నెల్లూరు | [illegible]

ననిన గణపతిరా జట్లు కాకనుచు | * * *
వెడలియు గణపతి విజయంబునకును | గుడియడమలసేన గొలిచియేతేర
వెలనాడుఁ జేరియు వీడెల్లఁ గాల్చి | వెలనాటిరాజును వెసగెల్చి వాని
యప్పనంబులుగొని యటుచని రాజు | గుప్పన నెల్లూరుగూడ నేతెంచి
యక్కనబయ్యన నచటసాధించి | * * *
నెల్లూరి ప్రజలకు నేర్పువాటిల్ల | తెల్లించెఁ దామన్మ సిద్ధిరాజునకు
నెల్లూరిపట్టంబు నేర్పుతోఁ గట్టి | సల్లలితాదృతి సమరదుర్గముల
నలువది యొనిమిది యగు పట్టణముల | నరుదొందసాధించి యామన్మసిద్ధి
రాజుకిచ్చియుఁ దన తేజంబు దిశల | బూజకెక్కఁగ ఘనరాజితయశుఁడు
ఘనతటాకంబు తాఁ గట్టించె నచటఁ | గొనకొని నెల్లూరఁ గొన్నాళ్లలుండి
మనుమసిద్ధికిరాజ్య మహిమంబుఁ దెల్పె."

తిక్కనసోమయాజి యొనరించిన కార్యములలో మనుమసిద్ధి రాజ్యస్థాపనము చాలగొప్పది. గణపతిదేవునిసమ్ముఖమున కేగి భారతము వినిపించి యాతనివశముఁ గావించికొని సోమయాజి యొనరించిన ప్రతిక్రుతి ప్రశంసాపాత్రము. కీర్తిశోభితుఁడగు తిక్కనసోమయాజి గణపతిదేవుని సంస్థానమున మిగుల గౌరవము లందుటయేగాక గణపతిదేవునియంతటి చక్రవర్తిని వెంటఁగొని వచ్చెను. దీనివలనఁ దిక్కనసోమయాజి యెన నెంతపలుకుఁబడి కలవాఁడో యెంతరాజనీతివిదుఁడో యెంత మాటవాసిఁగలవాఁడో తెలిసికొనవచ్చును. తిక్కనసోమయాజి కార్యభారమును బూని యోరుగంటికేగి ససైన్యముగ గణపతిదేవుని వెంటఁగొని వచ్చియుండఁడేని యక్కనబయ్యనల దౌర్జన్యముచే మనుమసిద్ధి కారాగారముననె యంతరింపవలసివచ్చెడిది. సోమయాజి రాజాశ్రయమునకై కొలఁదికాలము మాత్రమె యోరుగంట గడపెను. తరువాత గణపతిదేవునిచే నుచితసత్కారము లందుచుఁ గొంతకాలమచట నివసించెను.

గణపతిదేవుని కాలమున నోరుగల్లుప్రాంతములలో జైనమతము మిగుల నధికముగానుండెను. గణపతిదేవుని పూర్వులు జైనమతాభిమానులగుటచేఁ బ్రజలందఱు నామతమునను ప్రవేశించిరి.

జైనాచార్యు లనేకులు హనుమకొండ, ఓరుగల్లు, లేములవాడ, కాళేశ్వరము లోనగుచోటుల మతపీఠము లేర్పఱచుకొని ప్రజాసామాన్యమునకు నహింసారూపకమగు జైనమతధర్మముల బోధింపసాగిరి. దేశమంతయు నాబోధనమున మునిఁగిపోసాగెను. కాకతీయులు కాలక్రమమున శైవులైరి. కాలక్రమమునఁ బ్రభుసహాయముచేఁ బాలకురికి సోమనబసవేశ్వరుఁడు లోనగు శైవమతస్థాపకులు జైనాలయములను శైవాలయములుగా మార్పసాగిరి. ప్రభుసహాయము లేకపోవుటచేఁ గ్రమముగ జైనమతము పలుచఁబాఱసాగెను. కాని మతాచార్యులు మాత్రము దిగ్గజములవలెఁ బట్టుదలతో నిలువఁబడి యసహాయులయ్యు సాహసముతో సభారంగములలో మతసంగ్రామములలో నద్వైతులతో, వైష్ణవులతో, వారు వీ రననేల! సర్వాస్తికులతో సైతము బోరాడసాగిరి. రాజానుమతమె ధర్మముగాన జైనమతాభిమానులగు పౌరులందఱు శైవులుగ వైష్ణవులుగ మాఱిపోవసాగిరి. దేశమంతయు శాంతి, అశాంతి సంఘట్టనములచేఁ గల్లోలమొందసాగెను. ఈసమయమునఁ బౌరులు రాజానుమతి ననుసరించి జైనులచేఁ బూజనీయములైయున్న సిద్ధేశ్వర-పద్మాక్షి-దేవాలయముల నాక్రమించి జైనుల కందుఁ బ్రవేశము లేకుండఁజేసిరి. జైనభిక్షుక విగ్రహములను భైరవస్వరూపములుగ నొనర్చి పూజింపసాగిరి. పూర్వాచారపరాయణులగు కొందఱు జైనులు పట్టుదలతో తమధర్మముల బోధించుచుఁ బ్రజాసామాన్యమును దమమతమునఁ జేర్చుకొనఁ దీవ్రప్రయత్నములఁ జేయసాగిరి. గణపతిదేవునిరాజ్య మిట్టియపూర్వాందోళనమున మునిఁగియుండెను. దాని వారింతునని తిక్కనసోమయాజి గణపతిదేవుని పేరోలగమున వాగ్దానముఁగావించి జైనాచార్యుల నందఱ రావించి యొకగొప్ప మతసభ జరపెను. జైనమతాచార్యులగు పండితులనేకు లాసభకు వచ్చిరి. తిక్కనసోమయాజి యందఱముందు—జరుగనున్న వివాదములో నోడినవారు తమ మతమును బూర్తిగావర్జించి గెలిచినవారిమతములోనికి వచ్చునటుల నియమము నేర్పఱచి సభ్యుల యియ్యకోలునుబడిసి గణపతిదేవుని మధ్యవర్తిగా నుంచి మతవాదమునకు

దొరకొనెను. తీవ్రమగు మతవివాదము కొలఁదిదినములు జరిగెను. కాలక్రమమున నాంధ్రదేశమున జైనమతము నశింపవలసిన యోగముండుటచే యుక్తివాదమున శాస్త్రవాదమునఁ దిక్కనసోమయాజితోఁ బ్రత్యుత్తరముఁ జెప్పఁజాలక జైనాచార్యులు వెనుకఁబడిరి. ప్రజలందఱు తిక్కనసోమయాజికి బ్రహ్మరథము పట్టి యాస్తికమతములోఁ బ్రవేశించిరి. ఆవేశతప్తులగు పౌరులు జైనమందిరములఁ గూలిచి యాలయముల రూపుమాపి గ్రంథభాండారములఁ గాల్చివేసిరి. ఈ ప్రయత్నముతోఁ జాలవఱకు జైనమతవ్యాప్తి యాంధ్రసామ్రాజ్యమున నంతరించెను. రాజ్యమునఁ దిక్కనసోమయాజిపై నపూర్వమగు భక్తి నెలకొనెను. శాంతి స్థాపింపఁబడెను. నిలువనీడలేక జైనాచార్యులనేకులు దేశత్యాగముఁ జేసిరి. మఱికొందఱు భిక్షుకు లాస్తికమతములోఁ జేరి ప్రజాశాంతిని గాపాడసాగిరి. తిక్కనసోమయాజి యొనరించిన యీమతసంగ్రామ మనన్యసామాన్యమైనది. గణపతిదేవునకుఁ దిక్కనసోమయాజిపై నింతయనరాని విశ్వాసము కుదిరి శాంతిమాతమైన తనదేశమును మంత్రిలహస్తగతముఁ గావించి సైన్యపరివారసహితుఁడై ధర్మసంస్థాపనముఁ గావించి యక్కనబయ్యనలఁ బాఱఁదోలి మనుమసిద్ధిరాజునకుఁ బూర్వరాజ్యము నొసంగుటకై విక్రమసింహపురమునకు బయలువెడలెను గణపతిదేవుఁ డోరుగంటినుండి బయలువెడలి కొలఁదిదినములకు వెలనాడు సైన్యసహితముగఁ బ్రవేశించెను. అప్పుడు వెలనాడుపాలించుచున్న చోడరాజు సామంతుఁడైయుండి కప్పముల నొసంగకపోవుటయు మండలేశ్వరునకు గౌరవభావముతో నెదురురాకుంటయు వీక్షించి గణపతిదేవుఁ డారాజ్యమను మట్టడించి చోడుని రాజ్యభ్రష్టుని గావించి విశ్వాసపాత్రుఁడగు తన పరిచారకు నొకని నారాజ్యమునకుఁ బ్రతినిధిగ నిల్పి యటనుండి బయలువెడలి తిక్కనసోమయాజి చూపుమార్గమున కొలఁదిదినములకుఁ జతురంగబలసమన్వితముగ నెల్లూరు చేరెను. దర్పాంధులగు నక్కన బయ్యనలు దూరదృష్టిలేక రానున్న యపాయమును గుర్తింపక కాలక్షేపముఁ జేయుచుంటచే గణపతిదే

వునిదండయాత్ర యేమాత్రము తెలియదయ్యెను. కొలందికాలము రాయబారములు గడచెఁగాని యక్కనబయ్యనలు రాజ్యమువిడచి యేగుటకు మనుమసిద్ధిని వదలిపెట్టుటకు గణపతిదేవుని ముందు క్షమార్పణముకోరుటకు నియ్యకొనరైరి. తిక్కనసోమయాజి ఖడ్గపాణియై కాకతీయగణపతిసైన్యమున కధ్యక్షుఁడై సంగ్రామరంగమునకేతెంచ సిద్ధపడెను. గణపతిదేవుఁడు సేనలయుత్సాహమెఱిఁగి యక్కనబయ్యనల జీవగ్రాహులనొనర్ప నాజ్ఞాపించి రణదుందుభి మ్రోగింపఁ జేసెను. కొంతకాలము సంకులసమరము జరిగెను. సైనికులలో ననేకులు తిక్కనసోమయాజియే సేనానాయకుఁడుగ వచ్చుటచే సంగ్రామరంగము వదలి మహామంత్రివర్యునకు నమస్కరించిరి. కడ కక్కనబయ్యనలవెంటవచ్చిన బలము మాత్రమె నిలచెను. ఆంధ్రసామ్రాజ్యమునుండి వచ్చిన సైనికులు నిరాయాసముగ నెల్లూరికోట భేదించి యక్కనబయ్యనల జీవగ్రాహులను గ్రహించి విజయధ్వజము స్థాపించిరి. గణపతిదేవుఁడు మనుమసిద్ధిని బంధవిముక్తునిగావించి తిక్కనసోమయాజిని నటఁ గృతజ్ఞతాపూర్వకముగ సత్కరించి వదలి కాంచీపురమునకు ససైన్యముగ జైత్రయాత్రకు బయల్వెడలెను.

తిక్కనసోమయాజి మనుమసిద్ధిరాజును బంధోన్ముక్తుని గావించి ధన్యుఁడయ్యెను. మనుమసిద్ధిరాజు ఖడ్గతిక్కన సేనానాయకుఁడుగఁ దిక్కనసోమయాజి మహామంత్రిగఁ దోడ్పడఁ జిరకాలము రాజ్యము పాలించి పసువులపుల్లరివిషయములోఁ గాటమరాజుతోఁ బోరాడి రణరంగమున నిహతుఁడయ్యెను. ఖడ్గతిక్కనయు నాసంగ్రామముననె మరణించెను. తిక్కనసోమయాజి తరువాత కొంతకాలము జీవించి కీర్తిశేషుఁడయ్యెను. ఆంధ్రవాఙ్మయోద్ధారకుఁడు, కవిబ్రహ్మ, మంత్రిశిరోమణి తిక్కనసోమయాజి మరణించినను నాతనికీర్తిమాత్రము సజీవముగ నున్నది. ఈకవివంశీయులు నేఁటికిని నెల్లూరుప్రాంతమునఁ గల పాటూరను గ్రామమున నున్నారు. ఈవర్యుఁడు లిఖించిన గంటమేమయ్యెనో తెలియరాదుగాని యాగంటపుటూరమాత్రము నేఁటి

వఱకుఁ గవివంశీయులచెంతఁ గలదు. నెల్లూరుపురవాసులు తిక్కన సోమయాజిగృహమని యొకానొకస్థలమును జూపుచున్నారు. భారతము కృతిచేయఁబడిన హరిహరనాథుఁ డర్చావిగ్రహమనియు నాయాలయము ప్రకృతము జీర్ణమయ్యె నని కొందఱును, మఱికొంద ఱుపాసనా దైవమనియుఁ దెలుపుచున్నారు. ఈయుభయవాదములు సమన్వయింప నాధారములు కానరావు.

## ఉపసంహారము.

మనుమసిద్ధిరాజు రాజ్యవిచ్యుతుఁడగుటయుఁ దిక్కన యుద్ధరించుటయు గణపతిదేవుఁడు సమకాలికుఁడగుటయు విశ్వసించుచుఁ జరిత్రకారులు అక్కనబయ్యన లనువారె లేరనియు, నీకథ కల్పితమనియు, వ్రాయుచున్నారు. స్థానికచరిత్రములయందేగాక తిక్కనసోమయాజికి నూఱుసంవత్సరములతరువాత రచింపఁబడిన కాసెసర్వప్పకృతమగు సిద్ధేశ్వరచరిత్రమున నీ విషయమేగాక తిక్కన యోరుగంటిలో శాస్త్రవాదము సలిపి జైనుల జయించి గణపతిదేవునిచే సత్కారాదికములు సైతము పొందినటుల తెలియుచున్నది. సమకాలికులగు చరిత్రకారులయూహల ననుసరించి యైదాఱువందల సంవత్సరములక్రింద వ్రాసిన కవులయంశములు నిరాధారములని త్రోసివేయుట సాహసము. అక్కనబయ్యనలనామములు శాసనములలోఁ గానరాకపోవుటచేఁ గల్పితపురుషులని కొంద ఱనుచున్నారు. పురాణకాలము మొదలుకొని నేఁటివఱకున్న రాజులలో ననేకులు చరిత్రకారులకుఁ దెలియఁదగిన యాధారములు కల్పింపకయె గతించిరి. అంతమాత్రమున నట్టి వ్యక్తులే లేరనుట సాహసము. ప్రపంచమునఁ గల శాసనముల నన్నింటి నింకఁ జరిత్రకారులు ప్రచురింపలేదు. చరిత్రకారు లన్నింటిని పఠింపలేదు. ఇట్టిచోఁ దావేఱుఁగనియంశములన్నియు మృషావాదములనుట ప్రమాదము. తిక్కనసోమయాజి క్రీ. శ. ౧౨౨౦ మొదలు క్రీ. శ. ౧౩౦౦ వఱకు జీవించెను.

# గోపరాజు రామప్రధాని.

"సీ॥ వీఁడెపో దుష్టారి వీరమంత్రికఠోర భూధరంబులకు దంభోళిధార
వీఁడెపో కవిరాజ గాఢదారిద్ర్యాంధకారంబు లడగించు కమలహితుఁడు
వీఁడెపో బహునీతి విద్యానిరూఢిచే సురగురు గెల్చిన శుభకరుండు
వీఁడెపో చతురబ్ధివేష్టితావనిగల్గు బహుమంత్రికుల సార్వభౌమమూర్తి
తే॥ గీ॥ ఈతఁడే సర్వ దేవతాప్రీతికరుఁడు
ఈతఁడే గోపరాట్కుల శీతభానుఁ
డని కవీంద్రులు పొగడంగ నతిశయిల్లె
మంత్రిజంభారి రామయామాత్యశౌరి."

గోపరాజు రామమంత్రినిగూర్చి యెఱుఁగనివా రుండరు. ఇతఁ డాంధ్రదేశమునంతయు నిరంకుశముగాఁ బాలించిన గణపతిదేవ చక్రవర్తివద్ద ప్రధానమంత్రియై యనేకధర్మకార్యములు గావించి మిగుల విఖ్యాతిఁగాంచెను. రామమంత్రిజీవితము దండకవిలెలయందు స్థానికచరిత్రములయందుఁ గలదు. ప్రజాసామాన్యమునందు బాగుగా వ్యాపించియున్నది. పూరె వీరభద్రకవి "కరణికోద్ధారిణి" యను గ్రంథములో నీ మహామంత్రిజీవితమునంతయు వ్రాసియున్నాఁడు. ఈచరిత్రగ్రంథములన్నింటి నాధారముఁ జేసికొని యీమంత్రివర్యుని జీవితచరిత్రమును దెలిసికొన యత్నించెదము. గోపరాజు రామప్రధాని బాల్యమునుండియు గణపతిదేవునివద్ద మంత్రిగానుండెను. ఈగణపతిదేవుఁడు తిక్కన సోమయాజి చరిత్రములోఁ జెప్పఁబడిన గణపతిదేవుఁడుకాఁడు. అంతకు రమారమి నూఱుసంవత్సరములపైకాలమున నున్నవాఁడు. క్రీ శ. ౧౧౩౦ మొదలు ౧౨౦౦ వఱకున్న యీగణపతిదేవుఁడు కళింగదేశపాలకుఁడనియు గణపతివంశములోఁ బుట్టినవాఁడనియు దండకవిలెలు చెప్పుచున్నవి. ఆంధ్రదేశములోఁ గల గణపవరములను గ్రామములలోఁ బెక్కులి రాజన్యుఁడు తీర్థయాత్రల కేగుచు మధ్యమధ్య విడిసినచోటున నెల్లఁ గట్టించుచు వచ్చినటులఁ బ్రతీతి కలదు. మోటంజీదొరవారు సంగ్రహించిన కయిఫీయతులలో

నీమహారాజుయొక్కయు మంత్రియొక్కయు జరిత్రముకలదు. గోపరాజు రామప్రధానియను వ్యక్తియే లేఁడనియు శాసనాద్యాధారములు లేవుగాన నితఁడు కల్పితపురుషుఁడనియు నిరసింపఁ జరిత్రకారుల తలంపు పరిగ్రహణయోగ్యముకాదు. సత్యలేశము లేని దెన్నటికని బ్రవాదము జనింపఁజాలదు. జనశ్రుతులన్నియుఁ దప్పులంటిమేని మన చరిత్రగ్రంథములన్నియు విశ్వాసయోగ్యము కాకపోవుట తటస్థించును. కొండవీటి దండకవిలెనుండి యీచరిత్రాంశము తెలిసికొందము.

"శ్లో॥ గోత్రశాస్త్రాంబరేందూనాం। సంఖ్యే శాలివాహనే (౧౦౬౮)
శ్రీమాన్ గణపతిర్భూపో। గజపత్యన్వయోద్భవః।
తేషాం శ్రేష్ఠతమామాత్యో। యాజ్ఞవల్క్య ద్విజోత్తమః
గోపరాజాన్వయోత్పన్నో। రామాఖ్యో గణికాగ్రణీః।
"రక్తాక్ష్యబ్దే మాసి భాద్రపదే బహుళపక్షకే
దర్శేర్కగ్రహణే పుణ్యకాలేంగారకవాసరే
గణకానాం విహితార్థాయ సద్యస్థాపనాయచ
తిష్ఠేశ్శశిమార్తాండ యావత్తావచ్చవర్ధతాం
తేషాం రాజా గృహీత్వాణాం కృష్ణవేణీతటే తథా
గ్రామస్థావర వృత్తీనాం సాక్షిణా స్సర్వదేవతాః"

యాజ్ఞవల్క్యనియోగులలో గోపరాజువారు కలరనియు నందు రామమంత్రి గణపతిరాజువద్ద ముఖ్యామాత్యుఁడనియు గణకవృత్తులు స్థాపించెనసియు శా॥ శ॥ ౧౦౬౮ లోఁ గరణములుగ నియోగుల నియోగించెననియుఁ బైశ్లోకములవలన విరళముగఁ దెలియుచున్నది. గోపరాజురామమంత్రికిఁబూర్వము విశ్వకర్మవంశజులమని చెప్పకొను కంసాలురు కరణీకము లొనరించుచుండువారఁట. వారలవలనఁ బ్రాహ్మణులొందు ప్రతిబంధకములఁ గన్నారఁజూచి రామమంత్రి యాపదవులు నియోగులవశము గావించెను. ఆకథ విరళముగా వ్రాయుచున్నారము.

గణపతిదేవుఁడు రాజబంధు సామంత పరివృతుఁడై దివ్యదేశ సం

దర్శనమునకు బయలువెడలి, పుణ్యస్థలములని పేరొందిన తిరుపతి, కంచి, కాళహస్తి, శ్రీరంగములోనగు చోటులకేగి భగవంతుని సేవించి గృహాభిముఖుండై కొంతకాలమున కాంధ్రదేశముం జేరెను. రాజును మంత్రులును బరిజనులును మాదల యను గ్రామమున విడిసి యట మార్గాయాసము దీర్చుకొనుటకు నొకటి రెండుదినములు గడుపుకొన నిశ్చయించిరి. గణపతిదేవుని ముఖ్యప్రధానియగు గోపరాజురామమంత్రి తండ్రియాబ్దికము వచ్చెను. గృహము సకాలములోఁ జేరఁజాలనందులకు విచారించి రామమంత్రి యటనే బ్రాహ్మణబృందముతో నాపితృక్రియ నిర్వర్తించుకొనఁదలంచి మాదలకేగి వేదవేదాంగపారగులగు మువ్వురు బ్రాహ్మణుల నిమంత్రణమునకుఁ జెప్పి యాపురమునన్న బ్రాహ్మణుల నందర భోజనమునకు రమ్మని సగౌరవంబుగ నాహ్వానించెను. మరునాడు యథావిధిఁ బితృకార్యమును నిర్వహింపనెంచి విధివిహితధర్మముల నాచరించి మధ్యాహ్నమువఱకుఁ బ్రతీక్షించెను. రామప్రధాని మార్గము లరసియరసి విసిగిపోయెను. ప్రొద్దుపోవుచున్నను నిమంత్రితులైన బ్రాహ్మణులుగాని పంక్తికియ్యకొనిన బ్రాహ్మణులుగాని రాకుంటనేఁ జాలవిసిఁగి శుష్కోపవాసముతో బడలియున్న యా యాగర్భశ్రీమంతుఁడు కాలు క్రిందనిడఁజాలక పరిచారకునిబిల్చి బ్రాహ్మణోత్తములఁ బిల్చిరమ్మని యాజ్ఞాపించెను. పరిచారకుఁడు కారణాంతరముల విన్నవించి బ్రాహ్మణులు విచ్చేయరై రనెను. రామప్రధానికిఁ గోపము మితిమీఱెను. ఉపవాసవశమునఁ గనులు తిరుగుచుండెను. ఎండ మిక్కిలి తీవ్రముగాఁ గాయుచుండెను. ఈయవస్థలో పిథలేక బ్రాహ్మణుల నాహ్వానించుటకై యనతిదూరమునన్న మాదలకుఁబోయెను. గ్రామమధ్యమున్న రచ్చసావడినిండ బ్రాహ్మణులు మూఁకఁగూడియుండిరి. నిమంత్రితుఁడైన బ్రాహ్మణుఁ డొకఁడచట బందుకొయ్య వేయఁబడియుండెను. బ్రాహ్మణులందఱుఁ జేరి కరణీకము చేయుచున్న యగసాలియొద్దకేగి "బాకియున్న పన్ను మొత్తమంతయు జేపో మాపో చెల్లింపఁగలము, విడచిపెట్టుము. లేకున్న మేమందఱు మాఋణమునకు బాధ్యులమగుదు"మని పలువిధముల బతిమాలసాగిరి. మహామంత్రి

వర్యుని పితృకార్యభంగము తటస్థించునని విన్నవింపసాగిరి. బ్రాహ్మణులెంతఘోషించినను ఫలములేకపోయెను. గణికుఁడగు నగసాల మూర్ఖించి "మీమాటలు పాటిసేయ వీలులేదు. పన్నులు చెల్లించవలసిన తరుణము గడచినది. ఇంతవఱకుఁ జెల్లింపనందులకు నేఁడంతయు శిక్షవిధించితిని. ఆవశ్యకమున్న మీరుపొండు. లేదా, మానుకొనుఁడు. మహామంత్రి యాజ్ఞకు నేను వెఱచువాఁడఁగా" నని కరణము వాదింపసాగెను. సాత్వికుఁడును విద్వాంసుఁడును నిరుపేదయు నగు నీ బ్రాహ్మణుని విడచిపోనోపక బ్రాహ్మణవర్యులందఱేకముఖముగ నుపవాసమును నిర్వహింప నిశ్చయించిరి. ఈయవస్థలో గోపరాజు రామప్రధానివర్యుఁడచటికేతెంచి యట గుమిగూడియున్న బ్రాహ్మణుల ముఖమున నావర్తమానమునంతయు నాలించి కంసాలి కరణమును సమీపించి "ఓయీ! బ్రాహ్మణుని విడచిపెట్టినచో నీయవలసినపన్నంతయు నిచ్చివేయుదును. ఆవశ్యకమైనచో నేను బంధనమున నుందును. నామనవి యాలింపు"మని సవినయముగ విన్నవించెను. ఎటులో మనసుమాఱి బ్రాహ్మణుఁడొసంగవలసిన పన్నంతయు రామప్రధానివలనఁ బుచ్చుకొని బ్రాహ్మణుని విడచిపెట్టెను. రామప్రధాని బ్రాహ్మణులతో విడిదికేగి యగ్నిహోత్రాదికములు భోజనాదికములు నిర్వర్తించువఱకు సూర్యాస్తమానమయ్యెను. బ్రాహ్మణధర్మము నెఱుంగని బ్రాహ్మణద్వేషి కరణికము వహించుట చేతనే గదా యిట్టి యుపాయము తటస్థించినది. కావున నీజాతిని కరణికము నుండి తొలఁగించినఁగాని శాస్త్రబద్ధములగు బ్రాహ్మణధర్మములు నెఱవేఱఁజాలవని నిశ్చయించి రామమంత్రి తన నిశ్చయమును గంభీర హృదయమున మాటుపఱచి సమయార్థియై యుండెను.

తరువాత మాదలనుండి రాజపరివారము బయలువెడలి కొలఁది కాలమునకు నాంధ్రరాజుల ప్రథమ రాజధానియుఁ బుణ్యక్షేత్రమును వీరభూమియు నగు ధరణికోటకుఁ జేరెను. కృష్ణాతీరమునఁ గొంతకాలము వినోదముగఁ గడపిరి. అంతలో నొక సూర్యగ్రహణము వచ్చెను.

పూర్వాచారపరాయణుఁడు నిష్ఠాగరిష్ఠుఁడు నగు గణపతిదేవుఁ డాపుణ్య కాలమున స్నానాదికములు కృష్ణానదిలో నిర్వర్తించుకొన నెంచి ధరణి కోటయందె మఱికొన్నిదినములు కాలక్షేపముఁజేయ నిశ్చయించెను. ధరణికోటలో బౌద్ధులుకట్టిన మందిరములుకలవు. చక్కని పాలరాల పైఁ దీర్చిన చిత్రవిగ్రహములతో నాంధ్రశిల్పుల యమోఘశిల్పమును వెల్లడించు నా బౌద్ధనిలయములు చాలకాలమునుండి త్రిలింగ రాజన్యుల విశ్వాసములకుఁ బాత్రములగుచుండెను. గణపతిదేవునకు ధరణికోటనివాస మానందజనకముగ నుండెను. చుట్టుపట్టులనున్న య న్నిగ్రామముల బ్రాహ్మణులందఱకు గ్రహణస్నానసమయమునఁ బ్రభువర్యుఁడు దానాదికములు గావించును గాన విచ్చేయుఁడునని యా జ్ఞాపత్రికలను గణపతిదేవుఁడు స్వహస్తముతో లిఖించి పంపెను. గ్రహణ స్నానసమయమునకు బ్రాహ్మణులు పెక్కుమంది వచ్చు నేర్పాటులు చేయఁబడెను. గ్రహణకాలము రక్తాక్షి సంవత్సర భాద్రపదామా వాస్య దివసమున. అది వర్షర్తువగుట వలననో గోపరాజు రామమంత్రి లౌక్యప్రభావము వలననో కారణము తెలియదు గాని గ్రహణాంత మున గణపతిదేవుఁడు కృష్ణాతీరమునకు స్నానార్థమేగువఱకు నట నొక బ్రాహ్మణుఁడేని కానరాఁడయ్యెను. తీరమంతయు నిర్జనముగానుండెను. దానార్థమై తెచ్చిన గోకదంబము వస్తువాహనములు నదీతీరమునఁ గనులపండువుగాఁ గానరాఁదొడంగెను. దానపరిగ్రహీత యొకరును లేరు. గణపతిదేవుని వెంటవచ్చిన పరిజనములో నొక్క గోపరాజు రామ ప్రధాని దక్క బ్రాహ్మణుఁ డెవ్వఁడును లేఁడు. ప్రభువునకు మిగుల నుత్సాహభంగమయ్యెను. తన దానములన్నింటిని కట్టిపెట్టవలసినందు లకు మిగుల విచారించెను. బ్రాహ్మణులు రాకుంటకు వర్షర్తుప్రభావమె ముఖ్యహేతువై యుండునని నిశ్చయించి చేయునదిలేక బ్రాహ్మణుఁడు లేకున్న స్నానముఁగావింపననియు గృహమునకు రాననియు వాకొని మిగుల విచారముతో నా విపరీతస్థితిని విచారించుచు నటఁగూర్చుండెను. ఆసమయమున గోపరాజు రామప్రధాని రాజన్యునిముందునకు వచ్చి "ఆర్యా! నేను వేదాధ్యయనము గావించినాఁడను. బ్రాహ్మణుఁడను.

సంకల్పమును జెప్పెదను. స్నానము గావింపుఁడు. వేళ తప్పుచున్న"దని విన్నవించెను. గణపతిదేవుఁడు కొంచెమాలోచించి "పరిగృహీతలు లేనిచో నీపర్వదినమున స్నానముఁ గావించిన ఫలమేమి? స్నానము నిటఁ జేసినను పిడిదిలోఁ జేసినను నొక్కటియే!" యనెను. రామప్రధాని, "రాజన్యా! అట్లైనచో నేనే పరిగృహీతగ నుండెదను. స్నానముఁ గావింపుఁడు. సర్వకార్యములు నిర్వర్తింపఁగల బ్రాహ్మణుఁ డమాత్యుఁడై యుండ మీ కట్టి విచారముతోఁ బనియుండ"దని తెల్పెను. రాజు మాఱుమాటాడక నియోగిమంత్రి దానపాత్రుఁడు కాఁడని తలంచి మిన్నకుండెను. రామయామాత్యుఁడు గణపతిదేవుని యభిప్రాయమునంతయు గ్రహించి ప్రత్యుత్తర మీయక మానరాదని యిట్టుల వాకొనెను:

"ఉ. మానధనుండు బ్రహ్మకుల మండనమూర్తి పరోపకారి దు
ర్మాన దురన్నముల్ గొనఁడు తప్పఁడు స్వామిహితైక కార్యముల్
దీనులఁ బ్రోచు బాంధవవిధేయుఁడు దస్సియు వేఁడఁబూన డం
పూనిన భక్తితోడుత నియోగికొసంగిన దాన మల్పమే?"

ఈ యభిప్రాయము విని గణపతిదేవుఁడు రాజమంత్రిని జూచి "నీవు లేఖకోద్యోగముఁ జేయువాఁడవు. పరాశ్రయములో నున్నవాఁడవు. ఉద్యోగులు దానార్హులు కారు. దానపాత్రులు వైదికమార్గావలంబులును నిరుద్యోగులు నగువారే" యనెను. రామమంత్రి యిట్లు ప్రత్యుత్తరము నొసంగెను.

"ఉ. వ్రాయుట నోసమా! వికృతి వైదికమా! సుతదారరక్షకో
పాయమునకై నియోగినయి పార్థివసేవ యొనర్చునంతనే
పాయునె వంశశీలములు బాగుగ మున్నల చిత్రగుప్తులుం
వ్రాయరె యెల్లలోకముల వారలొనర్చిన పుణ్యపాపముల్."

రామప్రధాని యాంధ్రభాషలో గ్రంథములు రచింప సమర్థుఁడు. విద్వత్కవి. యుక్తులలో నిధి. ఇట్టుల వాకొన రాజు నిరుత్తరుఁడై "ధర్మశాస్త్రములలోఁ గవి దానపాత్రుఁడు కాఁడని యున్నటుల సర్వజ్ఞుఁగు

మీబోటులు వారెందరు. ఎఱింగియెఱింగి యెటుల దానముచేయ వలయు"నని చెప్పెను. దాన రామప్రధాని మిగుల నాగ్రహించి "రాజా! నేను భిక్షుకుఁడఁగాను. దుర్దానములతో నాజీవయాత్ర గడపుకొనుట నాయుద్దేశముగాదు. మీయనుగ్రహమువలన నేనొకని కీయఁగలస్థితి యందె యున్నాను. పరిగ్రహీత లేఁడని తాము విచారించుటచే, నేను సిద్ధముగా నుంటిని, విచారింపనక్కఱలే దని విన్నవించితిని. పరిగ్రహ స్వాశ్రిత నాకులేదనుటచే నాకుఁగల బ్రహ్మత్వముఁ దెలుపుకొంటిని. ఇపుడు కవులుదానార్హులుకారని యాజ్ఞయొసంగితిరి. మీరు దానము చేయనక్కఱలేదు. నేను పరిగ్రహింపనక్కఱలేదు. కాని కవులు దానార్హులగుదురో కాదో యను సంశయమును విన్నవించి మీసంశయముఁదీర్చి నేనీప్రసంగమును గట్టిపెట్టుదును. డస్సియు వేఁడఁబోవని నియోగినగు నాకేల యీ దాస్యభాషణ"మని రామప్రధాని కవులు దానయోగ్యులేయని తెల్పెను.

"చం॥ కవి కమలాసనుండు త్రిజగత్పతియైన పినాకపాణియుం
గవియె తలంపఁగఁ గవులుగారె పరాశర బాదరాయణుల్
కవికృతపుస్తకగ్రహణ గర్వితులల్పులె పూజనొందఁగాఁ
గవులఁట! పూజపాత్రములు కారఁట! యిట్టివిపో విచిత్రముల్"

గణపతిదేవునకు రామమంత్రి సంభాషణము యుక్తియుక్తముగ శాస్త్రబద్ధముగఁ దోఁచెను. వృత్తిలౌక్యము ననుసరించియున్న మాత్రమున నియోగులను బ్రాహ్మణులుకారన నెవరితరము? కేవలము లౌక్యపరతంత్రులై రాజకీయభాషయందుఁ బరిచయముఁ సంపాదించి యుభయధర్మానుసారులైయున్న నియోగులయందున్న బ్రహ్మతేజమే యాంధ్రదేశము నింతవఱకుఁ గీర్తిమంతముగ వెలయించినది. రాజన్యుఁ డానందించి రామమంత్రిచే సంకల్పముఁ జెప్పించికొని సుస్నాతుఁడై నైమిత్తికముల నన్నింటిని నెఱవేర్చికొని "మంత్రివర్యా! నీ కామితము నెఱింగింపుము. ధారాగతము చేయుదు"నని వాకొన రామయమంత్రి కేలుమోడ్చి "రాజవర్యా! నీయనుగ్రహమువలన సర్వైశ్వర్య

ములు మదధీనములై యున్నవి. క్షణభంగురములగు నీయైశ్వర్యము లభివృద్ధిఁగావించికొని యిహపరములకు వెలియగుట నాసంకల్పముకాదు. మీకు దానముచేయవలయునను కోరికయేయున్నచో నేను బ్రతిగ్రహీతనగుట యభిమతమగుచో నేఁడుగడియలు ముద్రాధికారము దయచేయఁగోరెద"నని విన్నవించెను. గణపతిదేవుఁ డపరిమితానందహృదయుఁడై "రాజ్యము వలయునన్న ధారపోయ సిద్ధముగానుండ నీ స్వల్పవాంఛితమును దెల్పితివేమి? మిత్రమా! వలయునేని యింక గొప్పవి కోరుకొమ్ము. ఇచ్చుటకు సర్వసిద్ధముగా నుంటి"నన రామయమంత్రి "చాలును చాలును. అనుగ్రహించియిచ్చిన నింతియచాలును. 'అసంతుష్టాః ద్విజా నష్టాః' యని మనీషులందురుకదా! పవిత్రములగు మీహస్తములనుండి దత్తమగు నిస్స్వల్పమె నాకుఁజాలును. అనుగ్రహించి యొసఁగుఁ"డని కేలుమోడ్చెను. గణపతిదేవుఁడు రాజముద్రికఁ గేలఁగొని జలముతో రామయమంత్రిహస్తములోవిడచుచు "ముద్రాధికారం సప్తఘటికాపర్యంతందాస్యామి" యనుచుఁ ద్రికరణశుద్ధిగ వచించి కృతకృత్యుఁడనైతినని యానందించెను రామయమంత్రి గృహము చేరఁగనే రాజముద్రము చేతఁగొని గ్రామకరణికములన్నియు నియోగులకె యుండవలయునని యదివఱకె నిశ్చయించిన వాఁడగుటచే "ఫర్మానాలు" తయారుచేసి యిదివఱకున్న యగసాలెల నామములన్నిఁటిని తొలంగించి యాయాగ్రామవాసుల నామములన్నింటి నందుఁ జేర్చి రాజముద్రికల చివరముద్రించి రాజన్యునకు ముద్రికనొసంగి "యేడుగడియలుమాత్రమె వినియోగించితిని. నియత కాలములో నా యుద్యమము కొంతవఱకు ఫలించినది అంతియచాలు"నని తాను వ్రాసి మొహరువేసిన యాజ్ఞాపత్రము లన్నింటిని రాజునకుజూపి యగసాలెల దౌర్జన్యములన్నియు బూసగుచ్చినటులఁదెలిపి తన సాహసము సమర్థించెను. గణపతిదేవుఁడంతకుమున్నె యగసాలెల దౌర్జన్యముల నామూలాగ్రముగ నెఱిగియు సమయార్థియై యున్నవాఁడె కావున రామయమంత్రివర్యుని సముద్యమమును వేనోళ్లశ్లాఘించి ధన్యుఁడనైతినని యానందించెను. దానము కోరుకొమ్మనిన నేస్వల్పమునో

కోరుకొనుటయు దానిని సైతము స్వార్థమునకు వినియోగింపక పరోప
కారమునకొఱకు వ్యయించుటయుఁ జూచి రామయమంత్రి ప్రపంచము
నకు మార్గదర్శకుఁడని తనలోఁ దాననుకొని రాజముద్రికను గైకొని
యన్నిగ్రామముల కరణములను (పూర్వమున్నవారిని) తొలఁగించి
నూతనులందఱను రావించి సానురాగంబునఁ దిలకించి ముద్రికా
పట్టముల నన్నింటిని పేరుపేరువరుసను బిల్చి రాజమణి యొసంగెను.
బ్రాహ్మణకరణికములవలనఁ బ్రజలకుఁబూర్వమువలె నెట్టి యవాంత
రములు జరుగకుంటకై రామయామంత్రి యనేకవిధములఁ గిట్టుబా
టులు గావించి నియోగివర్యుల సమక్షమున నిటుల విన్నవించెను:

కం॥ అధికార మబ్బినప్పుడు । బుధులు ప్రమోదించి పేఁడె పురుషోత్తముఁడం
చధికంబుగఁ గొనియాడెడి । విధమున వర్తింపఁదగమె? వేల్పులకైనన్॥

మ॥ విధిసంకల్పముచే నొకానొకఁడు తా విశ్వంబుఁ బాలింపుచో
బధిరండెక్కువ చూపుదక్కువ సదాభాషల్ దురుక్తుల్ మనో
వ్యథలో మత్తతతోడ దుర్వ్యసన దుర్వ్యాపారతన్ జెందు న
య్యధికారాంతమునందుఁ జూడవలదా! యాయయ్య సౌభాగ్యముల్॥

కం॥ ఉద్యోగ మొదవినప్పుడు । సద్యోమద మొదవి పూర్వసరసత లుడుగున్
విద్యావంతునకైనను; । విద్యాహీనునకు వేఱె వివరింజేలా॥

ఉ॥ పండితులుం గవీంద్రులును వందులు మాగధు లర్థు లాశ్రితుల్
నిండినవిద్యతోడఁ గడునేర్పున సత్కృతిఁ జేయుచున్న వా
రొండొకవేళఁ గోపమున నుగ్రమతిన్ శపియించిరేని య
ద్దండతఁ ద్రిట్టిరేని ఘనదైన్యము నొందరె యెట్టివారలున్॥

మీరందఱీనీతివాక్యములరహస్య మెఱింగి యాచరణధర్మము
లెల్లఁ దెలిసికొని బ్రాహ్మణధర్మములు పాలింపవలయును. రాజన్యుఁడు
భారతవర్షమును ఆర్యధర్మానుసారముగఁ బాలించుచున్నాఁడు. ఈ
శుభోదయమున గ్రామపాలనము బ్రాహ్మణేతరులయం దున్నచోఁ
జిక్కులు తటస్థించును. ధర్మము గ్రామములో సంస్థాపితమైనఁగాని

పట్టణములలోఁ బ్రకాశింపదు. పట్టణములు ధర్మారంభమున ముందంజ వేసినఁగాని సామ్రాజ్యమునకు గౌరవము రాదు" అని రామమంత్రి నూతనగణికులగు నియోగులతో వచించి యందఱ కుద్యోగమునకుఁ గాను వృత్తిమాన్యములు పరంపరానుభవానుకూలముగ నొసంగి వారిచే నాశీర్వాదరూపకసంస్తుతులంది పంపివేసెను. వందిమాగధులుఁ మిన్నుముట్టునట్లు గోపరాజు రామప్రధాని పవిత్రజీవితమును గైవారము చేయసాగిరి. సమకాలికులగు కవులు రామమంత్రి నిటుల శ్లాఘించిరి.

"సీ॥ తనకీర్తి యాచంద్రతారార్కముగ మంత్రి కులులకుఁ గరణీకముల నొసంగె
నతిథి సంతర్పణ మనుదినంబు నొసంగి ఖ్యాతిగా హరిహరప్రీతిఁ జేసె
వర్ణాశ్రమాచార నిర్ణయంబులకెల్ల వేదోక్తరీతిగా వెలయఁజేసె
ఘనవిప్రవంది మాగధకవీంద్రులకెల్ల నగ్రహారములిచ్చి యాదరించె।
తే॥ గీ॥ నతఁడు శ్రీగోపరాజాన్వయాబ్ధిచంద్రుఁ
డనఁగ విలసిల్లెఁ దనసాటి జనులుపొగడ
మంత్రిదేవేంద్రుఁడనఁగ స్వతంత్రలీల
మంత్రికులహేళి రామయామాత్యమౌళి।"

రామయామాత్యుని జీవితమాబాలగోపాలమునందు సుప్రసిద్ధమైయున్నది. ఇతని చరిత్రమునందుఁ బరస్పరవిరుద్ధాంశములు కానరావు. ఇతఁడు కరణికములు దానముగావించినది శా. శ. ౧౦౬౭ అని పైనుదాహరించిన దండకవిలెలోని శ్లోకములయందుఁ గలదు. ఈ యర్థమునె బోధించు మఱియొక పద్యము సైతము ప్రచారములోఁ గానవచ్చుచున్నది.

"క॥ ధర గోపరాజు రామన। కరణీకము లుద్ధరించు కాలము దలఁపన్
గిరిబుధిఖగశశాంకులు। కరమొప్పెడి శకమునాఁటి కాలంబయ్యెన్॥"

గణపతిదేవుఁడు క్రీ. శ. ౧౧ ఆరంభమునుండి యున్నటుల దండాకవిలెలో స్పష్టముగా వ్రాయఁబడియున్నది. అందు వెల్లటూరు, కామరాజుగడ్డ, నందంపల్లి, విడువులపాడు, తూర్పురుద్రవరము, గోరం

ట్ల, దుంబాల, మంచాళ్ల, చివ్వలూరు లోనగుగ్రామములు గణపతి దేవుఁడు బ్రాహ్మణులకు దానములొసంగెను. రామయమంత్రి యీ దానములొసంగినకాలమునకు మిగుల చేరువలో నున్నటులఁ బైప ద్యమువలన సువ్యక్తమగుచున్నది. గోపరాజు రామప్రధానిజీవితచరి త్రములో నవనాగరకులు విశ్వసింపఁదగని ప్రకృతివిరుద్ధములగు నంశము లేమియు లేవు. పూర్వ మగసాలెలు కరణీకములుచేసినమాట వాస్త వము. ఇంకను గొన్నిగ్రామములలోఁ గరణములుగఁ గంసాలు లున్నట్లును వారు పరంపరగ నేఁటివఱకుఁ గరణీకము లనుభవించుచు న్నట్లు వినుచున్నారము. గణపతిదేవుని గూర్చి కొంత సందేహపడుచు న్నారు. ఇతఁడు కాకతీయులలోనివాఁడా, కాదా యను సందేహముతోఁ బనిలేదు. ఈగణపతిదేవుఁడు గణపతివంశీయుఁడని పైశ్లోకములలోఁ జెప్పఁబడియున్నది. పైఁగాఁ గాకతీయగణపతికి మిగులఁ బూర్వుఁడు. కావున నీతని వేఱొకనిఁగా భావింపవలయును మనచరిత్రములలో గణపతి దేవు లనేకులు కానవచ్చుచున్నారు. ఇం దీతఁడెవఁడో యనువిషయము భావిపరిశీలనమువలనఁ దేల్చుకొనఁదగినదిగాని చరిత్రాంశమున కట్టి సందేహ మెంతమాత్ర మవసరముండఁజాలదు.

గోపరాజురామప్రధాని నియోగులకుఁ గరణీకములొసఁగిన గ్రామములు ౫౩౫ అని దండకవిలెలోఁ జెప్పఁబడెను. బహుశః ఇవిఁ ప్రత్యేకించి కొండవీటిసీమలోని గ్రామములై యుండును. నియోగులకు గరణీకములొసంగిన గ్రామములెల్ల నాఱువేలనియు నదుచే నియో గుల కాఱువేలవా రనునామము వచ్చినదనియు నొకప్రవాదముకలదు. ఇది విశ్వసనీయముకాదు. గుంటూరుమండలములోని కొంతభాగ మున కారువేలనాడనుపే రున్నట్లును దానినే షట్సహస్రదేశమని వ్యవహరించుచున్నట్లును శాసనాదికము లెఱింగించుచున్నవి. ఈ యా ఱువేలనాడను వ్యవహారనామము ప్రకృతగణపతిదేవుని పైకాలము నుండి వ్యవహారమునం దుంటచే నిది విశ్వసనీయముగాదు.

దండకవిలెలో నియోగులగు కరణములనామములు వారి

కొసంగఁబడిన భూమివిస్తీర్ణము వారిగోత్రము విరళముగా వ్రాయఁబడి యున్నది. పూర్వోత్తరములు విచారించి చూచినచో గోపరాజు రామయమంత్రి యను మహామహుఁ డొనరించిన సాహసకార్యము ద్యోతము గాఁగలదు. రామయమంత్రివలన కరణికములనొందిన నియోగులజాబితాయు, గోత్రములు, పేరులు, వృత్తివిశేషములు తేటతెల్లముగాఁ గానవచ్చుచుండ నీవిషయములో స్వకపోలకల్పనాధురీణులగు చరిత్రకారులు విశ్వసింపనంతమాత్రమున నట్టిప్రతిబంధకము లేదు. కవివర్యుఁడని పేరొందిన గోపరాజురామమంత్రి గ్రంథములఁజదివి యానందించు నదృష్టము భాషాసేవకుల కింతవఱకుఁ బట్టలేదనుట విచారకరము.

---

# ఖడ్గ తిక్కనమంత్రి.

సీ. వేఁడిన నర్థార్థి వృథపుచ్చనేరని దానంబు తనకు బాంధవుఁడుగాఁగ
నెదిరిన జముఁడైన బ్రదికిపోనీయని శౌర్యంబు తన కిష్టసఖుఁడుగాఁగ
శరణుఁజొచ్చిన శత్రువరుఁడైన రక్షించు కరుణయే తనకు సంగాతిగాఁగఁ
బలికినఁ బాండవప్రభుఁడైన మెచ్చని సత్యంబు దనకు రక్షకుఁడుగాఁగ
తే. గీ. జగతి నుతికెక్కె రాయవేశ్యాభుజంగ
రాజ్యరత్నాకరస్ఫూర్తి రాజమూర్తి
గంధవారణబిరుదవిఖ్యాతకీర్తి
దినపతేజుండు సిద్ధయ తిక్కశౌరి॥

ఈ శూరవర్యుఁడు నియోగివంశాలంకారుఁడు. సిద్ధనామాత్యునకుఁ బోలమాంబకు జనించిన యేడుగురుతనయులలోఁ బెద్దవాఁడు. ఇంటిపేరు కొట్టరువువారు. గోత్రము గౌతమసగోత్రము. భారతము రచియించి మనుమసిద్ధి ... ద్రెమొ ... ప్రశస్తిగన్న
తిక్కనసోమయాజు ...
ము దశకుమార ...
గాన నేకోదర ...

నీతికుశలుఁడనియు సర్వశాస్త్రజ్ఞుఁడనియుఁ దెలియుచున్నది. ఇతని విశేషణములుచూడ మంత్రిపదవియందు సైతము కొంతకాలము జరపియున్నటులఁ దోఁచుచున్నది. ఈయాధారములు స్వల్పములుగ నుంటచేఁ జర్చింపమానితిమి. ఖడ్గతిక్కన మనుమసిద్ధిరాజ్యకాలములో మిక్కిలి ప్రసిద్ధివహించెను. ఈ మహామహుని శూరజీవితము దేశీయులచే నేఁటికి స్మరింపఁబడుచున్నది. మొదటినుండియు నీ తిక్కనవంశీయులు మంత్రిత్వములోఁ బ్రసిద్ధులైయుంటవలనను, మంత్రివంశమనఁదగు నియోగిశాఖలో జనించినవాఁడగుటవలనను నీతనిజీవితము మంత్రుల జీవితములోఁ జేర్చుట సాహసకార్యము కాఁజాలదు.

ఖడ్గతిక్కన మనుమసిద్ధిరాజుసంస్థానమునఁ బ్రధానదండనాయకుఁడుగనుండి యనేకసంగ్రామములలో విజయమునుగడించి ప్రభుఋణముఁ దీర్చికొనెను. ఈతని జననియగు పోలమ స్తన్యప్రభావము యన్నివిధములఁ బ్రఖ్యాతుని గావించెననుట సహజోక్తియె. ఖడ్గతిక్కన కేవల దండనాయకత్వములో వర్తించి బ్రాహ్మ్యధర్మముల మఱచినవాఁడుకాఁడు. వేదగానలోలుఁడు. బ్రాహ్మణకుటుంబపోషకుఁడు. దానకర్ణుఁడు. విరోధిఖండనచణుఁడు. ఈమహామహుని యాశ్రయమున "రాయవేశ్యాభుజంగ" "రాజమూర్తిగంధవారణా"ది బిరుదములన్వర్థములై ప్రశస్తివంతములయ్యెను. ఒక కవితావిషయమై యేమియుఁ జెప్పఁజాలముగాని పరాక్రమౌదార్యపాండిత్యరాజకీయపరిజ్ఞానములలో ఖడ్గతిక్కనమంత్రివర్యుఁడు తిక్కనసోమయాజి కెందును దీసిపోవక పైచేయియని సైతి మనఁదగియున్నాఁడు. కేతనకవి కనులారఁ జూచి ఖడ్గతిక్కనను గొప్పగ వర్ణించియున్నాఁడు.

ఖడ్గతిక్కన జీవితమునుదెలుపు [illegible] పద్యములనేకములు వ్యవహారమున [illegible] ాముఁడని యాపద్యము

[illegible] యుచుండు

[illegible] ఖతును

బ్రాహ్మణావళికి ధారలంపోసినజలంబు సతతంబు ముంగిట జాలువాఱు
రిపుల కొసంగిన పత్రికల ప్రతికలను బాయక కరణముల్ వ్రాయుచుంద్రు
తే॥ గీ॥ మానధనుఁడైన తిక్కనమంత్రియింట
మదనసముఁడైన తిక్కనమంత్రియింట
మహితయశుఁడైన తిక్కనమంత్రియింట
మంత్రిమణియైన తిక్కనమంత్రియింట॥"

తిక్కనజీవితముతోఁబాటు గృహము సైతము పవిత్రతమ మైనదని పైచాటుపద్యమువలన వేద్యము కాఁగలదు. ఈ వీరచూడామణి యాంధ్రక్షాత్రమునకు మెఱుంగుపెట్టెను. కొట్టరువు వంశ మీతనివలన సమస్తవిధములఁ బవిత్రమయ్యెను. రాజకార్య ధురంధరత్వమున క్షాత్రమున నాంధ్రజాతులలోని యేశూరవంశ్యుల కేని బ్రాహ్మణులు తీసిపోరనుసిద్ధాంతమున కీ ఖడ్గతిక్కనజీవితము తోడ్పడుచున్నది. ఖడ్గతిక్కనసహాయముతో మనుమసిద్ధిరా జనేక దిగ్విజయము లొనరించియుండును. ఖడ్గతిక్కన యేవిజయములో నెంతవఱకుఁ దోడ్పడెనో తెలుపునాధారములు కానరావు. ఇతని వీర చర్య వాకొను కాటమరాజుకథయొకటె గ్రంథస్థమై యున్నది.దీనిచే ఖడ్గతిక్కన శక్తిసామర్థ్యములు మనము గ్రహింపవచ్చును. ఈ విషయ మును స్థాపించు మఱికొన్ని చాటుపద్యములు సైతము దేశమున వ్యాప్తి వహించియున్నవి.

కాటమరా జను యాదవవంశీయుఁడు నెల్లూరుమండలములోని కనిగిరిసీమలోని యెఱ్ఱగడ్డపాడు పాలించుచుండెను. ఇతఁడు గొప్ప భూస్వామియుఁ బశుధనముగలవాఁడై ప్రజారంజకముగఁ గాలము గడపుచుండెను. ఆకాలమునఁ గొన్నిసంవత్సరము లనావృష్టి తట స్థించెను. ప్రజ లన్నములేక యల్లాడసాగిరి. పశువులు త్రాగుటకునీరు తినుటకు మేఁత లేక శుష్కించిపోవసాగెను. దేశము పీల్చి పిప్పిచేయు చున్న యాభయంకరక్షామకాలమున నోరులేని పశువులొందు దుర వస్థఁ జూచి సహింపలేక సుభిక్షముగనున్నచోట పశువుల మేపుకొని

దేశము శాంతించిన పిమ్మట జన్మస్థానముఁ జేరవచ్చునని కాటమరాజు సహచరులతోఁ గలసి తమ పశువుల నన్నింటిని మందగాఁ దోలుకొని బయలు వెడలెను. నెల్లూరుచెంతఁ బెన్నాతీరమునఁ బచ్చిక దట్టముగాఁ బెఱిఁగియుండెను. తృణజలసమృద్ధమగు నదీతీరమునఁ బసువుల బ్రతికింప వచ్చునని యాయాదవరాజు లందఱు నట విడిసిరి. అపు డాప్రదేశము నెల్లూరిరాజ్యములోనిదై మనుమసిద్ధిరాజుపరిపాలనమునకుఁ జెంది యుండెను. కాటమరాజు మనుమసిద్ధిరాజును సందర్శించి పసువుల మేపుకొనినందులకుఁ బుల్లరి యేర్పాటుఁగావించికొని బీళ్లన్నియు స్వాధీనము చేసికొని పశువులఁ గొంతకాలము మేపుకొనెను. అంతలో నెఱ్ఱగడ్డ పాడు ప్రాంతములలో వర్షములు కురిసి నదీతీరములలోఁ బచ్చిక మిగులఁబట్టినటులఁ గాటమురాజునకు వర్తమానము వచ్చుటచే సహచరులను గలసి పశువులఁ దోలుకొని మనుమసిద్ధిరాజునకుఁ బుల్లరి చెల్లింపకయే వెడలిపోయెను. మనుమసిద్ధిరాజు యాదవులు పుల్లరి నెగఁగొట్టి పశువులఁదోలుకొని యేగినవార్తవిని మండిపడి "అన్నముభట్టు" అను బ్రాహ్మణుని పుల్లరివిషయమై విచారించుటకు రాయబారిగాఁ గాటమరాజు వద్దకుఁబంపెను. కాటమరాజా రాయబారిని సరకుఁజేయక "పుల్లరిగొనుసంగము పొ"మ్మని నిరాకరించెను. మనుమసిద్ధిరాజు రాయబారివలన సర్వము నెఱింగి యూరకున్న లాభములేదని కాటమరాజును వంచించి పుల్లరిఁగొని రావలయునని సర్వసైన్యసమేతుఁడై సంగరమునకు బయలు వెడలెను.

కాటమరా జీయంశ మెఱింగి (కొండపల్లి) చల్లపిన్నమనాయకుఁడు, (గొనకొండ) అయితమరాజు, ఎఱ్ఱయ్య, భట్టామరాజు, కరియావులరాజు, వల్లభన్న, నేతి ముద్దయ్యనాయకుఁడు, పుత్తమరాజు లోనగు యాదవవీరులను సైన్యముతో నాయత్తపఱచి పిన్నమనాయని మంత్రిగను బ్రహ్మరుద్రయ్య యను బ్రాహ్మణుని సేనానాయకునిగను నియోగించి మనుమసిద్ధిని ప్రతిఘటింపఁదలపడెను. ఖడ్గతిక్కన యను మన కథానాయకుఁడు మనుమసిద్ధికి సేనానాయకుఁడై కాటమరాజు

సైన్యమును పాలయేటియొడ్డున నున్న పంచలింగములకడఁ బ్రతిఘటించెను. ఉభయసైన్యముల కచట మిగుల ఘోరమగు సంగ్రామము జరిగెను. యాదవసైన్యము పిక్కచెదరులేక నానాసంగ్రామములలో నాఱితేఱిన ఖడ్గతిక్కననాయకత్వముక్రిందఁగల ప్రతిపక్షసైన్యముతో హోరాహోరిగా పోరాడి ముందడుగు వేయసాగెను. ఖడ్గతిక్కన సైనికులకు బ్రోత్సాహవాక్యములఁ దెలుపుచు ముందునకు నడపించి కాటమరాజు సైన్యమును వెనుకడుగు వేయింపసాగెను. చిరకాల మిటుల సమరము సమముగ జరిగెఁ గాని జయాపజయములు మాత్రము నేర్పరింప వీలుకాదయ్యె. విధివశమునఁ గ్రమముగ యాదవసైన్యములకు విజయము లభింపసాగెను. మనుమసిద్ధిరాజుసైన్యములు పలుచఁబడసాగెను. హతశేషముగు సైన్యమును దోడ్కొని ఖడ్గతిక్కన ప్రతిపక్షసైన్యములో దుమికి చెల్లాచెదరుగావించి సాహసస్థైర్యములతోఁ జాలసేపు పోరాడెను. యాదవులకుసైతము విజయముపై నాస తొలంగెను. ధర్మబద్ధులగు యాదవులు బ్రాహ్మణవధ యుక్తము కాదని తలంచి ఖడ్గతిక్కనను బ్రతిఘటింపనోపక యిటుల వాకొనిరి:

"పోరునిలుపుమోయి భూసురోత్తముఁడ
సరిగాదుమాతోడ సమరంబుఁజేయ
అగ్రజుల్ మీరు యాదవులము మేము
ఉగ్రంబు మామీఁద నుంచఁగరాదు."

యాదవులు తలపడిపోరక యిటులఁ బలుకుటనాలించి సైన్యము నశించుటఁజూచి కొలఁదిసైన్యముతో శత్రువులను జయించుట దుస్తరమనిభావించి నెల్లూరునఁ గల మిగిలినసైన్యమును గొని సంగ్రామరంగము నలంకరింపనెంచి ఖడ్గతిక్కన తన గుఱ్ఱమును గృహాభిముఖముఁ గావించెను. కొలఁది దినములకు ఖడ్గతిక్కన గృహముచేరినఁ జూచి మంచములోనుండి మరణదినమునకై వేచియున్న శతవృద్ధుఁడగు సిద్ధనామాత్యుఁడు కోపించి "ఛీ! నీమొగము చూడరాదు. సంగ్రామరంగమునుండి తుచ్ఛప్రాణముల కాసపడివచ్చిన నీబ్రతుకు నొక బ్రతుకే?"యని యిట్లు మిక్కిలి తూలనాడెను.

"సీ॥ రణరంగమున మోహరంబులు పొడఁగని ప్రాణంబు దాఁచిన పందగజము
విజయాధిపునిదాడి వెనుకొని తిరుగక దెసఁదప్పివచ్చిన దిగ్గజంబు
పెనుపల్లిచెఱువులో బిరుదులన్నియు వైచి పరుగెత్తివచ్చిన పాఱుఁబోతు
దురములోఁ జావక దొరలెల్లహసియింప మంచాన కొఱఁగిన కొంచెకాఁడ
తే॥ యనుచు నార్వేలవారు నిన్నుపహసింప
ధరణి నెల్లూరులో నెట్లు తిరుగఁగలవు
వైరులనుగెల్చి సత్కీర్తిఁ బడయుమయ్య
మంత్రికులహేళి తిక్కనామాత్యమౌళి."

తండ్రియొనరించిన నిందచేఁ దిక్కనహృదయము కలఁగిపోయెను. పాదము మొదలు తలవఱకు సూదులతో బొడచినటు లయ్యెను. కోప మాపుకొని తనలోపమునకుఁ దానె చింతించి యా శతవృద్ధునకు నమస్కరించి గృహములోనికేగెను. తనభర్త యలసి వచ్చినందునకు మిగులఁ బరితపించినటుల నటించి యాతనిభార్యయగు చానమ్మ స్నానార్థమై వేడినీరు బిందెకుఁదోడి దానిచెంతఁ గొంచెము పసుపు కుంకుమ యుంచి యొక నులకమంచము నాబిందెకుఁ జాటుగ నుంచి వెడలిపోయెను. తిక్కన స్నానార్థమై యటకేగి పరిశీలింప స్త్రీస్నానోచితములగు పదార్థములు కానవచ్చుటకు సంశయించి తనభార్యను పిల్చి యిదియేమని యడిగెను. దానికి చానమ్మ,

"కం॥ పగఱకు వెన్నిచ్చినచో । నగరే నిను మగతనంపు నాయకులెందున్
ముగురాడువారమైతిమి । వగ పేటికి జలకమాడ వచ్చినచోటన్॥"

అని ప్రత్యుత్తరమిచ్చెను. వీరపత్నియగు చానమ్మ పలికిన పలుకులు ఖడ్గతిక్కనకు విచారము నానందము జనింపఁజేసెను. చేయునదిలేక తనలోపమునకుఁ దానె విచారపడి యెటులో స్నానమును ముగించి భోజనగృహములోని కేగెను. ఆతని జననియగు పోలమ్మ తనయునాదరించి విస్తరిలో నాహారపదార్థములుంచి కుడువఁ బెట్టెను. భోజనము సగమగువఱకుఁ బోలమాంబ విఱిగిపోయిన పాలుగొనివచ్చి విస్తరిలోఁబోసెను. తనయుఁడు తల్లినిగాంచి "పాలిటుల విఱిగినవేమి?" యన నావీరమాత యించుకేనియు సంశయింపక,

"క॥ అసదృశముగ నరివీరుల । బసమీఱంగ గెలువలేక పందక్రియ న్నీ
వసివైచి తిరిగివచ్చిన । పసులం న్విరిగినవి తిక్క! పాలుండ్ విరిగెన్ ।"

వీరమాత యిటులపలుక ఆతని హృదయము శతధా భిన్నమయ్యెను. రాజ్యమునం దంతటను దిక్కన సంగరమునఁ బాఱిపోయివచ్చెనను నపవాదము వ్యాపించెను. క్రమముగ వీరపత్నియగు భార్యయు వీరమాతయగు జననియుఁ గావించిన పరాభవములు క్రోధము జనింపఁజేయక తన ప్రమాదమును స్మరింపఁజేసెను. జనకుని యెత్తిపొడుపు మాటలు హృదయమర్మములు సారెకు భేదింప సాగెను. ఇటుల ముప్వురిచే ఖడ్గతిక్కన యవమానితుఁడై గృహమువదలి విజయమునొంది గాని విక్రమసింహపురమును దిరిగిచూడనని ప్రతిన గావించి వలయు సైన్యమును వెనువెంటఁగొని సంగ్రామరంగమున కశ్వారూఢుఁడైయేగి శత్రువులందఱు కన్నిరూపులుగఁ గానవచ్చుచు ఘోరముగఁ బోరాడ సాగెను. ఖడ్గతిక్కనసంగ్రామము నాకాలపుఁగవి యొకఁడిటుల వర్ణించియున్నాఁడు.

"చ॥ పదటున వాజి రాహుతులపై దుమికింపుచుఁ దిక్కఁడార్చినన్
బెదరి భ్రమించి భీతిపడి పెల్లుగఁ జూడ్కులు సంచలింపఁగా
నదియుదెవాజి వాల్మెఱుంగు లల్లవె యాతఁడె తిక్కఁడంచనన్
గొదుకక యాజిచేసె రిపుకోటుల కందఱ కన్నిరూపులై "

భయంకరాహవంబునఁ బ్రళయకాల మహానటునివలె విజయముపైన దృష్టియుంచి నిశ్చలముగఁ బోరాడు ఖడ్గతిక్కనవిక్రమమునకు వెఱచి సైనికులు తొట్రుపడసాగిరి. కాటమరాజుసైన్యము చలింపసాగెను. కడకుఁ గర్తవ్యము తోఁచక కాటమురాజు రంగమున కరుదెంచి ఖడ్గతిక్కనను సాహసముతో నెదిరించి "ఓవిప్రోత్తమా! పోరుడుగుము. పోరుడుగుము. బ్రాహ్మణవధ మిగుల పాపకరము. బ్రహ్మహత్యాపాపము నేల మాకంతమునఁ జుట్టుదువు? చేతులార నిన్ను వధింపఁజాలను. పొ"మ్మని సగౌరవంబు భాషించెను. ఖడ్గతిక్కన యాతని వాక్యములకు నవ్వి "పరాక్రమములేకున్నఁ బాఱిపొమ్ము. లేదా పుల్లరి

నాసంగి శరణుగోరుము. ఈరెండుమార్గముల కియ్యకొనక ధర్మపన్నములువల్లించిన నిన్ను కరుణించుటకు ననుమాట కలలోనివార్త. రాఁజాలిన రమ్ము. లేకున్న మీ సైన్యమును వెనుకకు మరలింపుము," అని భాషింపఁజేయునదిలేక కాటమురాజు తనసైన్యమును దిక్కనమీఁదికిఁ బురికొల్పి తాను వెనుకనుండి పోరాడసాగెను. బ్రాహ్మణభక్తిపరుండగు కాటమురాజు రెండుమూడుమాఱులు మంచి యవకాశము లభించినను బ్రహ్మహత్యాభయపీడితుఁడై తిక్కనను బ్రతిఘటింపమానెను. తిక్కనమాత్రము సందిగ్ధసమయమున ముందు వెనుక లాలోచింపక యాదవబలముల నిర్మూలముఁ జేయసాగెను. సేనానాయకుఁడగు బ్రహ్మరుద్రయ్య యీవిషయముగ్రహించి కాటమురాజును సమీపించి "రాజన్యా! నీ వాగుము. బ్రాహ్మణుఁడని ఖడ్గతిక్కనను నీవు వదలుటచే మనసైన్యమునకు మితిలేని నష్టము కలుగుచున్నది. వర్ణాశ్రమధర్మములు సంగ్రామరంగముననా విచారింపవలసినది! నీవు వెనుకకుమాత్రము సేనానాయకుఁడుగ నుండుము. నేను ముందు నడతు" ననుచు యాదవబలంబులతో ఖడ్గతిక్కనపైకి నుఱికెను. భీమ దుర్యోధనులవలె నుభయవీరులు బ్రహ్మతేజము ప్రజ్వరిల్లఁ జాలసేపు ఘోరముగఁబోరాడసాగిరి. పదాతియుఁ బదాతియు నాశ్వికుఁడు నాశ్వికుఁడు సమముగ జన్యముకావించిరి. రణరంగమంతయుఁ గళేబరములతోడను రక్తప్రవాహములతోడను శల్యరాసులతోడను నిండిపోయెను. భూతప్రేతాదులు తాండవింపసాగెను. మదపుటేనుఁగుల చందమునఁ జాలసేపు సమముగఁ బోరాడి బ్రహ్మరుద్రయ్యయు ఖడ్గతిక్కనయు వ్రణకిణగాత్రులై పూచిన మోదుగుపొదలవలెఁ గానరాసాగిరి. కాలవశమున వీరచూడామణియగు ఖడ్గతిక్కన ప్రతివీరుని ఖడ్గపాతమున కెఱయై వీరమరణము నొందెను. ఖడ్గతిక్కనతల త్రెళ్ళిపడఁగానే యాతఁడెక్కు నుత్తమాశ్వము వేగముగ ముందునకేగి యావీరుని యుత్తమాంగమును నోటఁ గఱచుకొని గృహమునకేగి కరాళించెను. పరిచితమగు నాహయమొనరించు సకిలింపు నాలకించి గృహమునందున్న యాబాలవృద్ధులు బయటికేతెంచి ఖడ్గతిక్కనశిరమునుజూచి పెక్కుభంగుల వాపోయిరి.

వృద్ధులగు జననీజనకులు తనయుని శిరమును ముందుంచుకొని చాల సేపు విచారించి ధైర్యము తెచ్చికొని వీరోచితమగు మరణమునొందిన తనయునిచేఁ దమజీవితము పవిత్రమయ్యెనని యీవిధముగఁ బ్రశంసించిరి.

"ఉ॥ తక్కక తల్లిదండ్రిలము ధన్యతఁ గన్నబుణంబుఁదీర్చె మా
తిక్కనమంత్రి సోమశిలదేవునిసాక్షిగఁ బెన్నసాక్షిగా
స్రుక్కక మాఱుకొన్న రణశూరులసాక్షిగఁ గొండసాక్షిగా
నెక్కినవాజిసాక్షిగ రవీందుముఖగ్రహరాజి సాక్షిగన్॥"

ఖడ్గతిక్కన గతించుటచే నాతని రక్తసంబంధు లందఱు పరిపరి విధముల శోకించిరి. పౌరులు నైతము వీరచూడామణియగు ఖడ్గతిక్కనవీరుఁడు గతించుటచేఁ దమపురము సర్వవిధములఁ జిన్నపోయినదని యిటుల వందుర సాగిరి.

"ఉ॥ వెన్నెలలేనిరాత్రియు రవిప్రభలేని దివంబు నీరులే
కున్న సరోవరంబు కడునింపగు దీపములేని యిల్లునై
విన్నదనంబునొందె మన విక్రమసింహపురంబు చూడఁగాఁ
బున్నమచంద్రుఁబోలు మన పోలనుతిక్కఁడు లేమినక్కటా॥"

బ్రాహ్మక్షత్రియుల కాటపట్టగు ఖడ్గతిక్కనతో నెల్లూరు పురవైభవమంతయు నశించినటులఁ బౌరులు భావింప సాగిరి. ఖడ్గతిక్కనయకాలమరణమునకు మిగుల విచారమునొంది యాతనియాశ్రయమున జీవించువారును నాతని విక్రమాదికములు స్వయముగా నెఱింగిన వారునగు కవులు చింతాక్రాంతచిత్తులై పద్యరూపముగఁ దమ శోకావేగము నిటుల వెల్లడించిరి.

"సీ॥ ధైర్యంబు నీమేనఁదగిలియుండుటఁజూచి చలియించి మందరాచలము దిరిగె
గాంభీర్యమెల్ల నీకడనుండఁగాఁజూచి కాకుత్స్థుచే వార్ధి కట్టువడియె
అలలక్ష్మి నీయురస్స్థలి వసింపఁగఁజూచి హరిపోయి బలి దానమడుగుకొనియె
ఆకారమెల్లనీయందె యుండుటఁజేసి మరుఁడు చిచ్చునఁబడి మడిసిచనియెఁ

తే॥ గీ॥ దిక్కదండనాథ దేవేంద్రపురికి నీ
వరుగు వెటెంగినగము దిరుగు టుడుగు
నర్థికట్టువిడచు హరియక్క యయ్యెఁదీలు
మరుఁడు మెలఁగనేర్చు మగలరాయ॥"

తిక్కనయోధుని మరణముచే విక్రమసింహపురంబంతయు నార్తనాదములతోఁ నిండిపోయెను. రణరంగమునఁ గనులార ఖడ్గతిక్కన మరణముఁ గాంచిన యోధులవిచారము దెలుపుట దుస్తరము. ఖడ్గతిక్కన దుర్మరణముగాంచి యాతని సైనికదళములోఁ జేరిన యొక కవివర్యుఁ డీరీతి నాతనిమరణమునకై పరితపించెను.

"సీ॥ నందినిబుత్తెంచె నిందుశేఖరుఁడు నీవన్నయే తెమ్ము తారాద్రికడకు
గరుడిని బుత్తెంచె నరహరి రావయ్య గురుసిద్ధ తిక్క వైకుంఠమునకు
హంసను బుత్తెంచె నజుఁడు నీకడకు నుభయకులమిత్ర రా బ్రహ్మకడకు
నైరావతముఁ బంపెనమరేంద్రుఁడిప్పుడు దివమునకే తెమ్ము తిక్కయోధ
తే॥ గీ॥ అనుచు వేలువేల నర్థితోఁ బిలువంగ
వారు వీరుఁగూడ వచ్చి వచ్చి
దివ్యయోగియైన తిక్కనామాత్యుండు
సూర్యమండలంబుఁ జొచ్చి పోయె॥"

ఇంచుమించుగ ఖడ్గతిక్కనతో నీవీరకుటుంబ మంతరించిన దనియే చెప్పవచ్చును. వీరపత్నియు వీరమాతయు వీరజనకుఁడు గల ఖడ్గతిక్కనయొక్క సుకృతమునకు మేఱయిడ నలవికాదు. ఆంధ్రదేశమంతయు నొక్కమాఱు తిక్కన మరణముచేఁ బరితపించెననుట కాతనిగూర్చి వాడుకలోనున్న చాటుపద్యములు చాలును. ఆంధ్రదేశాభిమాని, ఆంధ్రవీరుఁడు, ఆంధ్రమంత్రియగు ఖడ్గతిక్కన గతించిననాఁ డాంధ్రమాత వీరుఁడగు నొకతనయుని గోల్పోయెను. ఆంధ్రమాత కట్టితనయుఁడు, నాంధ్రుల కట్టి వీరమార్గాదర్శకుఁడు లభించుట యరిది. కాటమురాజు, మనుమసిద్ధి గూడ నీసంగ్రామముననె గతించినటులఁ గాటమురాజుకథలలోఁ గలదు. ఖడ్గతిక్కనజీవితము మిక్కిలి

ధన్యమైనది. ఆంధ్రసోదరులకు ఖడ్గతిక్కన నిర్యాణస్థానముగఁ జెప్పఁబడిన పంచలింగములు, చెంతగల పాలేటియు లోకదర్శనీయ క్షేత్రరాజము. ఆంధ్రమాతృపవిత్రతేజము, ఆంధ్రవీరుని విక్రమజ్వాల దేశీయుల యంతరంగచక్షువుల కటఁ బ్రత్యక్షము కాఁగలదు.

ఖడ్గతిక్కనజీవితములోని యితరాంశములు గొన్ని తిక్కనసోమయాజి జీవితమునందుఁ గలవు. ఇతని జీవితకాలము సైతము రమారమి తిక్కనసోమయాజి జీవితకాలముతో సరిపోవునుగాన నిందా చర్చ మానితిమి.

"ఉ॥ శ్రీలలరారఁ శత్రువులఁ గెండితి వార్యులు మంత్రివర్యు లా
ర్వేలఘునుల్ నుతించి రలవేల్పుగొరల్ ముదమంది మెచ్చిరో
లాలితశౌర్య ధైర్య! జయలక్ష్మి ప్రియంబున నిన్వరించె నీ
లీలలు హెచ్చెఁ దిక్కని కళేబరమా! యిటనిల్చి యాడవే॥"



# మాధవ విద్యారణ్యులు.

కాకతీయసామ్రాజ్యము విచ్ఛిన్నమైనపిమ్మట నా సంస్థానమున మంత్రిగను కోశాధ్యక్షులుగనున్న హరిహరరాయలు బుక్కరాయలు స్థానభ్రష్టులై పంపాసరోవరప్రాంతములకుఁ జేరిరి. తుంగభద్రాతీరనివాసియు, సర్వవిద్యాపారంగతుఁడును, యజుశ్శాఖీయుఁడు, భారద్వాజగోత్రుఁడు, బోధాయనసూత్రుఁడు నగు మాధవాచార్యులను నొక బ్రాహ్మణుఁడు తొలుత నీహరిహరరాయ బుక్కరాయలకుఁ బరిచితుఁడయ్యెను. విద్యాప్రియులగు నీయుగళమునకు మాధవాచార్యులతో నచిరకాలమున గాఢమగు స్నేహము సమకూరెను. హరిహరరాయ బుక్కరాయ లిరువురు సోదరులు. ఓరుగల్లునుండి వచ్చునపుడు పరిమితిలేనిధనమును సైనికబలమును వెంటఁగొని వచ్చినవారగుటచేఁ బ్రత్యేకసంస్థాన మొకటి సంస్థాపింపనెంచి యీ కార్యనిర్వహణభారమును మాధవాచార్యులయం దుంచిరి.

మన కథాకాలమగు క్రీ. శ. ౧౩౩౬ లో మహారాష్ట్రాంధ్రదేశములు తురుష్కహస్తగతములయ్యెను. అగ్నిజ్వాలవలె మహమ్మదీయ రాజ్యము దేశమునంతయు నావరింపసాగెను. మలికాపూరను మహమ్మదీయ సేనానాయకుడు కర్ణాటరాజ్యములోని ద్వారకసముద్రమును ముట్టడించి యాదేశమును సారహీనమును, దుర్బలమును గావించి వెడలిపోయెను. ఈసందిగ్ధసమయములోనె మాధవాచార్యుల యమోఘ విజ్ఞానమును సాధనముగాఁ గొని హరిహరరాయబుక్కరాయలు హిందూ నసామ్రాజ్యస్థాపనమున కుద్దేశించిరి.

ఆంధ్రదేశములోని ముఖ్యభాగములు మహమ్మదీయుల హస్తగతములగుటచే హరిహరరాయ బుక్కరాయలు కర్ణాటదేశసమీపమున సామ్రాజ్యము స్థాపింప నుద్దేశించిరి. విద్యాసముద్రుఁడగు మాధవాచార్యు లాయుద్యమము గ్రహించి రాజనీతి ననుసరించి దుర్గనిర్మాణమున కర్హమగుస్థల మేదియోయని విచారింపసాగెను. మాధవాచార్యులు తుంగభద్రాతరంగిణి కేగి స్నానజపాది నైమిత్తికము లన్నియు నిర్వర్తించి వచ్చుచుండ వేటకుక్కలు కుందేళ్లచేఁ దఱుమబడి పఱుగెత్తుచుండెను. మాధవమంత్రి యావిచిత్రమును గాంచి విస్మయమునొంది నిర్జీవపదార్థములకుసైతము చైతన్యము జనించు నీపవిత్రస్థలముననే కోట గట్టవలయునని సంకల్పించెనని కొందఱు చెప్పుచున్నారు. ప్రకృతకథాస్థానము రామాయణమువలన సుప్రసిద్ధమైన మతంగపర్వతప్రాంతభూమి. మతంగమహర్షి యెంతబలవంతులకైన నీప్రదేశ మభేద్యమని వాకొనెఁగావున నీక్షేత్రము జీవగడ్డ, వీరభూమి. శ్రీరామచంద్రుని పావనపాదారవింద సంస్పర్శనముచేఁ బునీతమైన ప్రదేశము. ఆత్మజ్ఞులగు మునీంద్రుల కాటపట్టు. కావుననె యచట కోటగట్టవలయునను సంకల్పము మాధవాచార్యులహృదయమున నంకురించెను. తుంగభద్రాతీరముననున్న యాశైలప్రాంతభూమి విరోధభూపాలుర కభేద్యమని దుర్గనిర్మాణమున కియ్యకొనెను. రామాయణములోఁ గిష్కింధయని చెప్పఁబడిన ప్రదేశమునందే మా

ధవవిద్యారణ్యులు దుర్గమును గట్టింప నిశ్చయించెను. జీవనదియగు తుంగభద్రి యుత్తరముగఁ బ్రవహించు నొకానొక పవిత్రప్రదేశమును నాంధ్రసామ్రాజ్యమునకు ముఖ్యస్థానముఁ జేయ మాధవాచార్యులు నిర్ణయించెను. తుంగభద్రానది యచట నంజనపర్వతము, మాల్యవంతము, మతంగపర్వతము, ఋష్యమూకమను పర్వతములనంటి ప్రవహించుచుండెను. ఈ ప్రదేశమునకుఁ దూర్పునఁ బడమట కృష్ణశిలాపర్వతపంక్తులు, దక్షిణమున రామదుర్గమను కొండలు, నుత్తరమునఁ దుంగభద్రానదియు మఱికొన్నిగుట్టలు నుంటచే నాచోటు స్వభావసిద్ధముగ గొప్పదుర్గమువలె నుండెను. ఈప్రదేశమునె యిపుడు హంపీవిరూపాక్ష మనుచున్నారు. మాధవాచార్యులు తన యమోఘమగు బుద్ధిబలమునంతయు వినియోగించి సహజదుర్గమనుగు నా ప్రదేశమును సులభముగ దుర్గముగమార్పఁ బ్రయత్నించెను. రాజధాని నిర్మింపఁదలఁచిన యా పవిత్రస్థలమునకుఁ జుట్టు సంరక్షణార్థమై యేడు ప్రాకారములను గట్టించెను చుట్టు నిమ్నోన్నతములుగనున్న పర్వతము లన్నింటికిఁగలిపి విరోధిజనాభేద్యముగ మిగుల దృఢతరమైన యొక గోడఁ గట్టించెను. ఈ ప్రాకారము మిగులదృఢతరమై శైలములతోఁ గలసి యభేద్యముగా నలరారెను. ప్రాకారముల నొఱసికొని తుంగభద్రానది యెడ తెగక పాఱుచుఁ ద్రవ్వనిపరిఖవలె నలరారుటచే నావైపులనుండి శత్రువులు ప్రయాణముచేయ నసాధ్యముగ నుండెను. దక్షిణమున నొకగొప్ప రాతిగోడ కట్టించి కొండలతోఁగలసి నైరృతి దిశనుండి ప్రత్యర్థులు రాకుంటకై మిగుల లోతును విశాలమునగు తటాకము నొకటి ప్రాకారముచేతఁ ద్రవ్వించి దుర్గమును మాధవాచార్యులు గృహస్థుల సంరక్షణము గావించెను. ఏడుప్రాకారముల యందు మిగుల దృఢములైన దుర్గములు (బురుజులు) సైనికనివాసములు రాజమందిరములు నెలకొల్పి పట్టణమునకుఁ జలనములేని రక్షణమును నెలకొల్పి సామ్రాజ్యస్థాపనమునకు బీజమునాఁటిన దీ మాధవాచార్యులె. ఈ పురరాజము విద్యానగరము. దీనిని శ్రీవిద్యాచక్రము ననుసరించి రేఖాదీర్చి మాధవాచార్యులు నిర్మించెననియు

నందువలన నె శ్రీవిద్యానగరమని నామకరణముఁ గావించెననియుఁ గొం దఱు చెప్పుచున్నారు. విద్యానగరనిర్మాణము ప్రశంసాపాత్రమైనది. ప్రకృతిమనోహరము దుర్గమము నగు నీప్రదేశమును గుర్తించి దుర్గ నిర్మాణమునకు బుద్ధివినియోగించి దృఢతరమగు కోటఁగట్టించి కొన్ని వందలసంవత్సరములు శాశ్వతముగ రాజ్యము నిలచుటకుఁ గారకుఁ డైన మాధవాచార్యుని మేధాబలము మానవాతీతము. విద్యానగ రము సామాన్యపట్టనముకాదు. సప్తప్రాకారములమధ్య సురక్షిత ముగఁ గట్టఁబడిన యీ పురరాజము పదునాలుగుమైళ్ళ పొడుగును పదిమైళ్ళ వెడల్పును నూటనలువది చతురపుమైళ్ళ వైశాల్యమును గలిగి యుండెను. తురుష్కరాజన్యుల శౌర్యమునాపి సర్వవిధములఁ గాపాడిన యీ దుర్గప్రశస్తి యెంతిచెప్పినను దనివి తీఱదు. ఈ దుర్గము మంచిస్థితిలో నున్నపుడందు ముప్పదిలక్షలమందికిఁ బైగఁ బ్రజలునివసించి యుండిరని యొకరు వ్రాసియున్నారు. ఆకాలమున మహమ్మదీయుల దాడయాత్రలచే దేశమంతయు మిగుల క్షోభించు చుండెను. విజయనగర సామ్రాజ్యమున కాజన్మద్వేషియగు సుల్తాన్ ఉద్దీనుహసన్ గంగోయను మహమ్మదీయుఁడు దక్షిణ హిందూస్థానములోని కలుబరిగినగరమున మహమ్మదీయరాజ్యమును స్థాపించెను. ఈరాజ్యమునకు విజయనగర రాజ్యమున కెడ తెగని పోరు జరుగసాగెను. విద్యానగరపట్టణము క్రీ. శ. ౧౩౩౬ లో ముగింపఁబడెను. మహమ్మదీయులధాటికివెఱచిన హైం దవరాజన్యులకు నాంధ్రవీరులకు రక్షకస్థానముగనుండి మాధవా చార్యుల యమోఘమగు రాజనీతిచేతను హరిహరరాయ బుక్క రాయుల పౌరుషాతిశయముచేతను వాసికెక్కిన విద్యానగరసామ్రాజ్య చరిత్ర మెంతవ్రాసినను దనివి తీఱదు. మాధవాచార్యులు రాజ్యాంగ ములయందుఁ గాలముగడుపక యవకాశము కలిగినప్పుడెల్ల గ్రంథ రచనముతోడను మతగ్రంథపారాయణముతోడను శాస్త్రవిచార ముతోడను గాలక్షేపము చేయుచుండెను. మాధవాచార్యుల సోదరు లలో సాయణాచార్యులు సుప్రసిద్ధుఁడు. రాజకీయరహస్యవేత్త. గ్రంథ కర్తయై పర్వాపథముల నగ్రజునకు దక్షిణహస్తమువలె నలరారెను.

సాయణాచార్యులు బుక్కరాయల యన్నకొమారుఁడగు సంగముని వద్దను (రెండవ) హరిహరరాయల వద్దను నమాత్యుఁడై మిగుల ప్రఖ్యాతిగఁ గాలముగడపెను. సాయణాచార్యులు శ్రౌతస్మార్త వేదాంతాద్యుత్తమగ్రంథములకు వ్యాఖ్యానములు వ్రాయుటయె గాక వేదమునకు సైతము భాష్యముఁ గావించెను. దీనినె సాయణభాష్యమని వ్యవహరించుచున్నారు.

మాధవాచార్యులు ప్రబలపండితుఁడగు విద్యాతీర్థులవారి శిష్యుఁడు. ఈవిద్యాతీర్థులనే భారతీతీర్థులనిగూడ వ్యవహరింతురు. ఈయన శృంగేరిపీఠపాలకుఁడై ప్రథమ హరిహరబుక్కరాయలవలన తన పీఠమునకుఁ దొమ్మిదిగ్రామముల నగ్రహారములుగఁ బొందెను. సాయణాచార్యులవారు వేదభాష్యములో భారతీతీర్థుల యనుగ్రహము వలననే వేదభాష్యము విరచింపఁగలిగితినని వ్రాసికొనియున్నాఁడు.

హరిహరరాయ బుక్కరాయలు మాధవాచార్యులకు సర్వస్వాతంత్ర్యములనొసంగి సర్వకార్యములయందును ప్రాముఖ్యము నొసంగ నాగిరి. మాధవాచార్యులు గృహస్థాశ్రమము నందుండి యనేక యుత్కృష్టకార్యములను గావించెను. దేశమున శాంతి నెలకొల్పి యవన విజృంభణమును నడఁగఁద్రొక్కెను. ఆంధ్రదేశమునకు సురక్షితమగు కట్టుబాటుల నెలకొల్పి ధర్మమార్గమునఁ బ్రభువుల నడపించుచు దేశమునకుఁ గాలమునకు విద్యకు నాదర్శప్రాయుఁడై యొప్పెను. యవన విజృంభణముచె హైందవమతము లంతరింపకుండ నిల్చుటకు మాధవాచార్యుల బుద్ధిబలము విద్యాప్రభావము ప్రధాన హేతువు. మాధవాచార్యుని మతోద్ధారణప్రయత్నములలోఁ జేయూఁత నొసంగుటచే బుక్కరాజునకు "వైదికమార్గప్రతిష్ఠాపనాచార్య" యను నన్వర్థబిరుదనామము లభించెను. సంస్కృతమున మాధవాచార్యులు పెక్కుగ్రంథములను విరచించెను. పరాశరస్మృతివ్యాఖ్యానము, మనుస్మృతివ్యాఖ్యానము, వేదభాష్యము, జైమినీన్యాయమాలావిస్తారము, కాలమాధవ్యము, వ్యవహారమాధవ్యము, శంకరవిజయము, సర్వదర్శన

సంగ్రహము లోనగు గ్రంథరత్నములను మాధవాచార్యులు విరచించి వైదికమతధర్మములను మిగుల జాగరూకతతోఁ గాపాడెను. గృహస్థాశ్రమములోనుండి లోకహితకార్యము లనేకములు గావించి జ్ఞానపరిపూర్ణుఁడైయుండుటచే శంకరాచార్యపీఠమున కధిపతి గతించెను. సర్వవిధముల సమర్థుఁడగు నీమాధవాచార్యులవారు సన్యసించి విద్యారణ్యస్వామియను నామము వహించి జగద్గురుపీఠమునకుఁ బ్రభువయ్యెను. ఇదిమొదలు మాధవాచార్యుఁడను నామము తొలంగెను. విద్యారణ్యనామముతో నీమహామహుని ప్రశస్తి లోకములో వ్యాప్తి వహింపసాగెను. ఆదిశంకరాచార్యుల తరువాత పీఠమునకువచ్చిన గురుపరంపరలో (మాధవ) విద్యారణ్యులవంటి పండితశిరోమణిరో లేఁడని వినుచున్నారము. విద్యారణ్యులు సన్యాసాశ్రమములోనుండి యనేకగ్రంథములను విరచించి పేరుగాంచిరి. అందు వేదాంతపంచదశి, వివరణప్రమేయసంగ్రహము, బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి, జీవన్ముక్తివివేకము, దేవి అపరాధస్తోత్రము లోనగుగ్రంథములు చాల ముఖ్యములైనవి.

విద్యారణ్యులు తురీయాశ్రమములో నుండి వర్ణాశ్రమ ధర్మముల సంరక్షించి హిందూమతమున కింతయనరాని మేలుచేసిరి. దేశము నంతయు మహ్మదీయు లాక్రమింపసాగిరి. కేవల శూన్యవాదులగు జైనులు హెచ్చుపెఱిగి నాస్తికమతమును బ్రచారములోనికిఁ దీసికొనిరాసాగిరి. వీరశైవులింకొకవైపునుండి బయలువెడలి లింగాయతమతము దేశమున నెలకొల్పసాగిరి. మతధర్మము లంతరింపసాగెను. ఈసందిగ్ధసమయములో మాధవాచార్యులు మంత్రిగానుండి మతగ్రంథములకు ధర్మశాస్త్రములకు వ్యాఖ్యానములు వ్రాసి యోగ్యధర్మముల వెల్లడించి యంతతోఁ దనభారము తీఱలేదని మఠాధిపతియై దేశమునందంతటను బ్రచారము గావించి యితరమతముల నిర్మూలముగావించి యద్వైతమతమునకు సమస్తవిధముల నవలంబనుఁడయ్యెను.

మాధవవిద్యారణ్యుల ప్రశస్తి యనన్యసామాన్య మైనది.

ఆయన రచించిన గ్రంథములు నేటికి హైందవులచేఁ బరమపవిత్రములుగ భావింపఁబడుచున్నవి. ఆంధ్రసామ్రాజ్యమగు విజయనగరరాజ్యమునుసంస్థాపించి దేశమునకు మతమునకు భాషకు ననిర్వాచ్యమగుమేలు గావించి శృంగేరిలోని జగద్గురుపీఠమును విద్యారణ్యులు చాలకాలము పాలించి నూఱుసంవత్సరములకంటె నెక్కుడుకాలము జీవించి క్రీ. శ. ౧౩౮౬ సంవత్సరప్రాంతము బ్రహ్మైక్యము నొందెను.

ఈమహాత్ముని జీవితచరిత్రము చరిత్రకారులకు సమగ్రముగ లభింపలేదు. అసంభావ్యములగు కల్పనకథలతో నిండియున్న స్థానిక చరిత్రములలోనుండి యథార్థచరిత్రము గ్రహించుట చాలదుస్తరము. భారతదేశసేవ యావజ్జీవితము గావించి ధన్యుఁడైన మాధవ విద్యారణ్యు లాంధ్రుఁడు నాంధ్రదేశీయుఁడు నగుటచే నాంధ్రులమగు మనకు వందనీయుఁడు.

---

# మాధవమంత్రి.

మాధవవిద్యారణ్యులవారి యనంతరము స్మరింపఁదగినవాఁడు మాధవమంత్రి. ఇతఁడు విద్యారణ్యుల యనంతరము కొలఁదికాలమునకు విద్యారణ్యమాధవస్వామిచేఁ జిరకాలము పరిపాలితమై ధర్మవంతమైన విద్యానగరసామ్రాజ్యమునకు రెండవ బుక్కరాయల కాలమున, ముందు దండనాయకుఁడుగను దరువాత మంత్రిగను వచ్చి చాలకాలము ప్రతిష్ఠాజీవనము నొనరించెను. ఈ మాధవమంత్రి సైతము విద్వాంసుఁడై సంస్కృతమున ననేకగ్రంథములు స్వయముగా రచించి పెక్కు ధర్మశాస్త్రములకు వ్యాఖ్యానము గావించి మాధవ విద్యారణ్యులవలె దేశమునకు వాఙ్మయమునకు మతమునకు నమూల్యమగు సేవగావించెను. కాకతాళీయముగ గుణవిశేషములు మాధవాచార్యులకు మాధవమంత్రికి సమానముగ నుంటచేతను నించుమించుగ నిరువురొక సామ్రాజ్యముననె యొకశతాబ్దములోనె యున్న

వారలగుటవలనను బలువు రిరువు రొక్కరే యని భ్రాంతిపడిరి గాని పరిశీలించినచో నిరువురు వేఱువేఱుకాలములలో నున్నవారని స్పష్టముగాఁ దెలియకపోదు. మాధవమంత్రి యాంగీరసగోత్రుఁడు. తండ్రి చౌండప్ప. గౌడబ్రాహ్మణుఁడు. మాధవాచార్యుని గోత్రము సూత్రము జనకునినామము వేఱుగాన నుభయుల నొకరుగా భావింపఁ జనదు.

మాధవమంత్రి మిగులఁ బరాక్రమశాలియై యనేక సంగ్రామములలో బుక్కరాయలకు సహాయము గావించెను. ఇతఁడు కాశీవిలాసుఁడను గురువర్యుని సేవఁజేసి శైవమతాచారముల రహస్యములను గ్రహించి శివపూజయందు నిష్ఠగలవాఁడయ్యెను. మాధవమంత్రి మతవ్యాపకము కొఱకు మిగుల శ్రమగావించి దుర్బోధల నొనరించు నాస్తికవాదుల నందఱను నిర్జించి వైదికధర్మములను స్థాపించెను. పేరుపొందిన విద్వాంసులకు సైతమసాధ్యమగు నుపనిషద్రహస్యములను స్వయంకృషిచే గ్రహించి బ్రహ్మపదమును జూపఁగలవాఁడను విఖ్యాతి నార్జించెను. బుక్కరాయలసామ్రాజ్యము శాశ్వతముగ నుంటకై మాధవమంత్రి యొక సంవత్సరము స్థిరమైన దీక్షతో లింగపూజ యొనరించి యభీష్టసిద్ధిగాంచి విజయనగర సామ్రాజ్యములోని పశ్చిమభాగమునకు నాయకుఁడుగ మంత్రిగ రాజుచే నియోగింపఁబడి యనేక ధర్మకార్యములను గావించెను. మాధవమంత్రి ప్రభుధనమె తన ధనమని దుర్వ్యయము గావింపక తానుచేయు ధర్మకార్యములన్నింటికి సొంతధనమె వ్యయముగావించి యాసుకృత మంతయుఁ దానె యనుభవించెను. చంద్రికూటపురము రాజధానిగాఁగల నాగరఖండము నితఁడు బరిపాలించుచు మచ్చుండి యను గ్రామమును, దాని ననుసరించియున్న రెండుపగ్రామములను మాధవమంత్రి తన సొంతధనముతోఁగొని వేదవేదాంగ పారంగతులగు బ్రాహ్మణులకు దానము గావించెను. మాధవమంత్రికి వీరవసంతమాధవుఁడనియు మాదిరాజనియు మాధవాంకుఁడనియు నామాంతరములు కలవు.

మాధవమంత్రి రచించిన గ్రంథములన్నియు నిపుడు కానవచ్చుటలేదు. సూతసంహితకు వ్రాసిన తాత్పర్యదీపిక యనువ్యాఖ్యానము, శైవామ్నాయసార మను మతగ్రంథము, మాధవనిదాన మను వైద్యగ్రంథము మాధవమంత్రి రచించినటులఁ దెలియుచున్నది. ఇతని సర్వతోముఖపాండిత్యమును జాటుట కీగ్రంథములు సాధనములు కాఁగలవు. మాధవమంత్రి వేదవేదాంగపారగులగు బ్రాహ్మణులకుఁ దగు భూవసతుల నొసంగి యెల్లకాలము చెంత నుంచికొని వారిసహాయముతో గ్రంథములు రచించుచు విద్యావాదములు గావించుచుఁ గాలక్షేపము చేయుటయేగాక దుర్మతబోధకుల వాదములను నిర్మూలము గావించుటతోఁగూడ జీవితకాలమును గడపెను. విద్యారణ్యులొనరింపని మహత్కార్యములు మాధవమంత్రి నిర్వహించి విద్యానగర సామ్రాజ్యమునకు మూలస్తంభమై కీర్తి గడించెను.

బుక్కరాయలు రాజ్యమునకుఁ బేరుఁబ్రతిష్ఠలఁ దెచ్చినవాఁడు మాధవమంత్రియే. మాధవునివంటి మంత్రియుంటవలననే బుక్కరాయలు సైన్యాభివృద్ధి ధనాభివృద్ధి గావించి కళింగ, ఓడ్రాదిదేశములను జయింప నవకాశము చిక్కినది. బుక్కరాజుకాలములో సేనానాయకులుగ దండనాయకులుగ నున్న యాంధ్రమహాజనుల నామములుకొన్ని వినవచ్చుచున్నవి. అందు మల్లినాథుఁ డొకఁడు. ఈతనిచరిత్రము సమగ్రముగాఁ దెలియకుగాని యవన తురుష్కసాంఖ్యదళములను భేదించి బహామనీసుల్తానులవలన సైతము శ్లాఘింపఁబడినటుల శాసనాదికములవలనఁ దెలియుచున్నది. బచ్చిరాజను మఱియొకమంత్రియు నాకాలమున నాసామ్రాజ్యమునఁ గలఁడు. ఇతఁ డనేకధర్మకార్యములను గావించుటయే గాక బచ్చప్ప చెఱువను నొకగొప్పతటాకమును నిర్మించెను. ఇటులెందఱు మంత్రుల నామములు వినవచ్చినను బుక్కరాజుసంస్థానమున ముఖ్యమంత్రిపదవి మాధవమంత్రియె వహించి స్వామిభక్తిశీలుఁడై యనేకగౌరవముల నొందె ననుట వాస్తవము. మాధవమంత్రి సేనాసహాయుఁడై స్వయ

ముగఁ గొన్నిసంగ్రామములలో విజయము గడించినటుల శాసనాధారములు కలవు. "ఇదం బ్రాహ్మ్య మిదంక్షాత్ర" మను నుడికి మార్గదర్శకులై కార్యఖడ్గప్రవీణులై కీర్తిశేషులైన యాంధ్రమంత్రులలో మాధవమంత్రి యెవ్వనికిఁ దీసిపోఁడు. మాధవాచార్య సదృశుఁడగు నీ మాధవమంత్రి శాసనము నొకదాని నాంధ్రీకరించి మహమ్మదీయ మహాయుగములోఁ దద్గ్రంథకర్తగారు వ్రాసియున్నారు. ఆశాసనములో సంగమరాజపుత్రుఁడగు బుక్కరాజు కృష్ణావతారమనియు బుక్కరాజుమంత్రియగు నీ మాధవమంత్రి రాజాజ్ఞఁ దలధరించి విరోధి సంహారము గావించు చుండెననియుఁ గొంకణదేశము (Canara) నకు రాజధానియు సముద్రతీరమునందలినగరము నగు గోవాపురమును విస్తారమైనబలముతో ముట్టడించి ఘోరసంగ్రామము గావించి యందున్న తురకల నందఱను దఱుమఁ గొట్టిసప్తనాథాది యాదవరాజన్యుల నారాజ్యమునందు నిల్పెననియుఁ జెప్పఁబడియున్నది.

మాధవమంత్రి క్రీ. శ. ౧౩౯౧ లోఁ గుంజరదేశములోని కుంచరమను గ్రామమునకు మాధవాగ్రహారమను నామధేయము గావించి సూర్యగ్రహణకాలమున దానముగావించినటు లొకశాసనము తెలుపుచున్నది. దీనిచే నీ మాధవమంత్రివర్యుఁడు విద్యానగరసంస్థానమున బుక్కరాయల నాశ్రయించి శ్రౌతధర్మప్రవర్తకుఁడై సుప్రసిద్ధుఁడై క్రీ. శ. ౧౩౪౦ మొదలుకొని క్రీ. శ. ౧౪౦౦ వఱకున్నటుల నూహింపవచ్చును. మన ప్రాచీనులు చరిత్రములువ్రాయు నాచారముకలవారు కాకపోవుటచే ననేకమహానుభావులజీవితములు విస్మృతిగర్భమునందిమిడిపోయినది. ఏమహానీయుఁ డేయే యమానుషకార్యములు గావించెనోయని చదివి యానందించుటకైనఁ జాలినన్ని చరిత్రగ్రంథములు లభింపకుంట పరితాపకరముగదా!



# సాళువ తిమ్మరుసుమంత్రి.

"సీ॥ ఏ మంత్రిమణి నిజస్వామి కార్యక్రియా తత్పర మానసోత్సాహశాలి
ఏ మంత్రిమణి మిత్రహిత బాంధవాశ్రిత ప్రకరరక్షణ కళాప్రకరబుద్ధి
ఏ మంత్రిమణి వచోహేలాతి నైర్మల్యశీతల తాధూతశీతగోచి
ఏ మంత్రిమణి సుధాధామ శాంభవధామ ధాళధళసుతుల్య ధవళకీర్తి

తే॥ గీ॥ యట్టి మంత్రికులోత్తంస మహితనృపతి
పటలమకుటాగ్రఘటిత సత్పద్మయుగళి
సకలకర్ణాట రక్షావిచక్షణుండు
దీనసురశాఖి సాళువ తిమ్మమంత్రి॥"

ఓఢ్ర కర్ణాట ద్రావిడాంధ్రదేశములన్నియు నేకచ్ఛత్రముగాఁ బాలించి యాంధ్రమార్తాండుఁడను పేరుఁగాంచిన శ్రీకృష్ణదేవరాయల పవిత్రనామము నెఱుఁగని దేశీయులుండరు. కృష్ణదేవరాయల సామ్రాజ్యభారమును వహించి తద్రాజ్యాభివృద్ధికి సర్వవిధములఁ గారకుఁడై తన యమోఘరాజనీతికౌశల్యముచేఁ జాణక్యాది మహామహులతో సర్వవిధములఁ దులఁదూఁగిన తిమ్మరుసుమంత్రి పవిత్రజీవితము సర్వవిధములఁ బఠనీయము. ఆంధ్రమంత్రులలో సర్వసమర్థులగువారు మిగుల నరుదుగనున్నారు. అట్టివారిలోఁ దిమ్మరసు సాక్షరుఁడు. తిమ్మరసుమంత్రి యాంధ్రనియోగి బ్రాహ్మణుఁడు. ఇంటిపేరు సాళ్వవారు. తండ్రి రాచిరాజు. బాల్యమునందె యాతని తల్లిదండ్రులు గతించుటచేఁ దమ్ముఁడగు గోవిందరాజుతోఁగలసి గుత్తిదుర్గమున కేగి మాధుకరవృత్తిచేఁ బొట్టఁబోసికొనుచుఁ బండితులయొద్ద విద్యనభ్యసించెను. తిమ్మరుసుమంత్రి మిగుల కుశాగ్రబుద్ధికలవాఁడగుటచే సర్వశాస్త్రపారంగతుఁడై రాజనీతిశాస్త్రములో నారితేరి సంగ్రామవిద్యలలో సంపూర్ణప్రవేశముగలవాఁడై యుక్తవయస్సు వచ్చువఱకు సర్వతంత్రస్వతంత్రుఁడయ్యెను. అన్నచాటునఁ దిరుగుచు గోవిందరాజు కూడ మిగులఁ బట్టుదలతోఁ జదువుకొనుచు బాల్యావస్థనంతయు విద్యాభ్యాసమునకై వినియోగించెను. ఆ కాలమున సుప్రసిద్ధులై

యున్న యాంధ్రసంస్థానములలోఁ జంద్రగిరిదుర్గ మొకటియై యుం డెను. తమసోదరి యా చంద్రగిరి దుర్గోద్యోగి కొసంగఁబడియుంటచేఁ గొంతకాలమునకుఁ దోఁబుట్టువును జూచుటకు సోదరునితోఁ దిమ్మరు సుమంత్రి యచటకేగెను. అప్పటికిఁ దిమ్మరుసునకుఁ బ్రాయము పది నాళ్లేండ్లు మించియుండదు. సోదరిగృహమున నేదియో శుభావసర మగుటచే నొకదినమున భోజనాదికములకు మిగులఁ బ్రొద్దుపోయెను. ఆఁకలిచే నలసి తిమ్మరుసు సోదరీగృహద్వారము చెంతఁగల యొక చెట్టునీడను బరుండి నిదురింపసాగెను. ప్రొద్దుతిరిగినకొలఁది చెట్టునీడ తూర్పునకేగుటచేఁ దిమ్మరుసుమంత్రి కెండ రాసాగెను. ఆసమయమున వృక్షముపై నొకసర్పరాజము పడగవిప్పి సూర్యకిరణములకుఁ దనపడగ నడ్డముగా నొడ్డి యాకుమారునకు నీడవచ్చునటుల నుపచారముఁ గావించుచుండెను. గృహకృత్యములన్నియు ముగించి సోదరుని భోజనార్థము పిల్చుటకు సోదరి ద్వారమునకు వచ్చునప్పటికి సర్పఫణాచ్ఛత్రము క్రిందఁ దిమ్మరుసు నిదురించుచుండెను. సోదరి మిగుల నాశ్చర్యమొంది యబలాజనసహజమగు భయముచే మిగులఁ గంపము నొంది సహోదరున కెట్టియాపద యాదుష్టోరగంబువలనఁ గలుగనున్నదోయని సత్వరము యేగి భర్త కాస్థితియంతయు మనవిచేసెను. నాదిండ్ల తిమ్మరాజను నాయమభర్త వచ్చి యాతిమ్మరుసునుజూచి "యీతఁడు మహాదైశ్వర్యసంపన్నుఁడు కాఁగలఁడు. సర్వభూభాగముఁ బాలింపఁగల చక్రవర్తియందుఁగల శుభలక్షణము లితనియందుఁగలవు. సర్పము ఫణముతోఁ ఛత్రముఁబట్టుటయు నొక శుభచిహ్నమే" యని తన ధర్మపత్ని కెఱిఁగించెను. నాఁటనుండి యాపుణ్యదంపతులు తిమ్మరుసును గోవిందరాజును దమగృహముననే యుంచుకొని సర్వజ్ఞులగు పండితులయొద్దకు శిక్షార్థము బంపుచు మిగుల గారాబముగ నాహారపానీయాది విషయములలో మిగుల జాగరూకతతోఁ దిలకింపసాగిరి. కొలఁదికాలమునకుఁ దిమ్మరుసుమంత్రి తెలివితేటలు చంద్రగిరిదుర్గముఁ బరిపాలించు సాళ్వనరసింహరాయ లాలకించి మంత్రియగు తుళువనరసరాజపద్ద సహాయునిగ నియోగించెను. సర్వధర్మ పారంగతుఁడగు

తిమ్మరుసు నరసరాజునకు సహాయుఁడుగనుండి రాజ్యతంత్రములలోఁ గొలఁది కాలములో నాఁటి తేఁటి మిగుల జాగరూకతతో నాత్మరాజ్యాభివృద్ధికి సహస్రవిధములఁ బాటుపడుచు రాజన్యునకు ముఖ్యామాత్యునకుఁ బ్రేమపాత్రుఁడై తెలివిగలిగి మెలఁగుచుండ సోదరుఁడగు గోవిందరాజునకు యుక్తవయస్సు వచ్చుటచే నాతఁడుగూడ నాసంస్థానమున దండనాయకుఁడుగ నియోగింపఁబడెను. ఆకాలమున సుప్రసిద్ధములగు సంస్థానములలోఁ దుంగభద్రాతీరమునందున్న విద్యానగరసంస్థానము పేరుమోసియుండెను. విరూపాక్షరాయ లను రాజన్యుఁడు విద్యానగరసంస్థానమును పేరునకుమాత్రము పరిపాలించుచుండెను. ఆతఁడు బాల్యమునుండియు స్త్రీవ్యసనమునఁ దగుల్కొని యంతఃపురము వదలి సభాంగణములో నడుగిడక దుర్బలుఁడై రాజ్యభారమునంతయు మంత్రుల హస్తగతముఁగావించి కాలక్షేపముఁ జేయుచుండెను. మంత్రులు తమలోఁ దా మంతఃకలహములపాలై సంస్థానక్షేమము సంతరించుటలో నెంతమాత్రము శ్రద్ధగైకొనరైరి. ఈయదనెఱిఁగి సామంతులందఱు స్వతంత్రులై సంస్థానమునకుఁ బన్నులు చెల్లించుట మానివేసిరి. బొక్కసమునందు రానురాను ధనము తఱిగిపోయెను. స్కంధావారమును, బరిజనమును, రాజకీయోద్యోగులను వేతనములొసఁగి నిలుపుకొనవలయుననియేని తలంపక బహుకాంతాపరివృతుఁడై యంతఃపురమున విరూపాక్షరాయ లేకాంతక్రీడలతో నహోరాత్రములభేదమును గమనింపఁజాలక సంచరింపసాగెను. ప్రజలలో ననేకకల్లోలములు వ్యాపించి యశాంతికళలు వెల్లివిరియసాగెను. సముద్రతీరమునందలి రేవులన్నియుఁ బరాధీనములయ్యెను. ఉదయగిరిదుర్గము గజపతులు లాగికొనిరి. తుంగభద్రాతీరమందలి గ్రామము లన్నియు మహమ్మదీయులు తమ దుర్గముల క్రిందకు లాగికొనిరి. రాజ్యమునం దింతటివిప్లవఘోరి యహోరాత్రము లేకధాటిగ మ్రోగుచున్నను సుఖసుప్తుఁడగు విరూపాక్షరాయలకు మెలకువ కలుగదయ్యెను. ఈమస్థితి కనిపెట్టి యాతని పెద్దకుమారుఁడు తిరుగఁబడి పళుంచి రాజ్యమునకుఁ దాన రాజయ్యెను. అలసి

తమ్ముఁడును విరూపాక్షరాయల ప్రతిబింబమునగు ప్రౌఢరాయలగ్రజుని వధించి తాను రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు తండ్రియగు విరూపాక్షరాయలకంటె నేడాఁకు లెక్కువ చదివినవాఁడు. రాజ్యమునకు వచ్చినదాది తండ్రివలెనే కాంతావ్యాసంగములో మునిఁగి రాజకార్యములను సంపూర్తిగా విసర్జించెను. రాజ్యమున నెప్పటి యశాంతిశక్తియే భయంకరస్వరూపముతోఁ దాండవముచేయ సాగెను ఈ దురవస్థఁ గనులారఁ జూచుచున్న బహమనీసుల్తాను విజయనగరరాజ్యమునంతయు మ్రింగవలయునని తలంచి ప్రయత్నములో నుండెను. విద్యానగరరాజ్యము మహమ్మదీయుల యాధీనములోనికి వచ్చినచో నాంధ్రదేశమెన్నటికి నుత్తీర్ణముకాదని సాళువనరసింహభూపాలుఁడు తలఁచి తుళువనరసారాయని, తిమ్మరుసుమంత్రిని, గోవిందరాజును బ్రేరేపి సైన్యమునొసంగి విద్యానగరము ముట్టడింపఁ బంపెను. మహమ్మదీయుల హస్తగత మగుటకంటె విద్యానగరరాజ్యము చంద్రగిరిపాలకుఁడగు వీరక్షత్రియుని వశమగుటయే సుకృతమని సామంతులెవ్వరు నీసైన్యము నెదిరింపక యర్హమగు సహాయములు సైతము చేయసాగిరి. సాళువనరసరాజు తిమ్మరుసు గోవిందరాజు మఱికొందఱు వీరవర్యులు సైన్యముతో నశ్రమముగ విద్యానగరములోఁ బ్రవేశించి కోటముట్టడించిరి. దుర్గమునాశ్రయించియున్న యేస్వల్పబలమో కొంచెము సేపు చంద్రగిరిబలముతోఁ బోరాడి వశంవదమయ్యెను. ఈసంరంభమునంతయు నాలకించి యంతఃపురరాజన్యుఁడు విజయము ప్రతిపక్షులదేయని దాసీజనముఖంబున విని "బ్రతుకుము జీవుఁడా యని" దొడ్డిద్వారమునుండి యవరోధాంగనలతోఁ బాఱిపోయెను. చంద్రగిరిరాజన్యునిపక్షమునఁ దుళువనరసరాజు విద్యానగర సామ్రాజ్యమును మిగుల మెలఁకువతోఁ బరిపాలింపసాగెను. తిమ్మరుసు మంత్రియై యా సామ్రాజ్యక్షేమమును దృక్పథమునందుంచుకొని రాజనీతిననుసరించి చరింపసాగెను. గోవిందరాజు సర్వసైన్యములపై నాధిపత్యము వహించి మెలంగెను. విద్యానగరదుర్గము శత్రుభీకరముగ నుండెను ఎటులేని సామ్రాజ్యమును మ్రింగివేయవలయునని యుక్తిభులూను

చున్న బహామనుసుల్తాను లణఁగిమెలఁగి యాంకులలోఁ బిందెలవలె నుండసాగిరి. సామంతులందఱు సామ్రాజ్యమునెడ భయభక్తులతో సంచరింపుచు నిదివర కీయవలసిన పన్నులన్నియు నొసంగి విధేయులై వర్తింపసాగిరి. కొలఁది కాలమునకుఁ గారణాంతరములవలనను, దిమ్మరుసుమంత్రి యమోఘరాజనీతి ప్రభావమువలనను సంస్థానము మిగుల నభివృద్ధిలోనికి వచ్చెను. క్రమక్రమముగ నాశ్వికపదాదిబలము లభివృద్ధిఁ జేయఁబడెను. తోడిరాజన్యులలో నెవరును విద్యానగర రాజ్యనగరమును దేఱి చూడఁజాలరైరి. తరువాత విద్యానగరరాజ్యాధిపతి యను వ్యవహారముగల సాళువ నరసింహరాయ లంతరించెను. ఆతని కుమారుఁడు పెనుగొండరాజ్యమునకు రాజుగ నేర్పఱుపఁబడుటచే విద్యానగరరాజ్యమునకుఁ దుళువ నరసరాజు రాజుగ నేర్పడెను. నరసింహరాయలపక్షమున శాంతముగ రాజ్యపాలనముఁ జేయుచున్న తుళువ నరసరాజుసౌశీల్యశౌర్యాదు లెఱింగినవారలగుటచేఁ బౌరులు సామంతులు శుభావసరమున విద్యానగరరాజ్యమును దుళువ నరసరాజునకుఁ బట్టాభిషేకము గావించిరి. తిమ్మరుసు నాఁటనుండి విద్యానగరసామ్రాజ్యమునకు సర్వస్వాతంత్ర్యములుగల మంత్రిత్వము వహించి రాజ్యక్షేమము దృష్టిపథమున నుంచికొని ప్రౌఢరాయలకాలమున విరూపక్షరాయలకాలమునఁ బరాధీనములైన దేశముల నన్నింటిని స్వాధీనముఁ గావించుకొనుచుఁ బ్రత్యర్థులవలన నెట్టియుపాయములు రాకుండఁ గోటయు, సైన్యమును, భాండారమును సమస్తవిధముల నభివృద్ధిలోనికిఁ దీసికొని రాఁదొడఁగెను. ఆప్రజాశాంతికి, నారాజ్యాభివృద్ధికి, ధర్మపరిపాలనమునకుఁ దిమ్మరుసుమంత్రియె కారకుఁడని యాతనియెడఁ బౌరులు భక్తివిశ్వాసములతో వర్తింపసాగిరి. తుళువ నరసరాయలు చాలకాలము రాజ్యము పాలించెను. కార్యభారము నంతయుఁ దిమ్మరుసుమంత్రి వహించుటచే వార్థకమునఁగూడఁ దుళువనరసరాజునకు రాజ్యపాలన మొకకష్టముగ నుండదయ్యెను. ఇతనికి ముగ్గురు భార్యలుకలరు. తిప్పాంబ, నాగాంబ, ఓబాంబ యను పేరుగలవారు. అందు తిప్పమాంబకు వీరనరసింహరాయలు, నాగాం

బకుఁ గృష్ణదేవరాయలు, ఓబాంబికకు నచ్యుతదేవరాయలు జనిం
చిరి. ఇందు ద్వితీయుఁడగు కృష్ణదేవరాయలు మిగుల తేజస్వి,
స్ఫురద్రూపి, మిక్కిలి చుఱుకుదనముఁగలవాఁడు. తండ్రియగు
నరసరాజునకు, మంత్రియగు తిమ్మరుసునకుఁగూడఁ గృష్ణరాయలపై
నింతయనరాని ప్రేమగలదు. కాని యాతఁడు మిక్కిలి బాల్య
మున నుండుటచే నరసరాజు తనరాజ్యమునంతయుఁ బెద్దకుమారుఁ
డగు వీరనరసింహరాయల కొసంగి పట్టాభిషేకముఁ గావించి కృష్ణ
దేవరాయలను తిమ్మరుసుహస్తములో నుంచి తనయగ్రమహిషియు
వీరనరసింహరాయలు నీబాలునిపై నెట్టిదురంతములు గావింపకుంటకై
కనుగలిగి మెలఁగుమని సాదరముగ విన్నవించి దివంబున కరిగెను.
తిమ్మరుసుమంత్రి వీరనరసింహరాయల చెంతఁగూడ మంత్రియై యాం
ధ్రదేశము, కర్ణాటదేశము, ద్రావిడదేశము శాంతిమంతముగఁ బరిపా
లింపసాగెను. కృష్ణదేవరాయల బుద్ధికుశలత నతని మాఱుతల్లియగు
తిప్పాంబ గ్రహించి యెన్నటికైనఁ దనకుమారుని రాజ్యచ్యుతుని
గావింపఁగలవాఁ డీతఁడె యగునని కృష్ణదేవరాయల వధింపవలయునని
యనేకతీవ్రయత్నములు గావించి తిమ్మరుసుమంత్రి నైపుణ్యమువలన
విఫలమనోరథురాలై కార్యసిద్ధి నొందకయే హృదయశల్యముగ నున్న
యాదురంతము మిగులఁ బీడింపఁ గొలఁదికాలమునకు మరణించెను.
రానురాను వీరనరసింహరాయలకుసైత మీదుష్టబుద్ధియే జనించెను.
అఘటనఘటన ధురీణుఁడగు తిమ్మరుసుమంత్రి యేసమయమున
విద్యానగరరాజ్యమునకుఁ గృష్ణరాయల సార్వభౌముని గావించునో
యనువెఱపుచే నవస్థపడుచు మెలకువతో సంచరింపసాగెను. సింహ
మును మృగరాజుగా నెవరుగావించిరి? లేడిని కసవుమేసి శాంతముగ
జీవింపుమని యెవరు తెలిపిరి? నైజగుణములు వికసింపక మానవు. కాన
తిమ్మరుసుమంత్రి వీరనరసింహరాయలను బదవిచ్యుతుని గావింపవల
యుననిగాని, కృష్ణదేవరాయల కారాజ్యముఁ బట్టాభిషేకమును గావిం
పవలయుననిగాని కుట్రచేసినవాఁడు కాఁడు. కాని తనలోమాత్రము
ముఖవికాసము తెలివితేటలుఁజూచి యేవిధముగనేని కృష్ణదేవరాయలు

సామ్రాజ్యాధిపతి కాఁదగినవాఁడని యాతనిక్షేమమునకు భంగము రాకుండఁ జరించుచు విద్యాబుద్ధులు తానే నేర్పుచునుండెను. వీరనరసింహరాయలకుఁ దిమ్మరుసుపై నింతయనరాని గౌరవముగలదు. విద్యానగరసంస్థానము తనకు రావలయునని పెనుగొండ దుర్గపాలకుఁడును సాళువనరసింహరాయల పుత్రుఁడు నగు నిమ్మడి నరసింహరాయ లాందోళనము చేయుచుండెను. యథార్థమునకుఁ బిత్రురాజ్యము నాతఁడె పాలింప నర్హుఁడని మాపాఠకసోదరు లెఱింగియుందురు. తిమ్మరుసు కార్యవాదియై ఖడ్గవాదియై నిలచి సామంతులఁ బౌరుల నేకాభిప్రాయులఁగావించి వీరనరసింహరాయల సార్వభౌమత్వమునే స్థాపించెను. ఆసమయమునఁ దిమ్మరుసుమంత్రి నడుముకట్టి నిలువకున్న వీరనరసింహరాయలు సార్వభౌముఁడు కాఁజాలఁడు కావున దిమ్మరుసుమంత్రిపై వీరనరసింహరాయలకు భక్తివిశ్వాసములు నానాఁటి కతిశయించెను. తిమ్మరుసుమంత్రి యాగ్రహించునేమో? యాగ్రహించిన నేయపాయము వచ్చునో యని కృష్ణదేవరాయలపైఁ దనకుఁగల ద్వేషబుద్ధి వీరనరసింహరాయలు బహిర్గతముగావింపక సమయార్థియై కాలక్షేపముఁగావింపసాగెను. అసామాన్యుఁడును రాజనీతికౌశలుఁడునగు తిమ్మరుసుమహామంత్రి రాజకుమారులగు శ్రీకృష్ణదేవరాయలను నచ్యుతరాయలను మిగులశిక్షించి సంగ్రామమునఁ గౌశలులఁ గావించెను. వీరనరసింహరాయలు తిమ్మరుసుమహామంత్రియాజ్ఞనొంది కృష్ణరాయల నచ్యుతరాయల నుచితమగు సైన్యసంబారముల నొసంగి ప్రతిఘటించిన సామంతరాజుల నెదిరింపఁ బంపెను. అచ్యుతరాయలు ద్రవిడాంధ్రదేశములలోఁ బ్రతికూలురుగ నున్న సామంతులవలన నపరాధములుగొని యనేకుల శిక్షించి కొన్నిచోటుల ఘోరసంగ్రామము లాచరించి యన్నసన్నిధికిఁ జేరెను. కృష్ణదేవరాయలు సమధికబలముతో మైసూరుప్రాంతములకు సంగ్రామయాత్రకు బయలుదేరి శివసముద్రము పాలించు గంగరాజును, ఉమ్మత్తూరురాజును, శ్రీరంగపట్టణమురాజును ఘోరసంగ్రామమున జయించి యందఱ బంధించి యారాజ్యములకు విశ్వాసపాత్రులగు భటులను సైనికులుగను రాజభక్తిపరాయణులగు సైన్యాధిపతుల

రాజప్రతినిధులగను నియమించి యమానుషమగు విజయము నొంది జయలక్ష్మితో సామ్రాజ్యమునకుఁ జేరెను వీరనరసింహరాయలు సైతము దిగ్విజయయాత్రకేగి పాండ్య చోడ చేరదేశముల జయించి దేశమునంతయుఁదిరిగి, సాటిరాజుల సామంతులఁ గావించుకొని పుణ్యక్షేత్రముల సందర్శించి సామ్రాజ్యమునుజేరెను. ఈలోఁగ విద్యానగర సామ్రాజ్యమును తిమ్మరుసుమహామంత్రి పాలించి రాజకృతజ్ఞకుఁ బాత్రుఁడయ్యెను. సర్వవిధములఁ దుళువవంశీయుల సామ్రాజ్యాభివృద్ధికిఁ దెచ్చినది తిమ్మరుసుమంత్రివర్యుఁడే. వీరనరసింహరాయ లాఱుసంవత్సరములు పరాక్రమశాలియై రాజ్యముపాలించి కర్మవశమున రోగగ్రస్తుఁడై మంచమెక్కెను. ఔషధోపచారములచే రోగము శాంతింపక క్రమముగ నభివృద్ధి నొందసాగెను. అంత్యకాలమునఁ దన యాందోళనము నాపుకొనఁజాలక వీరనరసింహరాయలు తిమ్మరుసు మంత్రినేకాంతమునఁబిల్చి "ఆర్యా! నాయంత్యవాంఛితమును తాము సారకముగావించినఁగాని బర మలంకరింపనున్న నాయాత్మకు శాంతి చేకూరఁజాలదు. కార్యశిద్ధప్రవీణులగు మీవలనఁ గాదగుకార్య మొకటికలదు. ఎఁడెనిమిదిసంవత్సరముల ప్రాయముఁగల నాపుత్రుఁడు దేవరాయలీరాజ్యమునకు రాజుకాఁదగినవాఁడు. పౌరుషవంతుఁడు, బుద్ధిశాలియగు కృష్ణరాయలపైఁ బ్రజలకు విశ్వాసము కలదు. మీరు సైతమాతని ప్రేమించుచున్నారు. నామరణానంతరము కృష్ణదేవరాయలు రాజ్యమును గ్రహించి దేవరాయల దేవలోకమున కనుపకపోఁడు. కావున ముందు తాము కృష్ణదేవరాయల నెటులేని వధించి యాతని కనులఁ దెచ్చి నాకుఁజూపిన నిశ్చింతముగఁ బ్రాణముల విడతును. తరువాత యుక్తతరుణమున దేవరాయలకు విద్యానగర రాజ్యము పట్టాభిషేకము గావింపవచ్చును. దోషమైనను నాప్రార్థనము నంగీకరింపవలయు"నని తిమ్మరుసు హస్తములు వీరనరసింహరాయలు పట్టుకొని వదలఁడయ్యెను. యుక్తిశాలియగు తిమ్మరుసు వీరనరసింహరాయలతో "నీకార్యమున కింతగఁ బ్రార్థింపనలయునా? ఉత్తరక్షణముననే మీయాజ్ఞనెఱవేర్తు"నని వెడలి యాయుదంతమంతయు నేకాంతమునఁ గృష్ణ

రాయల కెఱింగించి యన్నయొక్క కృతిప్రభావమును బోధించి యాతని నొకరహస్యప్రదేశమున దాఁచి యొకమేఁకను గోయించి దాని గ్రుడ్లు తీయించి తిమ్మరుసు మంత్రి వీరనరసింహరాయలకు స్వహస్తముతో నొసంగి 'స్వామియాజ్ఞ నెఱవేర్చి కృతార్థుఁడనైతి'నని వచించెను. వెంటనే వీరనరసింహరాయలు మరణించెను. అనంతర మారాజ్యమును శ్రీకృష్ణదేవరాయ లాక్రమించికొని శుభముహూర్తమునఁ బట్టాభిషిక్తుఁడై తిమ్మరుసుమహామంత్రి యాదేశానుసారముగ యావద్దేశమును బరిపాలింపసాగెను. బాల్యము నుండియుఁ దండ్రికి మాఱుగఁ దిమ్మరుసు దన్నుదిలకించుచు దిప్పాంబిక - వీరనరసింహరాయలు - వలన రానున్నయాపదల వారించి విద్యాబుద్ధులు బోధించియుంటచేఁ గృష్ణదేవరాయలు 'అప్పాజీ!' (తండ్రిగారు) యని తిమ్మరుసుమంత్రిని పిలుచుటయేగాక పితృగౌరవముతోసైతము తిలకింపసాగెను. శ్రీకృష్ణదేవరాయలకుఁ దిమ్మరుసు బోధవలననైననేమి, పూర్వజన్మసుకృతము వలన నైననేమి సంస్కృత కర్ణాటాంధ్రములలో నిరాఘాటమగు సాహిత్యము కవితాధారయు లభ్యమయ్యెను. మైసూరుప్రాంతములకు దండయాత్రకేగి కృష్ణరాయ లొనరించిన వీరకృత్యములు వినినవారగుటచే సామంతులందఱు కృష్ణరాయలకు భృత్యానుభృత్యులై వర్తింప సాగిరి. సర్వరాజ్యాంగపరిజ్ఞాతయగు తిమ్మరుసువంటిమంత్రి రాజ్యభారము వహించుచుండ నెట్టిలోపమని కలుగుట తటస్థించునా?

తిమ్మరుసుమహామంత్రి సహాయముతోఁ గొలఁదికాలము శ్రీకృష్ణదేవరాయలు రాజ్యము పాలించి యుచితబలముతో మంత్రిద్వితీయుఁడై పూర్వదేశదిగ్జైత్రయాత్రకు బయలువెడలెను. మొట్టమొదట నెల్లూరుమండలములోనున్న యుదయగిరిదుర్గమును మిక్కిలి శ్రమచే భేదించి యటనుండి బయలువెడలి కనకగిరిదుర్గము వశముఁ గావించుకొని యటనుండి కొండవీడు, బెల్లముకొండ, వినుకొండ, బెజవాడ, కొండపల్లి, రాజమహేంద్రవరము లోనగు దుర్గములన్నియు

వశము గావించుకొని యటనుండి బయలువెడలి పొట్నూరువద్ద విజయ ధ్వజమును స్థాపించి కటకపురము రూపుమాపి యా దేశపాలకుని బంధింప నాతఁడు తనపుత్రికయగు తిరుమలదేవి నొసంగి కృష్ణరాయల సమాధానపఱచి తనరాజ్యము తాను దక్కించుకొనెను. అటనుండి బయలువెడలి సింహాచలమునకుఁబోయి దైవసన్నిధానమున ననేక దానము లొనరించి యంతకుమున్ను పెండ్లాడిన చిన్నాదేవి కటకేశ్వరుఁ డొసంగిన తిరుమలదేవియను ధర్మపత్నులతోఁగూడ స్వామిని దర్శించి గృహాభిముఖుఁడై బయలువెడలెను. కృష్ణదేవరాయలతోఁ బాటు ప్రతిసంగ్రామమునను దిమ్మరుసుమంత్రి ముందునడచుచు రాజనీతిని బోధించు కార్యభారము నంతయు వహించుచునున్నటుల స్థానికచరిత్రములవలన ద్యోతకమగుచున్నది. కృష్ణదేవరాయలవారేగిన యన్ని చోటులయందును దఱచుగాఁ దిమ్మరుసుమంత్రివన్యాని ధర్మశాసనములుగూడఁ గానవచ్చుచున్నవి. సింహాచలమునఁ దిమ్మరుసు మహామంత్రిగూడ ననేకధర్మముల నాచరించి శాసనములు స్థాపించెను. తిమ్మరుసుమంత్రి లేకుండ శ్రీకృష్ణదేవరాయ లేవిజయయాత్రకుఁ గూడ బయలువెడలలేదు. కటకాధినాయకునితో సంధి కంగీకరించి తిరుమలదేవిని స్వయముగా సందర్శించి తనరాజన్యునకుఁ దగిన కులకాంతయని నిర్దేశించి గొనివచ్చి యొసంగి పరిణయముఁగావించిన దీమహామహుఁడె. అటులె చిన్నాదేవియను కనకగిరిపాలకుని కుమార్తెను సైతము శ్రీకృష్ణదేవరాయలకు రాజ్ఞగ నొనరించి పరిణయము గావించిన దీధన్యుఁడె. తిమ్మరుసుమంత్రి సమస్తవిధములఁ గృష్ణదేవరాయలసుఖమె తనసుఖమని భావించి తనజీవితసర్వస్వమునంతయు ధారవోసి విద్యానగరసామ్రాజ్యమున కింతయనరాని సేవఁగావించెను.

తిమ్మరుసుమంత్రి యొనరించిన యుత్కృష్టకార్యములఁ బ్రత్యేకించి తెలుపుశాసనము లంతగాఁ గానరావు. ప్రభుభక్తిపరాయణులగు మన యాంధ్రీయు లనేకులు తా మొనరించిన గొప్పకార్యములన్ని

టిని తమప్రభుల కారోపించుటయుఁ బ్రభులు తామె యొనర్చితి మని చెప్పికొనుటయు సహజము. అటులె తిమ్మరుసుమంత్రి గడించిన విజయములన్నియుఁ గృష్ణదేవరాయల కారోపితములగుటచేఁ బ్రత్యేకించి మంత్రివర్యుని విక్రమకార్యముల నేర్పఱుప వీలుకనుపట్టుటలేదు. తిమ్మరుసుమంత్రి కొండవీటిదుర్గమును కృష్ణదేవరాయలు పట్టుకొను తఱి మిగుల సహాయముఁగావించెను. ఆంధ్రదేశమునఁగలదుర్గములన్నింటిలోఁ గొండవీటిదుర్గము మిక్కిలి బలవంతమైనది. రమారమి యీ కొండ కేఁబదిశిఖరములు కలవు. కొండపై నెటుజూచినను జాల గొప్ప గొప్పకోటలు కానవచ్చుచున్నవి. శైలముపై మిక్కిలియెత్తుగల దుర్గము లిరువదియొక్కటి కలవు. కొండకోటయు నేలకోటయు మిక్కిలి దృఢమైనవి. కొండవీటికోటపేరు కాకతీయగణపతికాలమునుండి (క్రీ॥ శ॥ ౧౨౪౦) శాసనములలో వినవచ్చుచున్నది. ఓరుగల్లు సామ్రాజ్యము రూపుమాయఁగనే సామంతులగు రాజులందఱీదుర్గము చేరి మిక్కిలి దృఢముగఁ జేసియుందురు. కొండవీటిదుర్గముక్రింద పదునాలుగుసీమలు కొన్నివందలగ్రామములు కలవు. ఈ కొండవీటిరాజ్యమును గృష్ణరాయలకాలమున వీరశిరోమణియు నుత్కలదేశరాజన్యుని కొమారుఁడు నగు వీరరుద్రగజపతి పరిపాలించుచుండెను. ఇతఁడు స్వతంత్రుఁడై విద్యానగరసామ్రాజ్యమును లక్ష్యము చేయక సామంతుఁడై యుంట యాత్మగౌరవమునకు భంగకరమని స్వేచ్ఛగ వర్తింపసాగెను. ఆంధ్ర ద్రవిడ కర్ణాటదేశములన్నియు నేకచ్ఛత్రముగఁ గృష్ణదేవరాయలచేఁ బరిపాలింపఁజేయుటయుఁ బ్రతిఘటించిన సాటిరాజన్యుల సామంతులుగ మార్చుటయు మహామంత్రి సంకల్పముకావున రాయలతోఁ బూర్వదేశదండయాత్రకు బయలువెడలెను. కృష్ణ కీవలయున్న దుర్గములలో నొకటియగు నుదయగిరియొద్ద రాయలవారిసైన్యములకు బరిపాలకులగు పాత్రసామంతుల సేనలకు ఘోరసంగ్రామము జరిగెను. సర్వసైన్యములకు నాయకుఁడై తిమ్మరుసుమంత్రి నిలువఁబడి యుద్ధము మిగుల విలంబముగ జరుపసాగెను. కృష్ణదేవరాయలు తిమ్మరుసుమంత్రిప్రోత్సాహముచేఁ

బట్టినపట్టు వదలక మిగుల నుత్సాహముతో నుదయగిరిదుర్గమును రెండువత్సరములు ముట్టడించియుండెను. క్రమక్రమముగఁ గోటలోని జనమున కాహారము తక్కువయయ్యెను. సైనికసమూహము పలుచఁ బాఱెను. తిమ్మరుసుమంత్రి విద్యానగరమునుండి క్రొత్తసైన్యమును దెప్పింపసాగెను. కడ కుదయగిరిరాజ్యము రక్తప్రవాహములు ప్రవహించినమీదఁ గృష్ణదేవరాయలకు వశమయ్యెను. తత్క్షణమె తిమ్మరుసుప్రధాని రాయసముకొండ మరుసయ్యగారి నుదయగిరియందుంచి యాతని కాదుర్గపరిపాలనమునకై సర్వాధికారముల నొసంగి యాంధ్రదేశమున కాయువుపట్టనఁదగు కొండవీటిదుర్గమును ముట్టడించినఁగాని దేశమంతయు స్వాధీనము కాఁజాలదని యుదయగిరినుండి కొండవీటికిఁబోయి యాదుర్గమును మిగుల సాహసస్థైర్యములతో ముట్టడించెను.

వీరభద్రగజపతి పరిపాలనములోఁ గొండవీటి దుర్గము మిగుల దుర్భేద్యముగ నలరారసాగెను. సంగ్రామములలో నాఱితేఱిన జగజెట్టీలగు నరహరిదేవుఁడు, లక్ష్మీపతిరాజు, జన్యాములకసవాపాత్రుఁడు, సుప్రపాల మహాచంద్రపాత్రుఁడు, పూసపాటి రాచిరాజు, రాచూరి యల్లయఖానుఁడు, ఉద్దండ ఖానుఁడు మొదలగు వీరవర్యు లనేకులు కొండవీటిదుర్గమును వేయికన్నులతోఁ దిలకింపసాగిరి.

కృష్ణదేవరాయలు, తన తనయుఁడగు వీరభద్రపాత్రుని జయించుటకుఁ గొండవీటికేగుచున్న వార్తవిని, కటకపాలకుఁడగు ప్రతాపరుద్రగజపతి పుత్రునిదుర్గము సంరక్షించుటకై కటకమునుండి పదమూఁడువందల యేనుఁగులు, ఇరువదివేల గుఱ్ఱములు, ఐయిదులక్షల కాల్బలములు దీసికొని కృష్ణాతీరముఁ జేరెను. కృష్ణదేవరాయలు ప్రతాపరుద్రదేవుని విజృంభణము విని యాగ్రహోదగ్రుఁడై మార్గమధ్యమునందె బలముతో నాతనిముట్టుపెట్టుకున్నఁ గొండ

హీడుదుర్గము భేదించుట దుష్కరమని యుచితబలముతోఁ బ్రతిపక్షి నెదిరించుటకు బయలువెడలెను. కృష్ణాతరంగిణి కుదీచ్యమునఁ బ్రతాపరుద్రుని సైన్యములు, దక్షిణమునఁ గృష్ణరాయల సైన్యములు చేరెను. ప్రతాపరుద్రుఁడు కృష్ణ ముందు దాటినచోఁ బ్రతిఘటింపవలయునని రాయలు నిరీక్షించెఁగాని యాతఁడందులకు సాహసింప డయ్యెను. దక్షిణోత్తరతీరముల నుభయసైన్యములు కొంతకాలము విశ్రాంతి నొందసాగెను. కృష్ణదేవరాయలు కొలఁదికాలమిటుల సంగ్రామమునకు నిరీక్షించి విసిగి ప్రతాపరుద్రగజపతియొద్దకు వార్తావహుని బంపెను. ఆతఁడేగి కృష్ణదేవరాయలమాటలుగ "మీరు కృష్ణదాటి వత్తురా, మేము క్రోసెడుదూరము పోవుదుము. లేదా మేము కృష్ణ దాటుదుము. మీరు క్రోసెడుదూరము పోవలయును. ఉభయబలములు తీరమున ధర్మసంగ్రామము చేయువచ్చు"నని తెలిపెను. ప్రతాపరుద్రగజపతి యీసందేశమునకు సరియగు ప్రత్యుత్తరము నొసంగఁ డయ్యెను. కృష్ణరాయలది విని తానే బలములతో సాహసించి కృష్ణ దాటి ప్రతాపరుద్రగజపతిబలములతో సంగ్రామముఁ జేయనుద్దేశించి యోడలతో దాటసాగెను. తీరమున సురక్షితముగ నున్న ప్రతాపరుద్రుని సైన్యము విజృంభించి బాణవర్షము కురిపించుచున్నను వెనుకంగ వేయుటమాని మృత్యుముఖమునుండి బయలుపడినటుల నదీగర్భమునుండి బయటపడి కృష్ణదేవరాయలసైన్యము ఘోరసంగ్రామమునకు సన్నద్ధపడెను. ఆ ఘోరసంగ్రామమున రాయలసైన్యము పిక్కచెదురులేక వెన్నుజూపక యద్వితీయపరాక్రమముతోఁ బారి ప్రతిపక్షుల వెనుకడుగు వేయింపసాగెను. పాఱిపోవుసైనికులఁ గృష్ణదేవరాయలు వధింప నాజ్ఞాపించుటచే నెవ్వఁడును వెనుకంగ వేయక మారణకర్మమునకు ముందునకురికి యందఱు ప్రతాపరుద్రుని సైన్యము చాలవఱకు వినాశనము గావించిరి. విజయలక్ష్మి విద్యానగరసామ్రాజ్యము నేమఱక తిలకింపసాగెను.

కృష్ణదేవరాయలు రెండుమాసము లేకధాటిగఁ బ్రతాపరుద్ర

గజపతితోఁ బోరాడి యాతని బాఱఁదోలి విజయముగడించి తిమ్మరుసుమంత్రికి సహాయమాచరించుటకై మిగిలినసైన్యముతోఁ గొండవీటి కరుదెంచెను. ఇంతలోఁ దిమ్మరుసుమంత్రి కొండవీటిదుర్గమును రెండుమాసములు ఘోరముగ ముట్టడించి కోటనంతయుఁ బగులఁ గొట్టి యాదుర్గమును బరిపాలించు వీరభద్రగజపతిని బట్టుకొనుప్రయత్నములో నుండెను. విజయమంతయుఁ దిమ్మరుసుమంత్రియె గడించెను. సకాలమునకు గృష్ణదేవరాయ లరుదెంచి కొండవీటిదుర్గమునఁ బ్రవేశించి దుర్గపరిపాలకుఁడగు వీరరుద్రగజపతిని జీవగ్రాహిగఁ జేకొనెను. తిమ్మరుసుమంత్రి యమోఘపరాక్రమాతిశయముచేఁ గొండవీటిదుర్గము కైవసమయ్యెను. దానిచేఁ గృష్ణనదిహద్దుగల యాంధ్రదేశమంతయు హస్తగతమయ్యెను. ఇటులె కృష్ణదేవరాయలు జయించినటులఁ జెప్పఁబడుదుర్గములలోఁ గొన్నింటినేని తిమ్మరుసుమంత్రి జయించియుండునుగాని శాసనాదికాధారములు దొరకునఱ కెటుల నిర్ధారణచేయ వీలులేదు. తిమ్మరుసుమంత్రి తన మేనల్లుఁడగు నాదెండ్ల గోపమంత్రిని కొండవీటిరాజ్యమునకు సర్వాధికారములతో రాజప్రతినిధిగ నియోగించి కృష్ణదేవరాయలతోఁ బూర్వదేశ జైత్రయాత్రకేగెను. తిమ్మరుసుమంత్రీశ్వరుఁడు స్వయముగాఁ గొండవీటిదుర్గమును జయించినటుల నాదెండ్ల గోపమంత్రి యొకానొక శిలాశాసనములో వ్రాసియుంటచే నీయంశము నిశ్చయమనుటకు సందియముండదు. పాఠకులకు శాసనాంశము సైతము నివేదించి సత్యమెఱుంగఁ జేయుటయు నొకవిధికదా!

* * *

మహాప్రధాన శ్రీసాళ్వ తిమ్మస్సచివశేఖరః
శ్రీకృష్ణరాయనృపతే స్సామ్రాజ్య మధితిష్ఠతి
శ్రీసాళ్వతిమ్మస్సచివో కౌండిన్యకులశేఖరః
వేమయామాత్యతనయరామయామాత్యనందనః

* * *

సప్తాంగోపేతశక్తిత్రితయ చతురుపాయైశ్చమంత్రీశ సాళ్వే
తిమ్మాఖ్యేకొండవీట్యాం గజపతినిహతాన్ రాజహంసాన్ గృహీత్వా

శాకాబ్దాః మార్గయంతే గిరిపురజలధిక్ష్మాను గూఢం ప్రవీణాః ॥

సాళువాంకశకవత్సరగణ్యే ఽ షాఢశుద్ధ హరివాసర సౌరౌ,
సాళ్వతిమ్మసచివేన గృహీతం కొండవీటినగరం నగరాజం ॥
—కొండవీటి పోలేరమ్మగుడివద్ద శాసనము.

సాళువ తిమ్మరుసుమంత్రి స్వయముగాఁ గొండవీటిదుర్గమును శాలివాహనశక ౧౪౩౭ ఆషాఢ శు ౧౧ శనివారమునకు సరియగు క్రీ. శ. ౧౫౧౫ సంవత్సరం ౨౩వ జూను తేదిని స్వాధీన పఱచుకొని విజయపతాకమును స్థాపించెను. ఈవిజయము వలనఁ దిమ్మరుసుమంత్రి సంగ్రామ నైపుణ్యము వేద్యముకాఁగలదు. తిమ్మరుసుమంత్రి, కృష్ణదేవరాయలు తూర్పుదేశమును జయించి వచ్చునప్పటికి వృద్ధుఁడయ్యెను. అయిన నీవృద్ధవీరుఁడు సంగ్రామమునఁ బరశురామునకు ద్రోణునకు భీష్మునకు సాటిగ ఘోరముగఁ బోరాడి పరాజయము నెఱుఁగకుండ సంకల్పసిద్ధుఁడై చాలకాలము జీవించెను. ఈతఁడు వార్ధకమున విజయయాత్రలకేగుట మానివేసెను. తిమ్మరుసుమంత్రివాక్సహాయముతోఁ గృష్ణదేవరాయలు స్వయముగ నొనరించిన విజయయాత్రలలో రాచూరివిజయము మొదటిది.

బహామనిరాజ్యము కృష్ణదేవరాయల రాజ్యకాలమున నైదు భాగములుగఁ జీలిపోయెను. అందుచేఁ బ్రతిమహమ్మదీయదుర్గము బలవిహీనమై యుండెను. ఈయదనెఱింగి తిమ్మరుసు తెలిపిన శుభసమయమున కృష్ణదేవరాయలు (క్రీ శ. ౧౫౨౦ లో) మహమ్మదీయప్రభువుల జయించి రాచూరు ముదిగల్లుదుర్గముల స్వాధీనముఁ గావించికొనెను. విజాపురముసుల్తానగు నాదిల్‌షాహ రాయలతోఁ బ్రతిఘటింపఁజాలక దేశత్యాగముఁ గావించెను. ఈసంగ్రామమునఁ గృష్ణదేవరాయలతో నేనులక్షలసైన్యము సంగ్రామమున కేగినట్లును గోవిందరాజు ముప్పదివేల సైన్యమున కధినాథుఁడైనట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. విద్యానగరసామ్రాజ్యాధీశ్వరులగు పూర్వులెవ్వరు

జయింపని మహమ్మదీయదుర్గముల తిమ్మరుసుమంత్రి రాజనీతిచేఁ గృష్ణదేవరాయలు జయించి సిద్ధసంకల్పుఁడై యశస్సు గడించెను. ఈమధ్యకాలములోఁ గృష్ణరాయలయంతటి పౌరుషశాలియు విస్తారమగు రాజ్యమును బాలించినవాఁడును ఎడతెగక విజయయాత్రల గావించినవాఁడును మఱియొకఁడు లేఁడనుట వాస్తవము. కృష్ణదేవరాయలు స్వయముగఁ గవియై యాముక్తమాల్యదయను ప్రౌఢప్రబంధమును విరచించుటెగాక పలువురు విద్వత్కవుల తనసంస్థానమున నుంచుకొని వారిచేఁ గృతులంది యాంధ్రదేశమునకు నాంధ్రవాఙ్మయమున కింతయనరాని మేలు గావించెను. శ్రీకృష్ణదేవరాయలు భాషలో నింతపరిశ్రమ గావించుటకు భాష నింత యాదరించుటకుఁ దిమ్మరుసుమంత్రి ప్రోత్సాహము ప్రధానకారణము. తిమ్మరుసుమంత్రి సప్తసంతానము లొందిన మహామహుఁడు. కవులపై మిగుల నభిమానము కలవాఁడు. అదిగాక సంస్కృతములో గొప్ప విద్వాంసుఁడు. తిమ్మరుసుమంత్రి సంస్కృతవాఙ్మయమునఁ గల బాలభారతమునకు వ్యాఖ్యానముఁ గావించెను. ఇంతియగాక యాకాలమున ముఖ్యముగ వ్యవహారములోనున్న పారసీక సంస్కృతాంధ్రకర్ణాట భాషలలో మంచి యభినివేశముఁగలవాఁడై యుండెను. ఇట్టిమంత్రి సామ్రాజ్యధూర్వహుఁడగుటవలననే విద్యానగరసంస్థానము విద్యా+నగర సంస్థానమైనది. తిమ్మరుసుమంత్రి శక్తిసామర్థ్యములు తెలుపు గ్రంథములు శాసనాదులు లేమిచేఁ జరిత్రము సంక్షేపింపక తప్పినదికాదు.

తిమ్మరుసుమంత్రి యింటిపేరు సాళ్వవారు. ఆకాలమునందుఁ జంద్రగిరిని సాళ్వనరసింహరాజు పాలించుచుంటచే నీతిమ్మరుసుమంత్రి గూడ నాసాళ్వవారి సంబంధియెకాన క్షత్రియుఁడని పాశ్చాత్యచరిత్రకారులు భ్రమపడియున్నారు. ఇది చాల ప్రమాదము. తిమ్మరుసుమంత్రి నియోగియనుట కనేకాధారములు కలవు. పూర్వోదాహృతములైన శాసనములవలననే నియోగియని విశ్వసింప వీలగుచున్నది. తిమ్మరుసుమంత్రి శాసనము లనేకస్థలములయందుఁ గానవచ్చుచున్నవి.

తిమ్మరుసుమంత్రి తన సంకల్పముల నన్నింటిని సాధించి శ్రీకృష్ణదేవరాయుల నతివిస్తృతమైన కర్ణాటాంధ్రయవన ద్రవిడరాజ్యముల కధినాథుని గావించి యాతనిశుభమునే సంతతము హృదయమునఁ గాంక్షించి వార్ధకమునఁ గాలవశమున మరణించియుండుననుట యథార్థము. తిమ్మరుసుమంత్రిపై దేశీయుల కాకాలమునుండి నేఁటివఱకింతయనరాని యభిమానముకలదు. ఇట్టిస్థితిలోఁ గృష్ణరాయలవంటి ధర్మస్వరూపుఁడగు రాజు తిమ్మరుసువంటి విశ్వాసపాత్రునియెడ దురంతమును జేయ సాహసింపఁడు. అట్లు జరిగియే యున్నచోఁ దదనంతరచరిత్రకారులు శ్రీకృష్ణదేవరాయలచరిత్రములు గలుషితములు గావించి కృతార్థులగువారె. పాపమునకు భయపడు హైందవులలోఁ జేరిన కృష్ణరాయసార్వభౌముఁ డిట్టిదురంతముఁ గావింపఁడనియుఁ, దిమ్మరుసు తన జీవితములో నట్టినైచ్యము ననుభవించియుండఁడనియు మనము విశ్వసించి తీఱవలయును. దేశీయుల హృదయరీతుల నెఱిఁగిన మనము పక్షపాతదూరులు వంచకులునగు పరదేశీయుల చరిత్రములు విశ్వసించి మాతృదేశమును కళంకితము గావించుటకంటె ద్రోహము వేఱులేదు.

---

# రామయభాస్కర మంత్రి.

"సీ॥ నిర్మించె నేమంత్రి నిరుపమప్రాకార నవకంబు గోపికానాథపురము
నిలిపినాఁ డేమంత్రి నియతవైభవముల గోపికావల్లభుఁ గూర్మివెలయఁ
బాలించె నేమంత్రి ప్రకటధర్మఖ్యాతి మహిమమీఱఁగ నాంధ్రమండలంబు
గెలిచినాఁ డేమంత్రి లలితవిక్రమమునఁ బ్రబలుఁడై యవనులబలము నెల్ల
తే॥ గీ॥ నతఁడు భూపాలమంత్రీంద్ర సతతవినుత
ధీవిశారదుఁ డచ్యుత దేవరాయ
మాన్యహితవర్తనుఁడు శౌర్య మహితయశుఁడు
భానుతేజుండు రామయ భాస్కరుండు॥"

కొండవీటిసామ్రాజ్యము మొదట రెడ్డిరాజులచేతను పిమ్మట గజపతులచేతను పాలింపఁబడెను. విభవమున రాజ్యవిస్తారమునను

దీనికి సాటియైన దుర్గ మాకాలమున వేఱొకటిలేదు. కర్ణాటరాజ్యాధీశ్వరుఁడగు కృష్ణరాయ లీదుర్గము నెటుల వశముఁ గావించికొనినదియుఁ దిమ్మరుసుమంత్రిజీవితములో వ్రాసియున్నారము. కృష్ణదేవరాయల యనంతర మాతనిరాజ్యమంతయు నాతనిసోదరుఁడగు నచ్యుతరాయల హస్తగతమయ్యెను. ఆకాలమున నచ్యుతరాయలకుఁ బ్రతినిధియై (గవర్నరుగ) రామయమంత్రిభాస్కరుఁడు కొండవీటిసామ్రాజ్యము నేలసాగెను. భాస్కరమంత్రు లాకాలమునఁ బలువురుంటచే నీతని రామయమంత్రిభాస్కరుఁడని జనకునినామముతోఁ గలిపి వ్యవహరించువాడుక గలదు. భాస్కరులు పలువు రాకాలమున నుండిరనుట కీరామయభాస్కరునిగూర్చిన చాటుధార నిదర్శనము కాఁగలదు.

"మ॥ సరిబేసై రిపుడేల భాస్కరులు భాసానాథపుత్రా! వసుం
ధరయందొక్కఁడు మంత్రియయ్యె: వినుకొండన్ రామయామాత్యభా
స్కరుఁడో, యానయినన్ సహస్రకరశాఖల్ లే, వదే యున్నదే
తిరమైదానముఁ జేయుచో రిపుల పేరిన్ వ్రేయుచో వ్రాయుచోన్॥"

రామయభాస్కరుఁడు నందవరీకి నియోగి. ఇతనివంశములోఁ బ్రధానపురుషుఁడు హరిదాసుగ నుంటచేఁగాబోలు, నితనియింటిపేరు హరిదాసువారని విష్ణుమిత్రోపాఖ్యానమునఁ గొటికలపూడి సోమనాథకవి వ్రాసియున్నాఁడు. రామయభాస్కరుఁడు నిరంకుశుఁడై కొండవీటిసామ్రాజ్యము నంతయు సర్వస్వతంత్రములతోఁ బాలించి మిక్కిలి ప్రతిష్ఠగాంచెను. ఇతఁడు కావింపని దానములులేవు. ఈతని త్యాగమును బోధించు చాటుపద్యములు కథలనేకములు వాడుకలోనున్నవి. కార్యవాదమున ఖడ్గవాదమున నీ మంత్రివర్యుఁడు ప్రౌఢి ఘనుఁడై తలయెత్తిన సామంతుని నడఁగఁద్రొక్కుచుఁ బరరాజుల సామ్రాజ్యములో నడుగుఁ బెట్టనీయక వినుకొండ బెల్లముకొండ తంగెడలోనగు దుర్గములలో బలముల నుంచి కొండవీటిదుర్గము ముఖ్యస్థానముగఁ జేసికొని దేశమునంతయు నేకచ్ఛత్రముగాఁ బాలించి యచ్యుతరాయల కృతజ్ఞతకుఁ బాత్రమయ్యెను. కృష్ణదేవరాయలు

ఈనియోగిశిఖామణి క్రీ.శ. ౧౪౬౦ సంవత్సరమున జనించియుండ వచ్చునని చరిత్రకారుల విశ్వాసము. రాచూరి దుర్గమును రాయల వారు ౧౫౨౦ క్రీ. శ. లో జయించెను. అప్పటికిఁ దిమ్మరుసు మంత్రి యఱువదిసంవత్సరములు దాటినవృద్ధుఁడై యుండును. కృష్ణ దేవరాయలు క్రీ॥ శ॥ ౧౫౨౯ లో మరణించియుండునను వాదము విశ్వాసపాత్రముగ నున్నది. * ఇతరచరిత్రకారులు క్రీ॥శ॥ ౧౫౩౦ లో గతించినటు లూహించియున్నారు. మొదటిసిద్ధాంతమె నిశ్చయ మైనచో రాయలు మరణించునాఁటికిఁ దిమ్మరుసు ౬౯ సంవత్సర ములవాఁడనియు, రెండవ సిద్ధాంతమే నిశ్చయమైనచో ౭౦ సంవత్స రములవాఁడనియుఁ దెలిసికొనవచ్చును. ఎట్లైనను రాయల మరణ కాలమునాఁటికి దిమ్మరుసుమంత్రి జీవించియుండెనేని వృద్ధగనుండి పరసహాయశరణ్యుఁడై కాలక్షేపముఁ జేయుచుండెననుట విశ్వసనీ యము. బహుశః తిమ్మరుసుమంత్రి రాయలవారికంటె ముందుఁ బర లోకము నలంకరించియుండును. వీరేశలింగంపంతులువా రేయాధార ములఁబట్టియోగాని రాయలకంటె మూఁడుసంవత్సరములముందుఁ దిమ్మరుసుమంత్రి గతించినటుల వ్రాసియున్నారు. తిమ్మరుసుమంత్రిపైఁ గృష్ణరాయలకుఁగల గౌరవప్రతిపత్తుల విరళముగ వ్రాసియే యుం టిమి. అట్టి కృష్ణదేవరాయలయభిప్రాయము తిమ్మరుసునెడ నేనాఁ టికేని మాఱునని మనము విశ్వసింపఁజాలము.

కృష్ణదేవరాయలు తిమ్మరుసుమంత్రియెడ నెట్టిద్రోహము నేని గావించినటులఁ జరిత్రములయందు దండకవిలెలయందు స్థానికచరిత్ర ములయందు వ్రాయఁబడి యుండలేదు. అట్టి ప్రవాదములు సైతము మనము వినియెఱుంగము. మహానుభావులగు రాజులపై మిథ్యా

---

* సూయల్ దొరగారు కృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౩౦ లో గతించియుండు నని వ్రాసియున్నారు. కె. వి. లక్ష్మణరావు, ఎం. ఏ. గారు మఱికొన్ని యుపపత్తులఁ జూపి క్రీ. శ. ౧౫౨౯ లో గతించినటుల వ్రాసియున్నారు. (చూ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలోని వ్యాసము.)

పరివాదముల నారోపించి ప్రజావిశ్వాసమును భంగముగావించుట పాశ్చాత్యచరిత్రకారులయందు దందండు నైజముగఁ గానవచ్చుచున్నది.

అట్టి అనృతకల్పనములలో నీక్రింద నుదాహరింపఁబోవునది యొకటి. వీరనరసింహరాయలపుత్త్రునివలన ముందెట్టి యపాయము వచ్చునోయని కృష్ణదేవరాయలు తన పుత్రునకుఁ బట్టాభిషేకముఁ గావించెనఁట. కాలవశమునఁ బట్టాభిషిక్తుఁడైన కొమారుఁడు మరణింపఁ దిమ్మరుసుమంత్రియు నాతనికొమారుఁడు సోదరుఁడు కలిసి యీదుష్కృత్యము గావించిరని దుర్మార్గుఁడై కృష్ణరాయ లామువ్వురిగుడ్లు తీయించి కారాగారములో నుంచెనఁట. తిమ్మరుసుమంత్రి మూఁడుసంవత్సరములు కారాగారమున జీవించి యుండి పరలోకము చేరెనఁట. ఇది నన్నిసనుపోర్చుగీసు చరిత్రకారుఁడు వ్రాసినదిగాన వేదవాక్యమని పాశ్చాత్యవ్యామోహపీడితుఁడగు నొక చరిత్రకారుఁడు వ్రాసెఁగాన విసర్జనీయము. డెబ్బదియేండ్లు నిండిన వృద్ధుని, తన సామ్రాజ్యమునకు సమస్తవిధముల సహాయమైన మహానుభావుని, ననేకాపత్కాలములలోఁ దన ప్రాణరక్షణముఁ గావించిన ప్రాణదాతను, కాలముతీఱినవానిని గ్రుడ్లుతీయించినచోఁ గృష్ణరాయల దుశ్చరిత్రము లోకమునంతటను వ్యాపించియుండెడిదె. పోర్చుగీసు చరిత్రకారుఁడు వ్రాసినయంశము యథార్థమైనచో నట్టి పరివాదము నేఁటి వఱకుఁ బ్రపంచముఖమున శాశ్వతముగ నుండవలసినదె. ఈమిథ్యావాదమును సత్యమని శాసించుట దేశీయచరిత్రకారుల కొక గొప్ప కళంకమనుట కెట్టి సంశయములేదు. కృష్ణదేవరాయ లాఘాతుకకృత్యమే గావించెనేని యాతని నరరూపరాక్షసుఁడని తెలుపవలసినదె. ఈ యత్యాచారము రాయలు తిమ్మరుసునెడనే గావించియుండెనేని యాంధ్రదేశము పశ్చాత్తాపమునొంది యాపాపమును మఱువక స్మరించుచునేయుండును. దేశమునం దాపరివాదములేనపుడు పాశ్చాత్త్యుల యసత్యవాదమును విశ్వసించి చరిత్రగ్రంథములో వ్రాయుట మిగుల పరితాపకరము.

తిమ్మరుసుమంత్రి తన సంకల్పముల నన్నింటిని సాధించి శ్రీకృష్ణదేవరాయుల నతివిస్తృతమైన కర్ణాటాంధ్రయవన ద్రవిడ రాజ్యముల కధినాథుని గావించి యాతనిశుభమునే సంతతము హృదయమున నెంచి వార్ధకమునఁ గాలవశమున మరణించియుండుననుట యథార్థము. తిమ్మరుసుమంత్రిపై దేశీయుల కాకాలమునుండి నేఁటివఱ కింతయనరాని యభిమానముక లదు. ఇట్టిస్థితిలోఁ గృష్ణరాయలవంటి ధర్మస్వరూపుఁడగు రాజు తిమ్మరుసు వంటి విశ్వాసపాత్రునియెడ దురంతమును జేయ సాహసింపఁడు. అట్లు జరిగియే యున్నచోఁ దదనంతరచరిత్రకారులు శ్రీకృష్ణదేవరాయలచరిత్రములు గలుషితములు గావించి కృతార్థులగువారె. పాపమునకు భయపడు హైందవులలోఁ జేరిన కృష్ణరాయ సార్వభౌముఁ డిట్టిదురంతముఁ గావింపఁడనియుఁ, దిమ్మరుసు తన జీవితములో నట్టినైచ్యము ననుభవించియుండఁడనియు మనము విశ్వసించి తీఱవలయును. దేశీయుల హృదయరీతుల నెఱిఁగిన మనము పక్షపాతదూరులు వంచకులునగు పరదేశీయుల చరిత్రములు విశ్వసించి మాతృదేశమును కళంకితము గావించుటకంటె ద్రోహము వేఱులేదు.

---

# రామయభాస్కర మంత్రి.

"సీ॥ నిర్మించె నేమంత్రి నిరుపమప్రాకార నవకంబు గోపికానాథపురము
నిలిపినాఁ డేమంత్రి నియతవైభవముల గోపికావల్లభుఁ గూర్మి వెలయఁ
బాలించె నేమంత్రి ప్రకటధర్మఖ్యాతి మహిమమీఱఁగ నాంధ్రమండలంబు
గెలిచినాఁ డేమంత్రి లలితవిక్రమమునఁ బ్రబలుఁడై యవనులబలము నెల్ల
తే॥ గీ॥ నతఁడు భూపాలమంత్రీంద్ర సతతవినుత
ధీవిశారదుఁ డచ్యుత దేవరాయ
మాన్యహితవర్తనుఁడు శౌర్య మహితయశుఁడు
భానుతేజుండు రామయ భాస్కరుండు."

కొండవీటిసామ్రాజ్యము మొదట రెడ్డిరాజులచేతను బిమ్మట గజపతులచేతను బాలింపఁబడెను. వివిధపమున రాజ్యవిస్తారమునను

దీనికి సాటియైన దుర్గ మాకాలమున వేఱొకటి లేదు. కర్ణాటరాజ్యాధీశ్వరుఁడగు కృష్ణరాయ లీదుర్గము నెటుల వశముఁ గావించికొనినదియుఁ దిమ్మరుసుమంత్రిజీవితములో వ్రాసియున్నారము. కృష్ణదేవరాయల యనంతర మాతనిరాజ్యమంతయు నాతనిసోదరుఁడగు నచ్యుతరాయల హస్తగతమయ్యెను. ఆకాలమున నచ్యుతరాయలకుఁ బ్రతినిధియై (గవర్నరుగ) రామయమంత్రిభాస్కరుఁడు కొండవీటిసామ్రాజ్యము నేలసాగెను. భాస్కరమంత్రి లాకాలమునఁ బలువురుంటచే నీతని రామయమంత్రిభాస్కరుఁడని జనకునినామముతోఁ గలిపి వ్యవహరించువాడుకగలదు. భాస్కరులు పలువు రాకాలమున నుండిరనుటకీ రామయభాస్కరునిగూర్చిన చాటుధార నిదర్శనము కాఁగలదు.

"మ॥ సరిజేసె రిపుడేల భాస్కరులు భాషానాథపుత్రా! వసుం
ధరయందొక్కఁడు మంత్రియయ్యె: వినుకొండన్ రామయామాత్యభా
స్కరుఁడో, యానయినన్ సహస్రకరశాఖల్ లే, వదే యున్నదే
తిరమైదానముఁ జేయుచో రిపుల మోతిన్ వ్రేయుచో వ్రాయుచోన్॥"

రామయభాస్కరుఁడు నాదవకికి నియోగి. ఇతనివంశములోఁ బ్రధానపురుషుఁడు హరిదాసుగ నుంటచేఁగాబోలు, నితనియింటిపేరు హరిదాసువారని విష్ణుమిత్రోపాఖ్యానమునఁ గొటికలపూడి సోమనాథకవి వ్రాసియున్నాఁడు. రామయభాస్కరుఁడు నిరంకుశుఁడై కొండవీటిసామ్రాజ్యము నంతయు సర్వస్వతంత్రములతోఁ బాలించి మిక్కిలి ప్రతిష్ఠగాంచెను. ఇతఁడు కావింపని దానములులేవు. ఈతని త్యాగమును బోధించు చాటుపద్యములు కథలనేకములు వాడుకలోనున్నవి. కార్యవాదమున ఖడ్గవాదమున నీ మంత్రివర్యుఁడు ప్రసిద్ధుఁడై తలయెత్తిన సామంతుని నడఁగఁద్రొక్కుచుఁ బరరాజుల సామ్రాజ్యములో నడుగుఁ బెట్టనీయక వినుకొండ బెల్లముకొండ తంగెడలోనగు దుర్గములలో బలముల నుంచి కొండవీటిదుర్గము ముఖ్యస్థానముగఁ జేసికొని దేశమునంతయు నేకచ్ఛత్రముగాఁ బాలించి యచ్యుతరాయల కృతజ్ఞతకుఁ బాత్రమయ్యెను. కృష్ణదేవరాయలు

గతింపఁగనే రాజ్యమున ననేక కల్లోలములు జనించెను. రాజకుటుంబము లో ననేకాందోళనము లుత్పత్తిల్లెను. అచ్యుతదేవరాయలకాలములో రాజ్యమున శాంతి మిగుల స్వల్పముగానైనను లేదనుట యథార్థము. ఈ సంకులావస్థలో రామయభాస్కరుఁడు రక్తపాతము గావింపక తప్పినది కాదు. ప్రతిఘటించిన సామంతుల ననేకుల స్వతంత్రించి రూపుమాపెను. కృష్ణదాటిన ప్రతిపక్షబలముల నచటనే యంతమునొందించెను. ప్రజాశాంతికై రాజద్రోహులకఠినముల నణఁకించెను. ప్రజామారణమున కెక్కువ పాటుపడినవారిలో రామయమంత్రిభాస్కరుఁ డొక్కరుఁడు. అతఁడు విధి నెఱవేర్పక తప్పినదికాదు. ప్రతిసామంతునకు రాజ్యతృష్ణ బలమై సామ్రాజ్యమునె మ్రింగఁదలంచి విజృంభించుచున్న తఱి రాజప్రతినిధి శాంతముగనున్న మేలా? ఇట్టిస్థితిలోఁ బూర్వమంత్రు లగు ఖడ్గతిక్కన తిమ్మరుసుమంత్రి లోనగువారు క్షాత్రతేజమును మాటుపఱచుకొనఁజాలిరా? రామయామాత్యభాస్కరుఁ డొనర్చిన రక్తపాతమును గూర్చి మనము చర్చింపవలసిన పనిలేదు. అతని స్వామిభక్తి, రాజకార్యనిర్వహణనైపుణ్యము, రాజకీయపరిజ్ఞానము మాత్రము తెలిసికొని యానందింతము. అచ్యుతదేవరాయలు విద్యానగరమున క్రీ. శ. ౧౫౩౦ మొదలుకొని రాజ్యము నేలుచుండెను. ఆకాలముననె రామయామాత్యభాస్కరుఁడు కొండవీటికి రాజప్రతినిధిగ నియోగింపఁబడెను. రామయామాత్యభాస్కరుఁడు సప్తసంతానముల నొందెను. కొండవీటిలో శిల్పప్రశస్తి సాటు వేణుగోపాలస్వామి దేవాలయమును మిక్కిలి వ్యయముచేసి కట్టించెను. ఇప్పటి కాయాలయము మిగుల జీర్ణావస్థయందున్నను పూర్వవైభవముల సహస్రభంగుల వాకొనుచున్నది. రామయభాస్కరుని సామంతులలో డెబ్బది యిద్దఱు తిరుగఁబడి కప్పములగట్టుట మానివేసిరి. సామ్రాజ్యప్రతిషేధవాక్యములు సరకుచేయుటకుఁ బరాఙ్ముఖులైరి. వారలమూలమున రాజ్యమున నింత యనరాని యాందోళన ముదయించెను. రాజ్యమందలి ప్రజలలోఁ గొంద ఱాసామంతులపక్షమునఁ జేరి యధర్మప్రేరితులై కొండవీటిసామ్రాజ్యము నంతమొందింపఁ బ్రబలప్రయత్న

ములు చేయసాగిరి. రాజ్యవిప్లవకారులసంఖ్య క్రమముగ నెక్కుడు కాఁదొడంగెను. రాజకుటుంబములలోఁ గలిగిన కల్లోలములలోఁ దన్మయుఁడై యచ్యుతదేవరాయలు కొండవీటివిషయములో నెట్టి జోక్యమును గల్పించుకొనుటకు నశక్తుఁడై సర్వస్వతంత్రములు విశ్వాసపాత్రుఁడు ప్రభుభక్తిపరాయణుఁడు నగు భాస్కరమంత్రికె యొసంగెను. దానిచే రామయమంత్రిభాస్కరునిపై భారము మెండయ్యెను. సామదానభేదదండోపాయములతోఁ బ్రతికూలురను లోఁబరచుకొనుటకు భాస్కరుఁడు యథాశక్తిఁ బ్రయత్నించి విఫలమనోరథుఁడయ్యెను. ఇతఁడు కట్టించుచున్న గోపీనాథాలయము చాలవఱకుఁ బూర్తియయ్యెను. మూలవిరాట్టగు వేణుగోపాలవిగ్రహము సువర్ణముతోఁ జేయ స్వర్ణకారుల కాజ్ఞ యొసంగెను. శిల్పాచార్యుఁడొకఁడావిగ్రహనిర్మాణమునకుఁ బదిమాసములు గడువు గోరి ప్రతిష్ఠాకాలమున విగ్రహముచే వేణుగానముఁ జేయింతునని ప్రతిజ్ఞ యొనరించెను. దేశమునం దంతటను రామయమంత్రిభాస్కరుఁడు కట్టించు నాలయప్రతిష్ఠ మాఱుమ్రోగిపోయెను. సమర్థులగు శిల్పాచార్యు లనేకులు రావింపఁబడిరి. అహోరాత్రములు దేవాలయ నిర్మాణమునకుఁ బనులు జరుగసాగెను. ఆంధ్రదేశములో నద్వితీయముగ నాదేవాలయ ముండవలయునను సంకల్పము భాస్కరమంత్రి గలవాఁడగుటచే, చిత్రవిచిత్రములగు శిల్పములతో నాయాలయము కొన్ని సంవత్సరములకుఁ బూర్తికావింపఁబడెను. లోపల నాలయ మెటులు నిర్మింపఁబడుచున్నది, శిల్పిచిత్రము లెటులుండినది తిలకింపఁదలఁచి ప్రజ లువ్విళులూరసాగిరి. శిల్పులకుఁ దక్క మఱియొకరి కాలయమునం దడుగిడ నాజ్ఞయీయక ప్రతిష్ఠాసమయమువఱకు నన్యు లాలయమునఁ బ్రవేశింపకుండ ద్వారపాలకులుగ ఖడ్గహస్తుల నియోగించెను. ఆంధ్రదేశమునందంతట నాయాలయప్రశస్తి తీవ్రముగ నంతికంతకు వ్యాపించెను. ఆలయనిర్మాణము ప్రహరియు గోపురములు సంపూర్తియయ్యెను. రామయమంత్రిభాస్కరుఁడు ప్రహరీలోపల నొకచో నొక బావి త్రవ్వించి ప్రతిఱాతిసందున బదునుకత్తులఁ బెట్టించి పై నొక ఱాతిని

బలపించెను. దానికి సంబంధించిన యంత్రము నొకశిల్పాచార్యుని యధీనము గావించెను. ఎవరేని యాకత్తుల బావిపైనున్న శిలమీఁదఁ జేరఁగనే నీయంత్రమును ద్రిప్పినచో శిల యాకస్మికముగ లోనికి జాఱి పైనున్నవా రాకూపమునఁబడి కత్తులచేఁ దుత్తునియలగునటులఁ జేయఁబడెను. ఈ సంకేతము శిల్పాచార్యునకు రామయమంత్రిభాస్కరునకుఁ దక్క మఱియొకరికిఁ దెలియదు. ఈ శిల్పము నేలచేయించెనో శిల్పాచార్యునకుసహితము తెలియదు. సిద్ధాంతశాస్త్రప్రవీణులగు బ్రాహ్మణులు రామయమంత్రిభాస్కరుని యనుజ్ఞచేఁ బ్రతిష్ఠకు శుభముహూర్తము నిశ్చయించిరి. ప్రతిష్ఠార్థమై వస్తుసంభారము మిక్కిలిగ సేకరింపఁబడెను ప్రతిష్ఠాసమయమునందు సువర్ణవేణుగోపాల విగ్రహము వేణుగానముగావించునను ప్రతీతి దేశమునందెగఁబ్రాకుటచేఁ బ్రజలనేకులు ప్రతిష్ఠాసందర్శనమునకు నాహ్వానింపఁబడిరి. రామయమంత్రి భాస్కరుఁడు స్వయముగ బయలువెడలి సామంతరాజులనందఱ సందర్శించి యాలయప్రశస్తి నుగ్గడించి ప్రతిష్ఠకుఁ దప్పక దయచేయుమని ప్రార్థించెను. ప్రతిష్ఠాసమయమునకు రాజకీయోద్యోగులు సామంతులు పౌరులు గణకులు, వారువీరననేల, సామ్రాజ్యమునకు సంబంధించిన ప్రజలందఱు వచ్చిరి. సామంతబృందములోఁ జేరియు రాజ్యద్వేషముతోనున్న డెబ్బదియిద్దఱు సామంతులు గూడ రామయామాత్యభాస్కరునియాజ్ఞ శిరసావహించి దైవసందర్శనమునకుఁ బూర్వవైరముల మఱచి యేతెంచిరి. శుభముహూర్తము సమీపించెనని బ్రాహ్మణులు తొందరపడి యుచితకార్యములలో మెలఁగ సాగిరి. రాజులనేకులు దేవాలయముఁ జేరిరి. రామయమంత్రి [illegible]రు దు[illegible]చిన మాంబిక[illegible]

ప్రత్యక్షదైవమగు వేణుగోపాలుఁడు వేణుగానమును గావింపనున్నాఁడు. సత్వరమ యేతెండు. ప్రదక్షిణము నొకరివెంట నొకరు గావింపుఁడు. సమ్మర్దము మిక్కుటముగ నుండెఁగాన నందఱొక్కమాఱేగ వీలు కా"దని భాస్కరుఁడు వినయముగ విన్నవించి యాగవేదిక చేరెను. భాస్కరునిచే నియోజితుఁడగు శిల్పాచార్యుఁడు యంత్రమును గేల నుంచికొని సామంతుఁ డా కూపముపైనున్న శిలపైఁ బాదముపెట్టఁగనే త్రిప్పసాగెను. ఎప్పటిసామంతుఁ డపు డా శిలపైనుండి జారి లోనున్న కత్తులబావిలోఁబడి యంతరింపసాగెను. మఱియొకసామంతుఁడు వచ్చు సరికి శిల యథావిధిగఁ బఱచినట్టులనె యుండసాగెను. ఇటులఁ గ్రమముగ నఱువదియెనిమిదిమంది సామంతరాజు లేకక్షణమున నంతరించిరి. ప్రదక్షిణమున కేగిన యాఱువదియెనిమిదిమందిలో నొక్కఁడేని తిరిగిరానందులకు సంశయించి ద్వారాభిముఖముగనున్న నలుగురు సామంతులిది రామయామాత్య భాస్కరుని కృత్రిమమని తలంచి ప్రదక్షిణమునకు దేవాలయమునకు నమస్కారముఁ గావించి పలాయనము గావించిరి. ఆ యెద నెఱింగి ముందె యందులకై నియోజితులై యున్న వీరభటులా నలుగురు సామంతులను గరవాలముల కెఱఁగావించిరి.

ఈ వధావిషయము మిగుల రహస్యముగ నుంటచే నితరులెవ్వరు గ్రహింపఁజాలరైరి. ప్రతిష్ఠాదికములు మిగుల వైభవముగ జరిగెను. వెంటనే కార్యజ్ఞులగు డెబ్బదియిద్దఱు నాయకులనేరి డెబ్బదిరెండు దుర్గములకంపి రాజ్యమునందు భాస్కరమంత్రి శాంతిస్థాపించెను. రామయమంత్రిభాస్కరుఁ డొనరించిన యీ ఘోరకార్య ... ర్థించినను సన్మార్గముగ భావించినను నాతని ... రానేరదు. భాస్కరమంత్రి ... ములు సాటుచున్నవి దేశము ... తెలుపువచ్చునట్టి విప

మంత్రియనిగూడ నాకాలమున వ్యవహరించుచున్నటుల శాసనాదికములలో నాధారము కలదు. ఈతఁడు క్రీ. శ. ౧౫౮౦ మొదలు సుప్రసిద్ధుఁడై యున్నటులఁ జరిత్రములవలనఁ దెలియును. ఈ రామయమంత్రిభాస్కరుని సోదరి యనేకధర్మకార్యములు గావించెను. గోపీనాథజలధి యను పేరుతోఁ గొండవీటి సమీపముననున్న వంకాయలపాటియొద్దఁ జెరువుపోయించి యొకశాసనము వేయించెను. రామయమంత్రిభాస్కరుఁడు మిక్కిలి పౌరుషశాలియనియు ననేక యవనరాజన్యులను సంహరించెననియు శివవర్యుఁడనియు సప్తసంతానముల నందినవాఁడనియు నందు వ్రాయఁబడినది. భాస్కరమంత్రి సామంతులఁ జంపిన యంశము దండకవిలెయందేగాక కొండవీటిసీమవాసులగు ప్రజలందఱివలనసైతము తెలియుచున్నది. రామయమంత్రిభాస్కరుఁడీ గోపీనాథాలయము శత్రునాశనముకొఱకె కట్టించియుండఁడు. సప్తసంతానములలో నొకటియగుటచే నాలయనిర్మాణమునకుఁ బూనెను. భాస్కరుఁడు మిగుల నైశ్వర్యవంతుఁడు, రాజప్రీతినిధియునగుటచే సర్వాలంకారశోభితముగ మనోజ్ఞతరముగ నాలయము నిర్మింపఁగలిగెను. ఈకత్తులబావికథ కొండవీటిలో నెఱుఁగనివారు లేరు. కొంద ఈకత్తులబావి యాలయప్రహరిలోఁ గలదనియు మఱికొందఱు దుర్గపు దక్షిణద్వారముచెంతఁ గలదనియు వాకొనుచున్నారు. కాని యిప్పుడా కూపముగాని కూపవిషయము నెఱుఁగనగు గుర్తులు కాని కానవచ్చుటలేదు. ప్రపంచమునంతటను బ్రాఁకిన యీకథను కేవలము మృషయనఁజాలము. ఈమంత్రి శత్రుసంహారముపట్ల నిర్దయుఁడై వర్తించుటచేఁ బ్రజలలో నీతనియందు గౌరవాదికములు తగ్గినటులుమాత్రము ప్రకృత మీతనికూర్చి నాటకలోనున్న పద్యములవలన వేద్యమగుచున్నది. అంతమాత్రమున నీతనికీర్తి కొంత కళంకము రాఁజాలదు.

"ఆ. వె|| గోలకొండ మలకగోవుల భక్షించుఁ
గొండవీటి విప్రులయు నెల్ల

బాచమరుసు జేరి భక్షించుచున్నాడు
మలక మేలా బాచమరుసు మేలా॥"

ఈపద్య మప్పకవీయములో నుదహరింపఁబడినది. అప్పకవికిఁ బైకాలమునఁ గొండవీటిలోనున్నది రామయభాస్కరుఁడే. ఇతని బాచమంత్రియనుచు వ్యవహరించుచున్నట్లు లీతనిసోదరియగు చిన్నమాంబ శాసనములోని "శ్రీమాన భూదార్యయమంత్రి బాచప్రధానవర్యః" అనుభాగ మాధారము కాఁగలదు.




# అక్కన మాదన్న మంత్రులు.

"సీ॥ ఆంధ్రసామ్రాజ్యంబు యవనభూపతులచేఁ బ్రోచిత లీల నేలించినారు
కవులకుఁ బండితాగ్రణులకు లేవడి సమయగా ధనము నొసంగినారు
మ్లేచ్ఛభూనాథుల స్వచ్ఛమార్గంబునఁ జేర్చి ధర్మంబు రక్షించినారు
హైందవధర్మంబు లన్యభూపులవాతఁ బడకుండునటులఁ గాపాడినారు

తే॥గీ॥ మనుజమాత్రులె వారు దుర్మంత్రితంత్ర
జాలవిచ్ఛేదనైక విస్తారసార
శేముషీసత్కలాదిక జీవనులు
మహితు లక్కన మాదన మంత్రవరులు."

చిరకాలమునుండి మన మక్కన మాదనయను జంటనామము లాలకించుచున్నారము. ఈ మంత్రివర్యుల జీవితములు సమగ్రముగాఁ దెలిసికొనుట కాధారములు చాలినన్ని లేవు. సుప్రసిద్ధులగునాంధ్రుల నాంధ్రేతరులు తమవారని చెప్పికొనుట సహజముగాన వీరిని మహారాష్ట్రులని కొందఱనుచున్నారు. ఇది విశ్వసనీయముకాదు. వీర లాంధ్రులనుటకె ప్రమాణము లెక్కుడుకలవు.

అక్కన్న మాదన్నలలో మాదన్నగారె సర్వతంత్ర స్వతంత్రుఁడు, సమర్థుఁడును, నున్నతస్థితియందున్నవాఁడు నని తెలియుచున్నది.

అక్కన్న మాదన్నగారలకుఁగల బాంధవ్యాదికములు నిర్ణయింప వీలు కలుగదు. వీరినిగూర్చి యొకచిత్రకథ వాడుకలో నున్నది. అందు సత్యమెంతయున్నను వినుటకుమాత్రము యుక్తియుక్తముగ నున్నది.

మాదన్నమంత్రి దానకర్ణుఁడై యహోరాత్రములు లేదన కుండఁ దనగృహమున బ్రాహ్మణజనమునకు సత్రముఁ బెట్టుచుండు వాఁడఁట. ఆసత్రములోఁ జిరకాలమునుండి యక్కన్న భుజించుచుఁ గాలక్షేపము చేయసాగెను. అక్కన్నగారు సత్రమువారందఱితోఁ గూడఁ దాను మాదన్నగారికి సోదరుఁడనని చెప్పువాఁడు. రానురాను సత్రమువారేకాక మాదన్నగారి భార్యసైతము గౌరవముగా నక్కన్న గారిని దిలకించుచు భోజనాదికములలో శ్రద్ధవహింపసాగెను. ఒక నాఁడు మాదన్నగారిభార్య భర్తతో మంతనములనాడుచు "మీసహోదరుఁడు చాలకాలమునుండి సత్రములో భుజించుచు దిక్కు మాలినవానివలెనుండఁ జూచుచుండెద రేమి? సంస్థానములో నుద్యోగము నిప్పింపరాదా!" యని ప్రశ్నించెను. మాదన్న నివ్వెఱపోయి "సోదరుఁడెవరు? నేనెఱుఁగనే!" యనెను. అంత నాతనిధర్మమంత్రి "మన సత్రములో భుజించుచున్న యక్కన్నగారు మీ సహోదరుఁడని నే నాతనిముఖముననె వినియున్నాను. మీ రెఱుఁగనటుల భాషించుటేల?" యనెను. మాదన్న నివ్వెఱపోయి వెంటనే పరిచారకునిచే నక్కన్న గారిని పిలిపించి యుచితాసనముఁ జూపించి కూర్చుండఁజేసి "మిత్రమా! నీవెవ్వఁడవు? నీ నివాసమెద్ది? నీకునాకుఁగల బాంధవ్యమేదియో తెలుపు" మని యడిగెను. అక్కన్న మిగుల వినయముతో మాదన్నను జూచి నన్ను నీవెఱుంగక పోవచ్చును. నేను పెద్దమ్మ కుమారుఁడను. నీవు చిన్నమ్మకుమారుఁడవు. కావున మన మిరువురము సహోదరులము. ఇది నీకును నాకును మాత్రమె తెలియఁదగిన యంశము. నాయందింక ముందుఁగూడ నిటులె భ్రాతృగౌరవ ముంచవలయుననెను. నాఁటఁ గోలె మాదన్నయు నాతని ధర్మపత్నియు నక్కన్నగారిని మిగుల

దయతోఁ దిలకించుచు నింటనేయుంచి యాదరింపసాగిరఁట. ఈకథలోని సత్యాసత్యములను విచారింపఁబూనుట ప్రకృతము కాదు.

అబూహాసన్ కుతుబ్‌షాయను నామాంతరముగల తానీషా నామము మనము రామదాసుచరిత్రము పఠించిననాటినుండి వినుచునే యున్నారము. ఈతానీషా మిగుల పరాక్రమశాలియై హిందూ మహమ్మదీయుల నైకమత్యముగఁ బాలించుచు గోలకొండ ముఖ్యస్థానముగఁ జేసికొని చిరకాలము రాజ్యమును బరిపాలించెను. ఇతని వద్దనే మాదన్న ముఖ్యమంత్రియై రాజ్యాంగములను నిర్వహించుచుండెను. అక్కన్నమాదన్నగార లిరువురు సహోదరులనియుఁ, బింగళియను నింటిపేరు గలవారనియు, భారద్వాజగోత్రులనియుఁ దద్వంశీయులు చెప్పుచున్నారు. అక్కన్న మాదన్నగారల మేనల్లుఁడని మనము వినుచున్న కంచెర్ల గోపమంత్రియను రామదాసు సైతము నియోగియు, నాంధ్రుఁడు కావున నక్కన మాదనగారల నాంధ్రులా, కారాయనుచు విచారింప నవసరములేదు. అక్కన్న మాదన్నయను నామము లాంధ్రులలోఁ గానవచ్చుటవలనను జిరకాలము నాంధ్రదేశమునందె వీరుంటవలనను నాంధ్రులతో బాంధవ్యము గానవచ్చుటవలనను వీరల నాంధ్రులనియె విశ్వసించి తీఱవలయును.

తానీషావద్ద మాదన్న గారింతయనరాని గౌరవముతో మంత్రిపదవి నిర్వహింపసాగిరి. అక్కన్నగారు తానీషావద్ద సర్వసైన్యాధ్యక్షుఁడై రాజ్యక్షేమమునకై యావచ్ఛక్తి వినియోగింపసాగెను. మాదన్నగారు హిందూమహమ్మదీయుల కైకమత్యము ఘటించుచు భిన్నాభిప్రాయములఁ బాఱఁద్రోలుచు మిగుల జాగరూకతతో రాజ్యస్థితిగతుల నరయుచు రాజ్యపరిపాలనము గావించుచుండెను. అన్యశ్రేయమునకు సహింపని కొందఱు మహమ్మదీయులు దుర్మార్గమున కొడిగట్టి యక్కన్న మాదన్న గారియందు మహమ్మదీయజాతికి భిన్నాభిప్రాయమును గల్గింపసాగిరి. అట్టివారిలో మహమ్మద్ ఇబ్రహీం

అను వాఁడొకఁడు. ఇబ్రహీం ఖానీషావద్ద సర్వసైన్యనాయకుఁడుగ నుండి దుర్మార్గము లనేకములు గావించుచుండ నాతని దొలఁగించి మాదన్నగారు స్థలమున నక్కన్నగారిని జేర్చిరి. అదిమొద లక్కన్న గారియొక్కయు మాదన్నగారియొక్కయు మారణమున కిబ్రాహీము తన యావచ్ఛక్తి వినియోగింపసాగెను. తానీషావద్ద నుచిత మగు గౌరవభావము ప్రజలయెడ్ద భక్తివిశ్వాసములుగల యీమంత్రి వర్యుల నేవిధముగనేని వంచింపఁజాలక తరుణముకొఱకు వేచియుండెను. అక్కనమాదన లాతని లక్ష్యపెట్టరైరి.

మొగలురాజు లెట్లైన గోలకొండరాజ్యము హరింపఁ దీవ్రయత్నములు కావింపసాగిరి. ఔరంగజేబు మిగుల నాసక్తితో గోలకొండరాజ్యముకొఱకు గుటుకలు మ్రింగసాగెను అక్కన్న మాదన్నగార లీయంశముగ్రహించి రాజ్యములోని హిందూమహ్మదీయుల నైకమత్య మభివృద్ధిగావించి యాకాలమున బలవంతుఁడై యున్న శివాజీ చక్రవర్తితోఁ దానిషాకు స్నేహము కుదిర్చిరి. శివాజి గోలకొండ కొకమారువచ్చి తానీషాయొసంగిన యాతిథ్యము స్వీకరించి గోలకొండరాజ్యము సురక్షితముగఁ జేయుదునని వాగ్దానము గావించెను. శివాజి కాలధర్మము నొందినపిమ్మట శంభాజి రాజ్యమునకు వచ్చెను. అక్కన్న మాదన్నగారలు పూర్వమువలెనే శంభాజికిఁ దానీషాకు నైకమత్యము గుదుర్చిరి.

రాజ్యతృష్ణగల ఢిల్లీశ్వరుఁడగు నౌరంగజేబు గోలకొండరాజ్యము హరింపవలయునని పలుమారు సైన్యమును బంపెను. అక్కన్న మాదన్నగారు యవనాంధ్రసైన్యముల నెదురునడిపి యౌరంగజేబు సైన్యముల వినాశనము గావించిరి. అవమానపీడితుఁడగు నౌరంగజేబంతతో నాయత్నము మానుకొనక గోలకొండరాజ్యముకొఱకు దురాలోచనములు పెక్కు చేయసాగెను.

ఆకాలమున నీష్టుయిండియా కంపెనీవారు హిందూదేశమునఁ బ్రవేశించి మదరాసు, మచిలీపట్టణము లోనగుచోటుల చిన్న

చిన్న కొట్లుపెట్టి వ్యాపారము జేయసాగిరి. ఔరంగజేబునకుఁ గంపె నీవారికి నభిప్రాయము భేదించుటచే వారికి నిలువనీడ దొఱుకదయ్యెను. అపుడు కంపెనీవారు గోలకొండ సర్వాధికారములతోఁ బరిపాలించు చున్న యక్కన్న మాదన్నల నాశ్రయించి సముద్రతీర ప్రాంతములను గొలునకుఁ బుచ్చుకొని వ్యాపారముఁజేయ నిశ్చయించి యుపాయాంతరము నన్వేషింపసాగిరి. గోలకొండరాజ్యమున కంతటికి సుబేదారుగా నున్న పొగడాల లింగప్ప యను నొకసరదారు రేవులలోఁ గంపెనీవారి సామానులు దిగకుండ నాటంకపఱిచి కంపెనీవారి విజృంభణము నంతయుఁ మదముట్టింప సిద్ధపడెను. కంపెనీవా రక్కన్న మాదన్న గారల నాశ్రయించి వారల కనేకబహుమతులుగావించి వారల వంచించి పగడాల లింగప్పనెట్టి యాటంకమును గలిగింపవలదని లేఖ వ్రాయింపఁ జేసిరి. దేశస్వాతంత్ర్యము వాంఛించిన పగడాల లింగప్ప యభిప్రాయము నక్కన్న మాదన్నగారలు గ్రహింపకపోవుటవలననే భారతీయులకుఁ బరాధీనము ప్రాప్తించెను. కంపెనీవారు తెచ్చిన యక్కన్న మాదన్నగారి లేఖఁజూచి పగడాల లింగప్ప మంత్రులయవినీతికి విచారించి వెంటనే యక్కన్న మాదన్నగారలఁ గలసికొని యాంగ్లేయుల సంకల్పము దుర్నయము దురాలోచనము సాకల్యముగ నెఱిగించి వారలను జేరదీయరాదని ఖండితముగఁ దెలిపెను. యుక్తి యుక్తములగు లింగప్పమాటలకు నామోదించి యక్కన్నమాదనగారలు కంపెనీ వారివిషయములోఁ గనుగలిగి మెలఁగ నిశ్చయించికొనిరి.

పగడాల లింగప్పబోధనమువలన నక్కన్న మాదన్నగారలు తమయెడ భిన్నాభిప్రాయముగనుండిరనియు నిటులె యున్నచో నిలువనీడ లభింపదనియు నెటులేని వారిలోఁగొనవలయుననియు నిశ్చయించి కంపెనీవారు తరుణముకొఱకు వేచియుండిరి. ఇంతలో మాదన్నగారి తనయుఁడగు మల్లప్పయనువాని వివాహము సమీపించెను. అది గ్రహించి మాదన్నగారి కొక పీసె బంగారుగొలుసులు, 400 వరహాలు, అనేకామూల్యవస్త్రములు తెచ్చి బహుమానముగ నొసంగిరి. మాదన్న

గారి పేష్కారునకుఁ గొంతరొక్కము, మాదన్నగారి పినతండ్రికిఁ గొంతరొక్కము నిచ్చి యందఱఁ బరితృప్తిపఱచిరి. అక్కడికి మాదన్నగారు తృప్తినొంది కంపెనీవారి యిచ్ఛ ననుసరించి కోరినసముద్రపు రేవులలో వ్యాపారమునకు స్వతంత్రము నొసంగుటకు, ఖండాంతరముల నుండి వచ్చు నితరుల దేశమునుండి వెడలఁగొట్టుటకు నంగీకరించిరి. స్వల్పలాభము నపేక్షించి మాదన్నగా రిట్లు యిండియాకంపెనీవారికిఁ బ్రాపకము నొసంగి భారతీయపరాధీనమునకుఁ దోడ్పడిరనుట సంతాపకరము. మాదన్నగా రొనరించిన దీ లోపమొకటియె.

తానీషయు నక్కన్న మాదన్నగారలు చేయు ధర్మపరిపాలనము విప్లవకారులగు కొందఱకు మిగుల కష్టకరముగనుండెను. అట్టి వారిలోఁ బూర్వము సైన్యాధ్యక్షుఁడుగనుండి స్థానభ్రష్టుఁడైన మహమ్మద్ యిబ్రహీం ఒకఁడు. ఇతఁడు కొంత పలుకుఁబడి కలవాఁడగుటచేఁ దీవ్రముగఁ బ్రయత్నముఁజేసి యక్కన్న మాదన్నగారలయందు మహమ్మదీయజాతికంతకు ద్వేషము పుట్టించెను. విడిగనున్న నీతనివలన విప్లవము వచ్చునని తానీషా మహమ్మదుయిబ్రహీమునకు సేనానాయకపదవిమాత్ర మొసంగి వానిని జాగరూకతతోఁ దిలకింపసాగెను.

మాదన్నగారు మిగుల నాచారపరాయణుఁడు. ప్రతిదినముదయమునఁ బ్రాతఃకాలకృత్యములఁ దీర్చికొని చాలకాలము శివపూజ గావించి యనేకబ్రాహ్మణుల నాహ్వానించి వారిపంక్తిని భుజించి రాజకీయకార్యములు నిర్వహించువాఁడు. మాదన్న త్యాగశీలుఁడు. పండితపక్షపాతి. సర్వకాల సర్వావస్థలయందు విద్వత్సహవాసముఁ గావించుటచే నీతనికి గొప్పపాండిత్యముకూడ నలవడెను. మాదన్నగారు తమ యుపవనములోని సరోవరమున స్నానము గావించుచుండ నిబ్రహీంచేఁ బ్రేరేపితుఁడై వచ్చి యొకతురుష్కుఁ డాకొలనులో మునిఁగెను. మాదన్నగా రాతురుష్కుని సాహసమునకు మిగులఁ గోపించి వెంటనే యాతని శిక్షించిరి. దుర్మార్గుఁడగు నాయవనుఁడు దేహము నిండ గాయములు గావించికొని పురములోని మహమ్మదీయు లందఱకుఁ

జూపి మాదన్నగారి దుర్మార్గమును వేయివిధముల నుగ్గడించెను. మాదన్నగారి విషయమై తానీషాకుఁ దెల్పినను లాభములేదని మహమ్మదీయులందఱు నిశ్చయించి బ్రాహ్మణమంత్రులచేఁ దానీషా చేయించు దుండగములలో నిది యొకటిగ ఢిల్లీశ్వరునకు నివేదింపుమనివానిని బ్రోత్సహించిపంపిరి. వెంటనేవాఁడు బయలు వెడలి కొన్ని దినములకు ఢిల్లీకిఁ జేరి యౌరంగజేబును సందర్శించి తానొందినదురవస్థయుఁ దానీషా యొక్క యధర్మపరిపాలనము, అక్కన్న మాదన్నల యవినీతి యనునంశములఁగూర్చి లేనిపోనివి చాలసేపు ఘోషించెను. చాలకాలము నుండి గోలకొండ రాజ్యముకొఱకు ప్రయత్నము చేయుచు విఫల మనోరథుఁడగుచున్న యౌరంగజేబు గోలకొండరాజ్యములోని సైనికుల యంతరంగము రాజద్వేషము నాయావనునివలన సాకల్యముగ విని యిదియె తరుణమని తనకుమారుడగు మువాజ్జంఅనువాని కమితమగు సైన్యము నొసంగి పంపెను.

తానీషా, మువాజ్జం గోలకొండ రాజ్యమును ముట్టడింప వచ్చుచున్నాఁడని విని మార్గమధ్యమునఁ బ్రతిఘటించుటకై తనబలములో సగము నొసంగి మహమ్మద్ యిబ్రహీమును బంపి మిగిలిన సగముసైన్యము నక్కన్నగారి యాధీనముగావించి గోలకొండదుర్గమును రక్షింప నియోగించెను. అక్కన్న మాదన్నగారల నంతమునొందింపవలయుననియుఁ దానీషాను రాజ్యమునుండి తొలఁగింపవలయుననియుఁ దలంచినవాఁడగుటచే నౌరంగజేబుచేఁ బంపఁబడిన మువాజ్జం, ఖాఁజహాఁ అను వారితో మహమ్మదు యిబ్రహీం కలసి వారిని గోలకొండ దుర్గము వద్దకుఁ గొనిరాసాగెను. ప్రత్యర్థుల సైన్యమంతయు నమితోత్సాహముతో హైదరాబాదునకు సమీపములోనికివచ్చెను. తానీషా, మహమ్మద్ యిబ్రహీంయొనర్చినదుర్మార్గము నంతయు నాలకించి యపజయము నిశ్చయమని భావించి సైనికుల శక్తియున్నవఱకుఁ బోరుమని నియోగించి తానుప్రాణభీతిచే దుర్గములోనికేగి దుర్గద్వారము లన్నియు మూయించి యఱచేతిలోఁ బ్రాణములు పెట్టుకొనియుండెను.

మువాజ్జంసైన్యము స్వేచ్ఛగా గోలకొండదుర్గములోనికిఁ గను గందకుండఁ బ్రవేశించి ధనవంతులగృహముల దోఁచి స్త్రీలఁ జెఱఁ బట్టి యనేకదురంతములు గావించిరి. ఈ దుర్మార్గములన్నియు స్వామిద్రోహియగు మహమ్మదుయిబ్రహీము దగ్గఱయుండి చేయించెను. రాజమందిరములోఁ బ్రవేశించి తానీషాను, అంతఃపురకాంతలను జెఱఁ బట్టఁదలంచిరిగాని యప్పటికి సాయంకాలమగుటచేఁ గోటభేదించుటకుఁ బ్రొద్దుచాలదని యాప్రయత్నము మఱునాఁటియుదయమున జరుపవలయునని నిశ్చయించుకొనిరి.

ఈసంగ్రామమునకు ముఖ్యముగ బ్రాహ్మణులగు నక్కన మాదనగారలు మంత్రులుగ నుండుటయే కారణమని పరిజనులవలన విని యంతఃపురకాంతలు వీరభటులను దానీషాకుఁ దెలియకుండఁ బిల్పించి వారి కనేకభూషణముల నొసంగి యక్కన్న మాదన్నగారల వధించి వారి తలలఁ గొనిరమ్మని యాజ్ఞాపించిరి. హంతకులు త్రోవలు గాఁచి దాక్షిణ్యశూన్యులై నిర్దోషులగు నక్కన్న మాదన్నగారల రాజద్వారముముందుఁ దునిమి యుత్తమాంగము లంతఃపురమునకుఁ జేర్చిరి. వెంటనే యంతఃపురకాంతలు ఖండితశీర్షముల నొకవెండిపళ్లెరములోనుంచి మువాజ్జం వద్దకుఁ బంపిరి. అక్కన్న మాదన్నలు వధింపఁ బడఁగనే వీరావేశముతో మహమ్మదీయులందఱు విజృంభించి గోలకొండలోనున్న బ్రాహ్మణుల నందఱను జెండాడి రక్తప్రవాహములచే దుర్గమంతయుఁ గలుషితము గావించిరి. తానీషా మంత్రివర్యుల యొక్కయు బ్రాహ్మణులయొక్కయు దుర్మరణమునకు విచారము నొంది చేయునదిలేక రెండుకోటుల రూపాయ లపరాధము నొసంగి మువాజ్జంతో సంధి గావించుకొనెను. మువాజ్జంసైనికు లాసంగ్రామములో గోలకొండనగరములో నాలుగైదు కోటులకుఁబైగా ధనముఁ దోఁచికొనిరి.

౧౬౮౭ సంవత్సరములో నౌరంగజేబు సేనలతో గుల్బర్గాకుఁ బోవుచున్నటులఁ బ్రయాణమై యాకస్మికముగ గోలకొండను ముట్ట

Subba Rao.

Gatibandla venkata SubbaRao.



డించెను. తానీషా తనబలము నంతయు వినియోగించి యేడు మాసములు పోరాడి యోడిపోయెను. ఔరంగజేబు తానీషాను బంధించి ౧౬౮౭ లో దేవగిరిదుర్గముమీఁద జెఱఁబెట్టెను. అతఁడా కారాగృహమునందె మరణించెను.

అక్కన్నమాదన్నగారలు తానీషా సామ్రాజ్యమున క్రీ. శ. ౧౬౭౪ మొదలుకొని ౧౬౮౬ వఱకు నుండియుందురు. స్వామిభక్తిపరాయణులు సత్యప్రియులు నగు నీయాంధ్రమంత్రివర్యులకారణముగ జాతిద్వేషపరాయణులచే వధింపఁబడిరి. అక్కన్నమాదన్నలతో గోలకొండరాజ్య మంతరించెను. గోలకొండరాజ్య మష్టైశ్వర్యములతో నుంటకు నక్కన మాదనగారలు వినాశనమగుటకు మహమ్మద్ ఇబ్రహీము కారకుఁడు. అక్కన్న మాదన్నలు మరణించినను వారి చరిత్రము భారతజాతి యున్నంతవఱకు సజీవముగ నుండఁగలదు. అక్కన్న మాదనల రచ్చసావడులు బెజవాడకనకదుర్గాలయసమీపముననువారల సత్రము లనుప్రదేశము నందిగామసమీపమున మునియేటియొడ్డునను నేఁటికి దర్శనీయముగ నున్నది. అక్కనమాదన్నలు ధర్మసంస్థాపకులు. హిందూమహమ్మదీయసమ్మేళమునకు వారు పాటుపడి దేశమాతకు బలియొసంగఁబడిరి. వారానాఁడు నాఁటిన బీజమె యిప్పటికి మహావృక్షమై దుర్భేదమై ఫలవంతమైనది. మహాత్ముల జీవితములలోని ధర్మరహస్యముల గ్రహించుటకు దివ్యదృష్టి కావలెననుట కీయక్కన మాదన్నల చరిత్రమె ప్రమాణము.

సంపూర్ణము.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA103B184 |
| పుస్తకం పేరు | ఆంధ్ర మంత్రులు |
| తారీఖు | 26-10-2024 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |